దివ్యజ్ఞాన ఉపాసిక

# మేడమ్ హెచ్. పి. బ్లావట్‌స్కీ

## జీవితం - తత్వం



దివ్యజ్ఞాన ఉపాసిక

# మేడం హెచ్.పి.బ్లావట్‌స్కీ

జీవితం - తత్త్వం

"శ్రీవిరించి"

ప్రాప్తి బుక్స్
పోస్ట్‌బాక్స్ నెం. 5018
బెసెంట్ నగర్, మదరాసు - 600 090

DIVYAJNANA UPASIKA
LIFE AND PHILOSOPHY OF
MADAME H.P. BLAVATSKY
by "SRIVIRINCHI"

Published by :

PRĀPTI BOOKS
Post Box No. 5018,
Besant Nagar,
Madras - 600 090

First Edition :
NOVEMBER 1992
Second Edition (Thoroughly Revised)
AUGUST 2001

Price :
**Rs. 35/-**

Printers :
LAKSHMI GANAPATHI ART PRINTERS
2/1 Bradiepet, Guntur - 2.
Ph. : 235036

# విషయసూచిక

మానసిక, ఆధ్యాత్మిక పరిణామాలను సమన్వయపరచి పాశ్చాత్యదేశాలకు మొదటిమారుగా మానవుని ఉన్నతిని తెలియచెప్పిన వ్యక్తి మేడం బ్లావట్ స్కీ. ఫ్రాయిడ్, పావ్‌లోవ్, జేమ్స్‌లు భౌతిక, మానసికస్థాయిలను గుదిగూర్చి చెప్పిన తరుణంలోనే, ఈమె ఆ రెంటికి తోడుగా ఆధ్యాత్మ వికాసాన్ని జతపరచి పరంపరాగతమైన 'ఆత్మవిద్య'ను మనిషికి చేరువ చేశారు. ఆధునిక ప్రపంచ భావపరంపరలలో ఆధ్యాత్మ విద్య అనుపానులను చొప్పించిన ఘనత ఆమెదే.

—థియొడర్ రొజాక్

(THEODORE ROSZAK)

నూతన ఆధ్యాత్మఉద్యమాలలో 'థియోసఫీ'ది కేంద్రస్థానం. బ్లావట్‌స్కీ ఆమె అనుయాయులు తమ రచనల ద్వారా ముందు తరాలకు విలువ కట్టలేని మణులను అందచేశారు. పరపాలనలో క్రుంగుతున్న జన సందోహాలకు వారి ఆధ్యాత్మ ఔన్నత్యాన్ని ఎఱుకపరిచారు.

—రాబర్ట్ ఎల్‌వుడ్; హారీపార్టిన్

(ROBERT ELLWOOD; HARRY PARTIN)

# పరిచయ వాక్యాలు

పందొమ్మిదవ శతాబ్దంలోపుట్టి ప్రపంచాన్ని తనఆలోచన ధోరణలతో, అద్భుత విన్యాసాలతో విస్మయపరచిన మహనీయులలో మేడం హెచ్. పి. బ్లావట్‌స్కీ గణనీయురాలు. ఈమె రష్యాదేశంలో పుట్టి (1831) అతి చిన్న వయసులోనే బౌద్ధ సంప్రదాయాలతోను, ఆ సంబంధమైన ప్రకటనలతోను పరిచయం సంపాదించారు.

సృష్టిలోని అనేక రహస్యాలను అర్థం చేసుకునే అనేక సంస్థల గురించి తెలుసుకుంటూ బ్లావట్‌స్కీ ప్రపంచమంతటా పర్యటించారు. మహర్షులను, మహనీయులను సందర్శించారు. టిబెట్ ప్రాంతంలోని ఒక ఆశ్రమంలో కొన్నాళ్ళు తమ 'పరమగురువు' దగ్గర శిష్యరికం చేస్తూ, అక్కడే నిక్షిప్తంగా వుండిన అనేక రహస్యగ్రంథాలను పరిశీలించేందుకు అవకాశం కలిగించుకున్నారు. ఆ ఆశ్రమంలోని మహర్షులు ఆమెకు అనేక రకాలుగా సహకరించి ఆమెను 'ఆధ్యాత్మవిద్య'లో నిష్ణాతురాలిని చేశారు. వారి అండదండలతోను, ఆశీర్వచనాలతోను ఆమె తిరిగి మామూలు ప్రపంచానికివచ్చి ది థియొసాఫికల్ సొసైటి (THE THEOSOPHICAL SOCIETY) (తెలుగులో "దివ్యజ్ఞాన సమాజము" అని వాడుక.) అనే సంస్థను 1875లో స్థాపించగలిగారు. ఈ సంస్థ కార్యకలాపాలలో ఆమెకు హితుడు, సన్నిహితుడుగా వుండి, దానికి 'వ్యవస్థాపక - అధ్యక్షుడు'గా మెలిగినవాడు అమెరికాకు చెందిన కల్నల్ హెచ్.ఎస్. ఆల్కాట్ అనే ఆయన. వీరిద్దరూ సంస్థకు మూలపురుషులు. ప్రపంచవ్యాప్తంగా పర్యటనలు చేసి, సిద్ధాంత ప్రతిపాదనలుకూర్చి దీనిని 'అంతర్జాతీయ సంస్థ'గా రూపొందించారు.

ప్రపంచంలో ఇన్ని మతాలు యేమిటి ? ఇన్ని తత్త్వ దర్శనాలు ఎందుకు ? వివిధ విధాల ఆచరణలు ఎలా రూపు కట్టుకున్నాయి ? మేధస్సు ఎంతగానో వికసించి, విస్తరించి కొత్త కొత్త పోకడలు, అడుగుజాడలు వస్తూవున్న ఈ ప్రపంచంలో ఇంత అసమాధానత, అశాంతి, అసమరసత ఎందుకు

ఉన్నాయి?— ఇటువంటి ప్రశ్నలు తమకు తామే వేసుకుని వీటికి సమంజసమైన సమాధానాలు వెదుకుతూ మేడం బ్లావట్‌స్కీ అనేక రహస్యవిషయాలను, తాత్త్విక సమాచారాలను వెలికి తీసుకురాగలిగారు.

ఒకపక్క శాస్త్రవిజ్ఞానం (SCIENCE) పెరుగుతోంది. 'చూచినదే నమ్ముతాము తప్ప కంటికి కనిపించని వస్తువులు, లోకాలు, సూక్ష్మాతి సూక్ష్మమైన భావ తరంగాలు ఉన్నాయని నమ్మము—' అని ప్రపంచంలో ఆక్రందనలు వినవస్తున్నాయి. మరోపక్క- మతము సంప్రదాయాలు (RELIGION) పేరిట మౌఢ్యము, దురాచారము, మనిషిని మనిషే కాల్చుకు- వేధించుకు తినడానికి జంకని పరిస్థితి విపరీతంగా పెరిగిపోతోంది. మూల విషయాలలో మతము-తత్త్వము ఎంత ప్రశస్తమైనదయినా దానిపేరున మనిషికి 'హితం' జరగడానికి బదులు వెంపర్లాట. వేదన, పీడన సంప్రాప్తం అవుతున్నాయి. విజ్ఞానశాస్త్రం అనేక కొత్త కొత్త సంగతులను కనుక్కోగలుగుతున్నా మానవ జీవితంలో తటస్థ పడుతున్న అవలయలకు ఎగుడు దిగుళ్ళకు పరిష్కారాలు చూపలేకపోతోంది. మత విషయంలో మాదిరే శాస్త్రవిజ్ఞానంలోనూ మౌఢ్యం చోటు చేసుకుంటోంది.

ప్రపంచ నిర్మాణం- మానవజాతి అభ్యున్నతి గురించి తెలియచెప్పే తత్త్వశాస్త్ర అవగాహనలను మనుషులు అశ్రద్ధ చేస్తున్నారు. అవి జీవితానికి 'తక్షణం' పనికిరానివి అనే భ్రమలో పడిపోయి, సత్యాన్ని దూరం చేసుకుని నిరంతరమైన చీకటిలో కుందులాడుతున్నారు.

మేడం బ్లావట్‌స్కీ మతం, విజ్ఞానశాస్త్రం, తత్త్వదర్శనాలు మూడింటినీ సమన్వయపరచి, ఇవి మూల విషయంలో మనిషికి సత్య అవగాహనకు, పరిశీలనకు, సందర్శనానికి చేస్తున్న, చేయగల- కృషిని తెలియచెప్పటానికి ప్రయత్నించారు.

సర్వదేశ దశాకాలాలకు అన్వయించే 'దివ్యాజ్ఞ' (DIVINE ORDER) ఒకటి ఉన్నది. దీనికి వివిధ దేశాలవారు, సంస్కృతులవారు భిన్నమైన పేర్లు పెట్టుకున్నారు. తత్త్వతః మూల విషయాలు అన్నీ ఒక్కటే. వాటిలో చొరబడిన అసంబద్ధతలు, అంధ విశ్వాసాలు, తొలగించి విడమరచి చూడగలిగినట్లయితే మేధా సంపన్నుడైన మనిషికి ఈ విషయం తెలియడంలో యేమీ ఆలస్యం కాదు- అని ఆమె నిర్ధారించి చెప్పారు.



ఒక మహత్తర 'తత్త్వం' (PRINCIPLE) ఉన్నది. ఇది శాశ్వతము, అనంతము, అవికారము, సుస్థిరము.

దీనినుంచి జగత్తు ఆవిర్భవిస్తోంది. జగత్తులోని సకలప్రాణి అవతరిస్తోంది.

ఆ 'తత్త్వం' నుంచి జగత్తు ఒక్కటే కాదు; అనేక విశ్వాలు- బ్రహ్మాండాలు- గోళాలు ఆవిర్భవిస్తున్నాయి. ఇవన్నీ మూలతత్త్వం నుంచే ఊపిరి పోసుకుంటున్నాయి. కాలానుగుణంగా బయటకు వస్తున్నాయి. అందులోనికే చివరకు ముడుచుకుపోతున్నాయి.

సృష్టి కంతటికీ ఒక లయ, ఒక పద్ధతి, ఒక తీరు ఉంది,

ప్రకృతిలో అనేక రహస్యాలు యిమిడి వున్నాయి.

మానవుడు అనేక గోళాలలో ఖండాలలో నాగరికతలలో క్రమక్రమంగా పెరిగి పెద్దవాడై ప్రవర్ధుడు అవుతున్నాడు.

మానవుడికి ఎంతో గతం వుంది. అలాగే మహోన్నత భవిష్యత్తూ వుంది. విశ్వనిర్మాణ సూత్రాలు, ప్రకృతి నియమాలు, పరస్పర సంబంధాలు, ప్రవర్తనతీరులు తెలుసుకుని మానవుడు తనకూ, తన తోటివారికీ జీవరాశులకు చక్కటి భవితవ్యాన్ని నిర్మించాలి. –ఈ రకమైన జ్ఞానం అంతటికీ థియోసఫీ (THEOSOPHY) [దివ్యజ్ఞానము] అని పేరు పెట్టారు మేడం బ్లావట్‌స్కీ.

'ఈ సంగతులన్నీ నేను కనిపెట్టినవి కాదు. నేను తెలుసుకున్నవి మాత్రమే. వీటిని మీ అందరి పరిశీలన కోసం మీముందు వుంచుతున్నాను. జాగ్రత్తగా పరీక్షగా చూడండి. అకారణంగా కొట్టివేయకండి. తొందరపడి ఆమోదించకండి. మీ మనసుకు, హృదయానికి సబబని తోస్తేనే, సరైనవని అనిపిస్తేనే, 'సత్యం' అని స్ఫురిస్తేనే అంగీకరించాలి'- అని నిర్మొహమాటంగా చెప్పారు.

'సృష్టికి సంబంధించిన అనేక విషయాలను, దేశదేశాలలోని మహర్షులు ఇదివరకే కొంతవరకు పరికించి తెలుసుకున్నారు. ఆ మహర్షుల మాటలు నిదానంగా అర్థం చేసుకోండి. మీ మీ స్వంత అభిప్రాయాలను వాటికి జోడించి, స్వప్రయోజనపరులై, దురర్థాలు తీయకండి.

'ప్రపంచంలో యేమూల ఒదిగి వున్నా 'మనిషి' అన్నవాడు ఒకే 'మూలం' నుంచి వచ్చినవాడు. మనసు తెచ్చిపెట్టిన భేదభావాలవల్ల జాతులు, తెగలు, మతాలు, వైమనస్యాలు యేర్పడ్డాయి. వీటికి అతీతంగా ఎదిగి మనిషి తనను తాను పునర్నిర్మించుకోవాలి. తనలో తాను పునర్వికాసం పొందేందుకు ప్రయత్నం చేయాలి.

'మేధస్సు స్థాయినుంచి ఎదిగి అంతరంగ వివేకాన్నిపొందాలి; పెంపొందించుకోవాలి. ఈ వివేకానికి అనుగుణంగానే తన జీవిత గతులను యేర్పాటు చేసుకోవాలి. ఏ విధమైన అరమరికలు, భేదభావాలకు తావులేని సోదర భావాన్ని నెలకొల్పుకోవాలి. అంతేగాని ఈర్ష్య, అసూయ, చూపోపమివంటి కాపురుష లక్షణాలు ప్రవేశించి గోడలుగా రూపొందగూడదు.

'అందరికీ ఊపిరిగా ఉన్న ప్రాణశక్తి ఒక్కటే. అందుచేత అందరూ సోదరులు. దీనిని మరిచిపోయి భేదభావాలు పెంచుకోగూడదు. సోదరభావం, సౌభ్రాతృత్వం- ఏర్పడడం అవసరం అన్నసంగతి అందరూ గుర్తించాలి. దీనికి ఒకటి 'మాదిరి-కేంద్రం' దివ్యజ్ఞాన సమాజం'.... ఇలాంటి అభిప్రాయాలను మేడం బ్లావట్‌స్కీ బహుళ ప్రచారంలోనికి తీసుకువచ్చారు.

ఈ సమాజం మానవునకు స్వేచ్ఛ, స్వాభిప్రాయ ప్రకటన స్వాతంత్ర్యం ఉన్న అన్ని దేశాలలోను తను శాఖలను ప్రారంభించ గలిగింది. క్రొత్త ఆలోచనల ప్రాతిపదికలలో, నవమానవ సమాజ నిర్మాణానికి- ఆవిర్భావానికి దోహదం చేయడం ఈ సమాజ కర్తవ్యం. దీని అంతర్జాతీయకేంద్రం తమిళ నాడులోని మదరాసు 'అడయారు'లో ఉంది. సంస్థ ప్రారంభం అయి ఒక శతాబ్దం పైన పాతిక సంవత్సరాలు అయినా, ఇంకా 'నూతనత్వం' చెడకుండా అభిప్రాయాలు కరుడుకట్టుకోకుండా ఉంది. దీని నాయకులు, అనుయాయులు ప్రపంచ పర్యటనలు చేస్తూ- ప్రాణ ఐక్యత, సోదరభావ ప్రాముఖ్యత, సమరసజీవన ఆవశ్యకత మొదలైన అభిప్రాయాలను ప్రజలముందు ఉంచుతూ వుంటారు. ప్రజా శ్రేయస్సుకు అనుగుణమైన రీతులలో అందరి మనసులూ పరిపక్వత చెందేందుకు దోహదం చేస్తూ వుంటారు. విద్య, ఆరోగ్యం, సంక్షేమం, క్రమశిక్షణ, ఆధ్యాత్మిక ఉపలబ్ధి రంగాలలో ప్రజలకు అవసరం అయిన సూచనలను ఎప్పటికి అప్పుడు అందచేస్తూ వుంటారు. ఆధ్యాత్మ



మానసిక, భౌతిక జీవన స్థాయిలలో మానవునకు అవసరం అయిన సరంజామాను, సాధన సామాగ్రిని సమకూర్చటానికి ప్రయత్న చేస్తుంది 'దివ్యజ్ఞాన సమాజం.'

అందరు మానవులకు సమాన అవకాశాలు వున్నాయి. వీటిని సద్వినియోగం చేసుకుని జీవితాలను పునీతం చేసుకోవాలి.

పరిశుద్ధంగా జీవించడం, మనస్సు కలుషితం కాకుండా చూచుకోవడం, హృదయ వైశాల్యం నిర్మలంగా పెంచుకోవడం. ఆధ్యాత్మ వాతావరణం నెలకొనటానికి చాల అవసరం- అని మేడం బ్లావట్‌స్కీ స్పష్టపరిచారు.

'దివ్యజ్ఞాన ఉపాసిక'గా ప్రపంచమంతటా ఖ్యాతి పొందిన ఈమె 1891లో తమ అరవయవయేట లండన్ (LONDON)లో మరణించారు.

1991లో ప్రపంచవ్యాప్తంగా ఆమె శత వర్ధంతి ఉత్సవాలు దేశదేశాలలో జరిగాయి.

ఆమె అందించిన ఆధ్యాత్మ ప్రసాదాన్ని ప్రపంచ ప్రజలు గుర్తుచేసుకున్నారు. మానవజాతి భవితవ్యానికి ఆమె అందించిన ఆలోచన పరంపరలను మరింత ప్రగాఢంగా 'చింతన' చేసి తరువాతి మెట్లు ఎక్కవలసిన తరుణం ఆసన్నమయింది. ఈ అవసరం మనందరిదీని. దీనిని సానుకూలం చేయటానికే దివ్యజ్ఞాన సమాజ శాఖల ద్వారా సభ్యులు అవిరళ కృషిచేస్తున్నారు.

బ్లావట్‌స్కీ జీవితం, తత్త్వం సరళమైన మాటలలో పరిచయం చేయటానికి ఈ పుస్తకంలో ప్రయత్నం జరిగింది. ఇంగ్లీషు భాషతో పరిచయం లేని వారికి బ్లావట్‌స్కీ తత్త్వదర్శనం కొంతలో కొంత అవగాహన అవటానికి ఈ పుస్తకం దోహదం చేస్తుందని ఆశిస్తున్నాము.

---

# జీవితం

ప్రధాన ఘట్టాలు
భారతదేశంలో బ్లావట్‌స్కీ
భారతదేశానికి తిరిగి రాకపోవడం
తనను గురించి తాను
పరమ గురువుల దృష్టిలో
సెన్‌జర్ భాష

## ప్రధాన ఘట్టాలు

**పుట్టు పూర్వోత్తరాలు :**

హెలెనా పెట్రోవ్నా వాన్ హాన్ (Helena petrovna Von Hahn) 1831లో ఆగష్టు 11 తేదీని జన్మించారు. (రష్యన్ కాలెండర్ ప్రకారం ఈ తేదీ జూలై 31).

జన్మస్థానం ఎకటెరినొస్లావ్ (Ekaterinoslav) ఇది దక్షిణ రష్యాలో ఉంది. నీపర్ (Nieper) నదీతీరంలో.

తండ్రి కల్నల్ పీటర్ వాన్‌హాన్ (Peter Von Hahn). ఆమె పుట్టినప్పుడు ఆయన ఇంకా కెప్టెన్ మటుకే. ఆ కుటుంబం జర్మనీలోని మెకెల్‌బర్గ్ (Mecklenburg) నుంచి వచ్చిందట.

తల్లి హెలెనా అంద్రయేనా వాన్‌హాన్ (Helena Andreyevan Von Hahn) మంచి రచయిత్రి. జెనిదా రి-వా (Zeneida R-VA) అనే కలం పేరు. ఆమె రచనలన్నీ మరణానంతరం కూడా 1843లో సంపుటాలుగా వెలువడి గౌరవం పొందింది. 29 సంవత్సరాల చిన్న వయసులోనే ఆమె క్షయవ్యాధికి గురై మరణించడం తటస్థించింది. హెలెనా పెట్రొవ్నా పెద్ద కుమార్తె. తల్లి మరణించిన సమయానికి ఆమెకు పదకొండు సంవత్సరాల వయస్సు. ఇద్దరు కుమార్తెలు, ఇద్దరు కుమారులలో పెద్ద కుర్రవాడు బాల్యంలోనే మరణించాడు. రెండోవాడు లియోనిడ్ (Leonid) సమాచారం అంత ఎక్కువగా కానరాదు. రెండవ కుమార్తె వేరా (Vera); అక్కచెల్లెళ్ల యిద్దరికీ ఎక్కువ ఆత్మీయత. వేరా చిన్నప్పటినుంచి వ్రాసి వుంచుకున్న డైరీలు, యితర సమాచారం హెలెనా (తరువాత బ్లావట్‌స్కీ) జీవిత చరిత్ర వివరాలు తెలియటానికి బాగా ఉపకరించాయి.

తల్లి చనిపోయిన తరువాత హెలెనా, ఆమె చెల్లెలు ఎక్కువకాలం అమ్మమ్మగారి యింటనే పెరిగారు. ఆమె తాతగారు ప్రివీకౌన్సిలర్ అంద్రీ మిహా వొలిక్ డి ఫెడెయేవ్ (Andrey Mihaylovich De Fadeyev), అమ్మమ్మ రాకుమారి హెలెనాపావ్‌లోనా డోల్‌గోరుకోవ్ (Helena Pavlona Dolgorvkov).

హెలెనా చిన్నతనం నుంచి సున్నితమైన మనస్కురాలు. కొన్ని అతీంద్రియ శక్తులు ఆమెకు ఉన్నట్లు కుటుంబంలోని వారుగమనించగలిగారు. పెద్దవాళ్ళ పెత్తనం అంటే ఆ పిల్లకు రుచించదు. ఎంతసేపూ స్వతంత్రంగా, స్వేచ్ఛగా తిరుగాడవలెనని అనుకునేది. అనేక భాషలు నేర్చుకుంది. పియనో వాయించడం, చిత్రలేఖనం, గుఱ్ఱపుస్వారి ఆమెకుఉల్లాసకరమైన వ్యావృత్తులు. ప్రకృతిలో లీనమైపోవడం, తన్మయం అయి తనను తాను మరచిపోవడం ఎక్కువ మక్కువ.

"నాలుగేళ్ళ వయసులో నిద్రలోమాట్లాడటం చేస్తూవుండేది. ఎవరితోనో విపరీతముగాసంభాషణలు చేసేది. వినేవాళ్ళకు ఈ మాటలు సరదాగా, భయావహంగా కూడా తయారయ్యేవి. మామూలుగా నిద్రపోతున్నప్పుడు కూడా- ఎవరేనా చేయి పట్టుకుని ఏదేనా ప్రశ్నవేస్తే, జవాబు చెప్పగలిగేది. పోయిన వస్తువులు, తప్పిపోయిన మనుషుల సంగతులు ఆమెను అడిగి తెలుసుకుంటూ వుండేవాళ్ళం. ఆమె చెప్పిన సమాచారం నిజంగా నిరూపితం అవుతూ వుండేది.... ఒక గదిలో నిద్రపోతూ వుండే మనిషి, మరో గదిలోనో తోటలోనో ప్రత్యక్షం అవుతూ వుండేది.... కొత్తవాళ్ళ ముఖాలలోనికి గుచ్చిగుచ్చి చూస్తూ వుండేది. వాళ్ళను గురించి నిర్ఘాంతపరిచే విషయాలు అలవోకగా చెబుతూ వుండేది....' ఇలాంటి సమాచారం ఆమె పిన్నిగారు తెలిపారు.

తల్లి బతికున్న రోజులలో పిల్లల పాలన పోషణకోసరం సుశిక్షితమైన గవర్నెస్‌లు వుండేవారు. హెలెనా అసాధారణ తత్త్వం వల్ల. వాళ్ళకు తమ ఉద్యోగం కష్టమైపోతూ వుండేది.

హెలెనా తండ్రి రెండో వివాహం చేసుకున్నాడు. వారికి ఒక అమ్మాయి కూడా కలిగింది. పేరు లిసా (Lisa). ఈమెకూడా బాల్యంలో అతీంద్రియ శక్తులు ప్రదర్శించేదిగాని అదృష్టవశాత్తు కొద్ది సంవత్సరాలకే ఈ శక్తులు ఆమె వశం తప్పిపోయాయి.

హెలెనా పియనో వాద్యంలో ప్రత్యేక ఆసక్తి చూపేది. క్రమమైన శిక్షణ లేకపోయినా కేవలం వినికిడితోనే లయలు పట్టుకోగలిగేది. ఈమెకు శిక్షణ యిప్పించడంకోసం, తండ్రి 1845 ప్రాంతాలలో పారిస్‌కు, లండన్‌కు తీసుకువెళ్ళారు. ప్రసిద్ధురాలైన మోషెల్స్ (Moscheles) దగ్గర పాఠాలు నేర్చుకునే అవకాశం దొరికింది. కొన్ని కచ్చేరీలలో పాల్గొన్నది కూడా.



లండన్‌లోనే ఆమె గుఱ్ఱపు స్వారీ బాగా అభ్యాసం చేసింది. ఈ అభ్యాసంలో దుడుకుతనం తండ్రికి కొంత గాబరా కలిగింది. ఆమెకు తిరిగి సారటొవ్ (Saratov)కు- తాతగారి ఊరికి- పంపించడం జరిగింది.

వివాహం :

హెలెనా ఎవరో ఒక కులీన కుటుంబ సభ్యుడిని వివాహం చేసుకుని మామూలు జీవితం గడుపుతుందని కుటుంబసభ్యులంతా ఆశించారు. కాని ఆమెకు అతీంద్రియ శక్తులు, అగోచర వ్యక్తులపట్ల వున్నంతగా వివాహం పట్ల ఆసక్తి లేదు.

కాని విధి విచిత్రం అనూహ్యం అన్నట్లుగా ఆమె నలభై సంవత్సరాల వయస్సున్న నికిఫర్ వాసిలీవిట్ బ్లావట్‌స్కీ అనే ఆయనను వివాహం చేసుకోవడం జరిగింది. ఈయన 1809లో పుట్టాడు. 1849లో వివాహం జరిగే నాటికి హెలెనాకు 18 సంవత్సరాల వయసు మాత్రమే! కాకసస్‌లోని ఎరివాన్ (Erivan) రాష్ట్రానికి బ్లావట్‌స్కీ వైస్‌గవర్నర్‌గా వుండేవాడు. ఆమె పిన్నిగారి ఉత్తరాల ప్రకారం ఈ వివాహ ఉదంతం యిలా నడిచింది :

'వివాహాన్ని గురించి హెలెనాకు పెద్ద అపేక్ష లేదు. కాని గవర్నెస్‌గా వున్న ఆమె, హెలెనాను మందలిస్తూ ఒకమారు, "నీవు యిలా పెంకిగా, చెప్పిన మాట వినకుండా వుంటే నిన్ను ఎవరూ పెళ్ళిచేసుకొనటానికి ముందుకు రారు" అని బెదిరించింది. వైస్‌గవర్నర్‌ను గురించి ఏదో వేళాకోళంగా మాట్లాడినప్పుడు, ఈ మందలింపు జరిగింది. అందుకు, హెలెనా "అయితే చూడు, అతనే నన్ను వివాహం చేసుకోమని బతిమిలాడేట్లు చేస్తాను' అని ప్రతిసవాలు చేసింది. అనుకున్నంతా అయింది. ఈ సంఘటన జరిగిన మూడు రోజులకే బ్లావట్‌స్కీ ఆమెతో వివాహ ప్రతిపాదన చేశాడు. తన పొరపాటును గమనించ గలిగినా హెలెనాకు వివాహ బంధానికి కట్టుబడడం తప్ప మరో మార్గం లేకపోయింది. మూతి ముడుచుకునే, వివాహ ప్రతినలు కూడా సరిగా ఉచ్చరించకుండా బ్లావట్‌స్కీకి భార్యగా నమోదు అయిపోయింది.'

వివాహం అయితే జరిగింది గాని భార్యాభర్తలు ఒకచోట కలిసి వుండడం, వివాహ జీవితం గడపడం జరగలేదు; మూడు నెలలపాటు ఒకే ఇంట వున్నా, హెలెనాను సరైన దారికి తీసుకురమ్మని ఒడెస్సాలో వున్న

తండ్రిగారి దగ్గరకు పంపారు. తండ్రి దగ్గరకు వెడితే ఆయన తన మెడలు వంచి యిష్టంలేని పనులు చేయిస్తాడేమోననే భయంతో హెలెనా తనజీవితాన్ని పూర్తిగా తనచెప్పుచేతలలోనికే తీసుకుంది. ఒడెస్సా ప్రయాణం చేస్తున్నప్పుడే పోటి (Poti) అనే నగరంలో తనతో వున్న సేవకుల, బంధువుల కళ్ళుకప్పి కాంస్టాంటినోపిల్ (Constantinople) వెళ్ళే పడవలో జొరబడింది. అక్కడ కౌంట్ కిస్సిలెవ్ (Covnt Kisselev)అనే పాతరష్యన్ మిత్రుడు దొరకడంతో అతని రక్షణలో కొన్నాళ్ళు సురక్షితంగా వుండిపోయింది. తరువాత ఈజిప్ట్, గ్రీస్, యితర తూర్పు యూరప్ రాష్ట్రాలకు పర్యటన చేసింది. నిజానికి ఈజిప్ట్ దేశంలోనే ఆమె మొదటి మారుగా ఆధ్యాత్మవిద్య, శిక్షణ పొందడం ప్రారంభం అయింది. కైరోలో పాల్ మెటమన్ (Paul Metamon) అనే మాంత్రికుడు వున్నాడు. ఈయన రహస్య విద్యలు నేర్చినవాడు; అడపదడప ప్రభుత్వ కార్యకలాపాలలో గూఢచారి క్రియలు కూడా చేసి సహకరిస్తూ వుండేవాడు. హెలెనా బ్లావట్స్కీ ఈజిప్ట్‌లోవున్న మూడునెలలు అతితరుచుగా ఈయనను కలుసుకుని సంప్రదిస్తూ వుండేది.

తండ్రిగారికి తన కూతురు భర్తతో కలిసి కాపురం చేయదు— అని నిర్ధారణ అయిపోయింది. ఈ పరిస్థితికి ఆయనకూడా సమాధానపడి వుండి పోవలసి వచ్చింది. కుమార్తెకు అవసరం అయిన ధనసహాయం ముట్టుకు చేస్తూ వుండేవాడు.

భర్తగారయిన బ్లావట్‌స్కీ గూడా విడాకుల కోసం ప్రయత్నం చేశాడు. అప్పటి రష్యన్ నియమావళి ప్రకారం కనీసం పది సంవత్సరాలైనా కలిసి కాపురం చేయనిదే విడాకులు లభించవు. బ్లావట్‌స్కీ (హెలెనా) 1849-58 మధ్య మళ్ళీ రష్యాలో అడుగుపెట్టకుండా వుండటానికి గూడా ప్రధానమైన కారణం యిదే.

పరమగురు సందర్శనం :

చిన్నతనం నుంచి హెలెనాకు కలలలో ఒక మహాపురుషుడు కనిపిస్తూ వుండేవారు. అయనే- అదృశ్యంగా వుండి ఆమెను అనేక ఇబ్బందులు, ప్రమాదాల బారినుంచి రక్షించిన స్పృహ కూడా ఆమెకు కలుగుతూవుండేది.

అయితే 1851లో గాని ఆమె ఈ మహాపురుషుని ముఖాముఖి సందర్శించడం జరగలేదు.



ఆమె లండన్‌లో వున్నప్పుడు- 1851లో- తండ్రితో కలిసి షికారు చేస్తూ వున్నప్పుడు ఒక భారత రాజవంశీకుల బృందంలో ఒకానొక ఆజాను బాహువైన హిందూ ప్రభువును చూడడం తటస్థించింది. తనకు ఇన్నాళ్ళూ కలలలో కనిపిస్తూ వున్నది ఈయనే అని గుర్తించటానికి ఆమెకు ఎక్కువ సమయం పట్టలేదు. గుర్తుపట్టిన క్షణంలోనే చకచకా ముందుకు వెళ్ళి ఆయన ముందు వాలాలని అనిపించింది ఆమెకు. కాని ఆయన 'నీవుఉన్నచోటునుంచి కదలకు' అన్నట్లుగా సైగ చేశారు. స్తంభించిపోయింది. ఆయన ముందుకు నడిచి వెళ్ళిపోయారు. ఈ విచిత్ర సన్నివేశం తలపోసుకుంటూ ఆమెమరునాడు హైడ్‌పార్క్ (Hyde Park)లో ఒంటరిగా తిరుగాడుతూ వుండింది. అదృష్టవశాత్తు ఒక మహత్తర క్షణంలో ఆయన రూపం ఆమె ముందు సాక్షాత్కరించింది. 'నేను భారత రాజబృందంతో యిక్కడ కొన్ని రాచకార్యాల నిమిత్తం వచ్చి వున్నాను. నీతో కొన్ని విషయాలు స్వయంగా యాట్లాడవలసి వుంది' అన్నారు.

ఇదొక కథనం.

మరొక కథనం ప్రకారం ఆగస్ట్ 12వ తేదీన-1851లోనే- రామ్స్‌గేట్ (Ramsgate)- ఇంగ్లండ్ తూర్పుకోస్తాలో ఒక ఓడరేవు దగ్గర 'ఈ రాత్రి నా జీవితంలో చరితార్థమైన రోజు ! నా కలలలోని మహాపురుషుడు మాస్టర్ మోర్యను నేను చంద్రకాంతిలో మొదటిమారుగా సందర్శించగలిగాను' అని ఆమె వ్రాసుకున్నారు.

మరో సందర్భంలో ఇలా వ్రాశారు :

'1854లో ఇంగ్లండ్‌లో ఇక విచిత్రవ్యక్తి ఇంట నా పరమ గురువును రెండు పర్యాయాలు కలుసుకు మాట్లాడగలిగాను. ఆయన మాటల తీరు, ప్రదర్శించిన హుందాతనం నన్ను చకితురాలిని చేశాయి.'

1851 ఆమె ఇరవై సంవత్సరాలు నిండిన రోజునే (ఆగస్ట్ 12) పరమగురువును సందర్శించినట్లు యితర సందర్భాలలో చెప్పారు. ఆమె చెప్పిన ప్రదేశాలు, సందర్భాలు నికార్సుగా పరిశీలించుకునే అవకాశం లేదు, స్వవిషయం అంత యథాతథంగా చెప్పుకోకపోవడం కూడా ఒక పద్ధతి!

ఆమె లండన్ నుంచి న్యూ ఆర్లీన్స్ (New Orleans)కు వెళ్ళారు. అక్కడ వూడూలు, నీగ్రోలు, ఇతర వామాచార పరాయణులతో కొన్ని

యిబ్బందులు పడ్డారు. ఆమె పరమగురువు ఆమెను అక్కడనుంచి తక్షణం పైకి వెళ్ళమని ఆదేశించారు. మెక్సికోలోని కోపా (Copav) అనే ప్రదేశం చేరుకున్నారు. దక్షిణ అమెరికా, పెరూ కూడా వెళ్ళారు.

మెక్సికోలో ప్రయాణం చేస్తూ వున్నప్పుడే 'ఇండియా'కు ఎలాగైనా వెళ్ళితీరాలని సంకల్పం చేసుకున్నారు. వెనుక తాను జర్మనీలో కలుసుకున్న ఒక ఇంగ్లీషువ్యక్తి-అతనూ పర్యటనలలో ఉత్సాహం వున్నవాడు-సహాయంతో మరో హిందూ శిష్యునితో కలిసి సింహళానికి వెళ్ళారు. అక్కడనుంచి 1852 లో బొంబాయి నగరం చేరుకున్నారు. బొంబాయి చేరుకున్న మీదట ముగ్గురి దారులు వేరువేరు అయినాయి. ఆమె మాత్రం టిబెట్‌కు వెళ్ళాలని కృషి చేశారు. నేపాల్‌లోని బ్రిటిష్ రెసిడెంట్ ఆమెకు అనుమతి నిరాకరించాడు. అందుచేత జావా, సింగపూరుల మీదుగా ఇంగ్లండ్‌కు తిరిగిపోవలసి వచ్చింది. ఆమె దగ్గరి బంధువురాలు ఎవరో ఎనభై వేల రూబుల్స్ ధారాదత్తం చేయడం వల్ల ఈ ప్రయాణాలన్నీ సుకరంగా గడిచాయి.

1854లో క్రిమియన్ చక్రవర్తి నికలస్ ఇంగ్లండ్‌మీద యుద్ధం ప్రకటించాడు. ఈ కారణంగా ఆమె- రష్యన్ పౌరురాలు గనుక- ఇంగ్లండ్‌లో యధేచ్ఛగాతిరుగాడటానికికూడా అవకాశంజారిపోయింది. అందుచేతఅమెరికాకు వెళ్ళిపోయారు. చికాగో నుంచి శాన్‌ఫ్రాన్సిస్కోకు వెళ్ళి అక్కడనుంచి తిరిగి ఇండియా చేరుకున్నారు. ఈమారు జపాన్‌మీదుగా, కలకత్తాకు చేరుకున్నారు. అక్కడనుంచి కాశ్మీర్‌కు, లడక్‌లోని 'లే' (Leh)కు వెళ్ళారు. అక్కడ ఒక బౌద్ధ ఆశ్రమంలో కొన్ని విచిత్రాలు చూచారు. ఈ రోజులలోనే ఒక తార్తారు గురువు ఆమెకు ఉపకరించి టిబెట్ వెళ్ళేందుకు అవకాశం కలిగించాడు.

1858లో ఆమె తిరిగి రష్యా చేరుకున్నారు.

అప్పటికి ఆమె చెల్లెలు వేరా భర్తను కోల్పోయి, మామగారి పోషణలో ప్స్కోవ్ (Pskov) నగరంలో ఉన్నది.

1858 క్రిస్టమస్ రోజు.

ఆ రోజు వేరా ఆడబడుచు వివాహం.

ఆ కుటుంబం అందరూ భోజనాల బల్ల దగ్గర ఉన్నారు.

ఎవరో అతిథులు బయటనుంచి 'డోర్ బెల్' మోగించారు.



పరిచారకులు, సేవకులు ఎందరో వున్నా అదృష్టవశాత్తు వేరాయే వచ్చి తలుపు తీసింది.

'బ్లావట్‌స్కీ తిరిగి వచ్చింది' అన్నవార్త క్షణాలలో అందరికీఅందింది. మాయలు మంత్రాలు నేర్చుకుని వివిధ దేశాలు పర్యటించిన యువతి వచ్చిందన్నసంగతి తెలుసుకుని, బంధువులు-స్నేహితులు-పరిచయస్తులు అనేకమంది పోగయ్యారు.

ఆమె కొన్ని విచిత్రాలు చేసింది. జాగ్రదవస్థలో వున్న లోకానికి, అదృశ్య ప్రపంచానికి తాను 'వారధి'ని అని చెప్పింది. తాను చేస్తున్న విచిత్రాలకు, భూతప్రేతాలకు ఎలాంటి సంబంధం లేదని వక్కాణించింది. అప్పటికే ఆమె కొన్నిస్థిరమైన అతీంద్రియ శక్తులను అమలులోనికితెచ్చుకుంది.

ఇతరులు మనస్సులో అనుకున్న మాటలను చెప్పడం, వారిసందేహాలకు సమాధానాలు యివ్వడం- ఒక తేలిక పని అయిపోయింది ఆమెకు.

జబ్బులకు 'లాటిన్' భాషలో మందుల ప్రిస్క్రిప్షన్లు యిచ్చేది. ఆజబ్బులు ఆ మందుల వాడకం వల్ల తగ్గేవి.

ఎవరేనా కోరినప్పుడు, అతి రహస్యమైన వర్తమానాలు చురుగ్గా చెప్పగలిగేది.

మనుషుల, వస్తువుల బరువులను సంకల్ప మాత్రం చేతనే 'ఎక్కువ' చేయగలిగేది.

ఆమెకు ఎక్కడెక్కడినుంచో ఉత్తరాలు వస్తూ వుండేవి; అడిగిన ప్రశ్నలకు జవాబులు వ్రాసి తాళాలు బిగించిన బీరువాలలో ప్రవేశపెట్టగలిగేది!

1860లో ఒక స్నేహితుడు ఆమెకు సలహా యిచ్చాడు : 'నీకు అతీంద్రియ శక్తులు లభించాయి నిజమే! కాని వీటికి యేదో మహత్తర ప్రయోజనం వుంటుంది. వీటి ప్రదర్శనవల్ల నీకు, ఇతరులకు ఇబ్బందులు ఆపదలు కలగకుండా చూచుకోవడం ముఖ్యం. వివేకయుతంగా ప్రవర్తిస్తే నీవు మానవాళికి మహోపకారం చేయగలుగుతావు!'

1864 వరకు ఆమె రష్యాలోనే ఉండిపోయింది. రెండు సంవత్సరాలు బంధువుల ఇంట టిఫ్లిస్‌లోను, కాకసస్‌లో మరో మూడు సంవత్సరాలు గడిపింది.

కాకసస్‌లో వున్నప్పుడే భర్తను తిరిగి చూడడం తటస్థించింది. ఆయన రోగగ్రస్తుడై వున్నాడు. ఆమె ఆయనకు సేవలు చేస్తూ వుండింది. తానుగూడా రోగం పాలై శవాకారంగా తయారయింది. ఆమెకు వైద్యం చేయడం అసాధ్యం అనిపించింది డాక్టర్లకు. టిఫ్లిస్‌లోని బంధువుల దగ్గరకు వెళ్ళి పొమ్మన్నారు. ఆమెతోపాటు నలుగురు సేవకులను తోడు పంపారు. పడవ ప్రయాణంలో ఆమె ఒక విచిత్రం చేసింది. శరీరం పడవలో వుండగానే, ఆమె సూక్ష్మశరీరంలో నదిలో ఈతలు కొడుతూ కనిపించింది. ఈదృశ్యాన్ని చూచిన సేవకులలో ముగ్గురు భయపడి ఆమెనుంచి దూరంగా పారిపోయారు. ఒక ముసలి వంటవాడు మాత్రమే ఆమెతో ఉండిపోయాడు.

ఆమె పిన్నిగారి యింటికి చేరుకుంది, అక్కడ స్వస్థత చేకూరినతర్వాత తన ప్రయాణాలు సాగించింది. ఈమారు బాల్కన్స్, ఈజిప్ట్, సిరియా, ఇటలీ తిరిగింది. బహుశ టిబెట్‌గూడా వెళ్ళిందేమో!

1868లో ఆమె తిరిగి భారతదేశానికి, టిబెట్‌కు వెళ్ళింది. ఈమారు ఆమె పరమగురువు అయిన 'మోర్య' ఆమెతోనే వున్నారు.

1871లో సూయజ్ కెనాల్ మీదుగా ప్రయాణము చేసి, కొన్నాళ్ళు గ్రీస్ దేశంలో గడిపింది. పడవ ప్రయాణంలో ప్రమాదం జరిగి ఆమె 'అలెగ్జాండ్రియా' చేరుకుంది. తండ్రిగారి దగ్గరనుంచి రావలసిన డబ్బును అందుకోవటానికి ఆమె అక్కడ కొంతకాలం వేచి వుండవలసి వచ్చింది. అక్కడ కొందరు ఫ్రెంచి దేశస్థులతో కలిసి ప్రదర్శనకాల నడిపి కొన్ని విచిత్రాలు ప్రదర్శించింది. ఈ తరుణంలోనే ఎమ్మా కట్టింగ్ (Emma Cutting) అనే ఆమెతో పరిచయం అయింది. ఎమ్మా తరువాత కొలంబ్ (Corlumb) అనే ఆయన్ను వివాహం చేసుకుని, చాల సంవత్సరాల పిదప బ్లావట్‌స్కీని ఇండియాలో కలుసుకుంది. ఈ కొలంబుల పరిచయం బ్లావట్‌స్కీ జీవితంలో దరిమిలా చాల అనర్థాలకు దారితీసింది.

1870లో బ్లావట్‌స్కీ చెల్లెలు 'వేరా'కు మహర్షి కుథూమి అనే వారి నుంచి ఒక సమాచారం అందింది. 'మీ అక్కగారు సురక్షితంగా సుదూర తీరాలలో వున్నారు. పద్దెనిమిది నెలలు గడిచిన తరువాత రష్యాకు తిరిగి వస్తారు'-అని.



1872లో బ్లావట్‌స్కీ ఒడెస్సా (Odessa) లోని తన బంధువులను సందర్శించింది.

తరువాత ఆమె మళ్ళీ రష్యా సందర్శించలేదు.

తూర్పు యూరప్‌లో పర్యటనచేసి, 1873లో పారిస్ చేరుకుంది. ఇక్కడనే ఆమెకు తన 'పరమ గురువుల బృందం' నుంచి యితమిద్ధమైన ఆదేశాలు అందాయి. 'శిక్షణ కాలం పూర్తి అయింది. న్యూయార్క్ వెళ్ళు' అన్నది ఆ ఆదేశం.

ఆమె తక్షణమే న్యూయార్క్‌కు ప్రయాణం కట్టింది.

ఈ ప్రయాణంలో ఆమెకో విచిత్ర సన్నివేశం తటస్థించింది. మోసగాళ్ళ ప్రభావానికి లోనయి ఒకామె తన పిల్లలతో అక్కడ నిలిచిపోయి వుంది. బ్లావట్‌స్కీ ఆమెకు ప్రయాణ సదుపాయం కలిగించే నిమిత్తం తన పైతరగతి టిక్కెట్టును అమ్మి వారితోపాటు తక్కువ తరగతిలో ప్రయాణం చేయవలసి వచ్చింది.

తరువాత అయిదు సంవత్సరాలపాటు ఆమె అమెరికాలోనే వుండిపోయింది. న్యూయార్క్, ఫిలడల్ఫియాలలో గడిపింది. ధనవసతి కోసం ఆమె కొన్ని శరీరకష్టాలు పడవలసివచ్చింది. తండ్రిగారు 1873లో మరణించారు. కొంత ధనం ఆమెకు అందింది. అయినా డబ్బు ఖర్చుచేయడంలో చాకచక్యం లేనందువల్ల యిబ్బందులు పడడం తప్పలేదు. భర్తగారి ఉద్యోగ రీత్యా ఐదు వేల రూబుల్స్ పెన్షన్ అందుకునే అవకాశం వున్నా ఆమె అందుకు చేయి చాపలేదు.

ఆమె అమెరికా నివాస సమయంలో పరమగురువుల బృందంలోని మహర్షులు ఆమెకు ఆలంబనగా నిలిచారు. వారే తగిన సూచనలు, సలహాలు యిచ్చి దరిమిలా 'ది థియొసాఫికల్ సొసైటీ'ని స్థాపించటానికి ప్రోత్సాహం సమకూర్చారు. ఈ సంస్థ 1875లో రూపుకట్టుకుంది.

వెర్మంట్ (Vermont) లోని చిట్టెన్‌డన్ (Chittenden) అనేచోట ఎడ్డీ సోదరులు (Eddy Brothers) ఒక అదృశ్యజీవుల ప్రదర్శనకాల నడుపుతున్నారు. బ్లావట్‌స్కీ అక్కడకు వెళ్ళింది. కల్నల్ అనే డెయిలీ గ్రాఫిక్ (Daily Graphic)అనే పత్రిక తరఫున యిక్కడ జరిగే విచిత్రాలను 'రిపోర్ట్' చేయటానికి అక్కడకు వచ్చారు. ఇద్దరూ కలుసుకోవడం, ఈ విషయాలలో

కాకసస్‌లో వున్నప్పుడే భర్తను తిరిగి చూడడం తటస్థించింది. ఆయన రోగగ్రస్తుడై వున్నాడు. ఆమె ఆయనకు సేవలు చేస్తూ వుండింది. తానుగూడా రోగం పాలై శవాకారంగా తయారయింది. ఆమెకు వైద్యం చేయడం అసాధ్యం అనిపించింది డాక్టర్లకు. టిఫ్లిస్‌లోని బంధువుల దగ్గరకు వెళ్ళి పొమ్మన్నారు. ఆమెతోపాటు నలుగురు సేవకులను తోడు పంపారు. పడవ ప్రయాణంలో ఆమె ఒక విచిత్రం చేసింది. శరీరం పడవలో వుండగానే, ఆమె సూక్ష్మశరీరంలో నదిలో ఈతలు కొడుతూ కనిపించింది. ఈదృశ్యాన్ని చూచిన సేవకులలో ముగ్గురు భయపడి ఆమెనుంచి దూరంగా పారిపోయారు. ఒక ముసలి వంటవాడు మాత్రమే ఆమెతో ఉండిపోయాడు.

ఆమె పిన్నిగారి యింటికి చేరుకుంది, అక్కడ స్వస్థత చేకూరినతర్వాత తన ప్రయాణాలు సాగించింది. ఈమారు బాల్కన్స్, ఈజిప్ట్, సిరియా, ఇటలీ తిరిగింది. బహుశ టిబెట్‌గూడా వెళ్ళిందేమో!

1868లో ఆమె తిరిగి భారతదేశానికి, టిబెట్‌కు వెళ్ళింది. ఈమారు ఆమె పరమగురువు అయిన 'మోర్య' ఆమెతోనే వున్నారు.

1871లో సూయజ్ కెనాల్ మీదుగా ప్రయాణము చేసి, కొన్నాళ్ళు గ్రీస్ దేశంలో గడిపింది. పడవ ప్రయాణంలో ప్రమాదం జరిగి ఆమె 'అలెగ్జాండ్రియా' చేరుకుంది. తండ్రిగారి దగ్గరనుంచి రావలసిన డబ్బును అందుకోవటానికి ఆమె అక్కడ కొంతకాలం వేచి వుండవలసి వచ్చింది. అక్కడ కొందరు ఫ్రెంచి దేశస్తులతో కలిసి ప్రదర్శనశాల నడిపి కొన్ని విచిత్రాలు ప్రదర్శించింది. ఈ తరుణంలోనే ఎమ్మా కట్టింగ్ (Emma Cutting) అనే ఆమెతో పరిచయం అయింది. ఎమ్మా తరువాత కౌలంబ్ (Corlumb) అనే ఆయన్ను వివాహం చేసుకుని, చాల సంవత్సరాల పిదప బ్లావట్‌స్కీని ఇండియాలో కలుసుకుంది. ఈ కౌలంబుల పరిచయం బ్లావట్‌స్కీ జీవితంలో దరిమిలా చాల అనర్థాలకు దారితీసింది.

1870లో బ్లావట్‌స్కీ చెల్లెలు 'వేరా'కు మహర్షి కుథూమి అనే వారి నుంచి ఒక సమాచారం అందింది. 'మీ అక్కగారు సురక్షితంగా సుదూర తీరాలలో వున్నారు. పద్ధెనిమిది నెలలు గడిచిన తరువాత రష్యాకు తిరిగి వస్తారు'-అని.



1872లో బ్లావట్‌స్కీ ఒడెస్సా (Odessa) లోని తన బంధువులను సందర్శించింది.

తరువాత ఆమె మళ్ళీ రష్యా సందర్శించలేదు.

తూర్పు యూరప్‌లో పర్యటనచేసి, 1873లో పారిస్ చేరుకుంది. ఇక్కడనే ఆమెకు తన 'పరమ గురువుల బృందం' నుంచి యితమిద్ధమైన ఆదేశాలు అందాయి. 'శిక్షణ కాలం పూర్తి అయింది. న్యూయార్క్ వెళ్ళు' అన్నది ఆ ఆదేశం.

ఆమె తక్షణమే న్యూయార్క్‌కు ప్రయాణం కట్టింది.

ఈ ప్రయాణంలో ఆమెకో విచిత్ర సన్నివేశం తటస్థించింది. మోసగాళ్ళ ప్రభావానికి లోనయి ఒకామె తన పిల్లలతో అక్కడ నిలిచిపోయి వుంది. బ్లావట్‌స్కీ ఆమెకు ప్రయాణ సదుపాయం కలిగించే నిమిత్తం తన పైతరగతి టిక్కెట్టును అమ్మి వారితోపాటు తక్కువ తరగతిలో ప్రయాణం చేయవలసి వచ్చింది.

తరువాత అయిదు సంవత్సరాలపాటు ఆమె అమెరికాలోనే వుండిపోయింది. న్యూయార్క్, ఫిలడల్ఫియాలలో గడిపింది. ధనవసతి కోసం ఆమె కొన్ని శరీరకష్టాలు పడవలసివచ్చింది. తండ్రిగారు 1873లో మరణించారు. కొంత ధనం ఆమెకు అందింది. అయినా డబ్బు ఖర్చుచేయడంలో చాకచక్యం లేనందువల్ల యిబ్బందులు పడడం తప్పలేదు. భర్తగారి ఉద్యోగ రీత్యా ఐదు వేల రూబుల్స్ పెన్షన్ అందుకునే అవకాశం వున్నా ఆమె అందుకు చేయి చాపలేదు.

ఆమె అమెరికా నివాస సమయంలో పరమగురువుల బృందంలోని మహర్షులు ఆమెకు ఆలంబనగా నిలిచారు. వారే తగిన సూచనలు, సలహాలు యిచ్చి దరిమిలా 'ది థియొసాఫికల్ సొసైటీ'ని స్థాపించటానికి ప్రోత్సాహం సమకూర్చారు. ఈ సంస్థ 1875లో రూపుకట్టుకుంది.

వెర్మంట్ (Vermont) లోని చిట్టెన్‌డన్ (Chittenden) అనేచోట ఎడ్డీ సోదరులు (Eddy Brothers) ఒక అదృశ్యజీవుల ప్రదర్శనశాల నడుపుతున్నారు. బ్లావట్‌స్కీ అక్కడకు వెళ్ళింది. కల్నల్ అనే డెయిలీ గ్రాఫిక్ (Daily Graphic)అనే పత్రిక తరఫున యిక్కడ జరిగే విచిత్రాలను 'రిపోర్ట్' చేయటానికి అక్కడకు వచ్చారు. ఇద్దరూ కలుసుకోవడం, ఈ విషయాలలో

వారికి ఉండిన ఆసక్తి వల్ల స్నేహం యేర్పడడం, తద్వారా థియొసాఫికల్ సొసైటీని స్థాపించడం జరిగింది.

స్పిరిచువల్ సైన్‌టిస్ట్ (Spiritual Scientist)అనే పత్రికసంపాదకుడు ఎల్‌బ్రిడ్జ్ జి. బ్రౌన్ (Elbridge G. Brown) కూడా యిక్కడే తటస్థపడ్డాడు. అతనివల్ల కొంత ధనసహాయం, ప్రోత్సాహం లభించినా చివరివరకూ వారి మైత్రి కొనసాగలేదు. బ్రౌన్‌కు విచిత్ర చర్యలలోనే ఉత్సాహం తప్ప వాటి వెనక వున్నదని చెబుతున్న తత్త్వమీమాంసలో ఆకాంక్ష లేదు.

'భూతావేశపరుల చర్యలను బయలు పరచటానికే నేను పారిస్ నుంచి అమెరికాకు వచ్చాను. వారి చర్యలు యదార్థమే, కాని వాటికి ఆధ్యాత్మబలం లేదు. ఈ విషయం ఋజువు చేయటమే నా పని!' అన్నారు ఆమె.

విగత జీవులు కొన్ని శక్తులను ప్రదర్శించవచ్చును. అది కాదు ముఖ్యమైన సంగతి. 'మనిషి'లో నిగూఢంగా ఎన్నో శక్తులు వున్నాయి. వాటిని బయటకు తీసుకువచ్చి ఆధ్యాత్మికత పెంపొందించడమే జరగవలసిన పని!— దీనికోసం ఆమె ముందుగా 'మిరకిల్ క్లబ్' (Miracle Club) అనే దానిని ప్రారంభించాలనుకున్నారు. కాని యిది పురిటిలోనే సంధిపాలయింది.

1875 చివరి నెలలలో ఆమె న్యూయార్క్‌లోని 46, ఇర్వింగ్ ప్లేస్ (Irving Place) అన్న భవనంలో వుండేవారు. ఆమెను కలుసుకునేందుకు విచిత్ర సంఘటనల గురించి చర్చించేందుకు చాలామంది అక్కడకు వస్తూ వుండేవాళ్ళు. ఎవరో రష్యన్ మనిషి; లోకాతీతమైన పనులు చేస్తోంది. వీటి యదార్థత గురించి మాట్లాడుతోంది. అని అందరికీ కుతూహలం.

సెప్టెంబర్ 7వ తేదీన (1875) ఈ రకమైన కార్యకలాపాలకు ఒక సంస్థ వుంటే బాగుంటుందని సూచన వచ్చింది. నవంబర్ 17న 17మంది సభ్యులతో ది థియొసాఫికల్ సొసైటి ప్రారంభం అయింది. కాని ఈసభ్యులలో చాలామంది ఉత్సాహం కొద్ది నెలలలోనే నీరు కారిపోయింది. తమాషాలు, విచిత్రాలు చూడడంలో అక్కజ పడడంలో వున్న మానసిక ఉత్సాహం వీటి తాలూకు తాత్త్వికతను అర్థం చేసుకోవడంలో లేకపోవడమే యిందుకు ముఖ్య కారణం. అయినా సంస్థ మాత్రం దినదిన ప్రవర్ధమానం అయింది. జీవితాంతం దీనికోసం పనిచేసిన వారు ముగ్గురే ముగ్గురు :




హెచ్.పి. బ్లావట్‌స్కీ (H.P. Blavatsky)

కల్నల్ హెచ్.ఎస్. ఆల్కాట్ (Col. H.S. Olcott)

విలియం క్యూ. జడ్జ్ (William Q. Judge)

ఈ సంస్థ ప్రారంభించటానికి ముందు బ్లావట్‌స్కీ జీవితంలో మరో అనూహ్య సంఘటన తటస్థించింది.

మైకెల్ సి. బెటనెల్లీ (Michael C. Betanelly) అనే అతను ఆమెను వివాహం చేసుకోవాలని కాంక్షించాడు. అతడు ఫిలడల్ఫియాలో ఒకవ్యాపారి. ఆమె అతని కాంక్షను పదేపదే తిరస్కరిస్తూ వచ్చింది. కాని అతని పోరు పడలేక, కొన్ని షరతులకు లోబడి అతడిని వివాహం చేసుకోవటానికి అంగీకరించింది.

'వివాహం అయితే చేసుకుంటాను గాని, వివాహ సంబంధం నెలకొనడానికి కుదరదు. ఒక ఇంట్లో వుండడమే. నామీద నీకేమి అధికారం, హక్కు ఉండవు. :– ఇది మొదటి షరతు.

'వివాహ ఫలితంగా పేరు మార్చుకోను. బ్లావట్‌స్కీ అనే పేరుతోనే వ్యవహరిస్తాను'— ఇది రెండో షరతు.

బెటనెల్లీ ఈ షరతులకు అంగీకరించాడు. వారి వివాహం 1875 ఏప్రిల్ 3 తేదీని జరిగింది.

బెటనెల్లీ తాను అంగీకరించిన షరతులను అతిక్రమించే ప్రయత్నాలు చేయడంతో, ఈ వివాహం అతిత్వరలోనే 'రద్దు' అయిపోయింది.

1877లో ఆమె Isis Unveiled అనే పుస్తకం (ప్రకృతి అనావరణం) వ్రాశారు. ఈ పుస్తకం ప్రపంచవ్యాప్తంగా అమెకు ప్రసిద్ధిని తీసుకువచ్చింది.

1878 జూలై 8న ఆమె అమెరికన్ పౌరసత్వం పొందారు.

ఆమె చిరకాలవాంఛ భారతదేశానికివెళ్ళాలనీ, అక్కడేవుండిపోవాలనీని.

1878 డిసెంబర్ 17 తేదీని కల్నల్ ఆల్కాట్‌తో కలిసి లండన్ మీదుగా భారతదేశానికి ప్రయాణం కట్టారు.

1879 జనవరి 18 తేదీని బొంబాయి చేరుకున్నారు. దివ్యజ్ఞాన సమాజం కేంద్రస్థానం తాత్కాలికంగా అక్కడ నెలకొల్పారు.

అదే సంవత్సరం (The Theosophist) 'ది థియోసఫిస్ట్' అనే పత్రిక ప్రారంభించారు.

భారతదేశం నలుమూలల పర్యటనలు ప్రారంభించారు.

1882లో సమాజ కేంద్రస్థానాన్ని మదరాసులోని అడయారుకు తరలించారు. అప్పటినుంచి సమాజ శాఖలు దేశంలో విస్తరించాయి.

1885 మార్చి 31న యూరప్ వెళ్ళిపోయారు. తిరిగి భారతదేశానికి రాగల అవకాశం లభించలేదు.

1888లో The Secret Doctrine (రహస్య గ్రంథం)అనేపుస్తకాన్ని ప్రచురించారు.

1889లో The Voice of the Silence (అంతర్వాణి)అనే పుస్తకం వెలువడింది.

యూరప్ వెళ్ళిన తర్వాత అక్కడ (Lucifer) 'లూసిఫర్' అనే పత్రిక ప్రచురించడం ప్రారంభించారు. 1887లో యిది ప్రారంభం అయింది.

ఇన్ఫ్లుయన్జా అంటువ్యాధి సోకటంతో ఆమె 1891 మే 8వ తేదీన మరణించారు. లండన్‌లోని ఆమె నివాస స్థలం 19, Avenue Road (అవెన్యూ రోడ్)లో ఈ దుర్ఘటన జరిగింది.

అరవై సంవత్సరాల జీవితంలో ఆమె చేసిన కృషి అజరామరంగా మిగులుతుంది.



# భారతదేశంలో బ్లావట్‌స్కీ

దివ్యజ్ఞాన సమాజ కేంద్రాన్ని అమెరికానుంచి భారతదేశానికి మార్చమని ఆదేశాలు- అందుకున్న తరువాత, మేడం బ్లావట్‌స్కీ, కల్నల్ ఆల్కాట్ తదితరులు మొదటిగా బొంబాయి నగరానికి వచ్చారు. 1879 ఫిబ్రవరి 16 తేదీన వారికి బొంబాయిలో కొందరు మిత్రులు- దేశీయులు స్వాగతం చెప్పారు. 'ఐసిస్ అన్‌వీల్డ్' గ్రంథ రచయిత్రిగా బ్లావట్‌స్కీకి అప్పటికే భారతదేశంలో కూడా పేరుప్రఖ్యాతులు వచ్చి వున్నాయి. ఫిబ్రవరి 17 తేదీన సమాజ వ్యవస్థాపకులకు పుర సన్మానం, స్వాగతోత్సవం జరిగాయి. మూడు వందలమంది పౌరులు ఈ సభలో పాల్గొన్నారని కల్నల్ ఆల్కాట్ వ్రాశారు. ఎల్ఫిన్‌స్టన్ థియేటర్లో వారి గౌరవార్థం 'సీతారాం' అనే నాటక ప్రదర్శన కూడా జరిగింది. తెల్లవారుజాము 2-45 గంటల వరకు నాటకం చూస్తూ వుండిపోయామని ఆయన వ్రాశారు.

భారతదేశం ఆధ్యాత్మ విద్యకు నిలయం; పట్టుకొమ్మ. సనాతన ధర్మ ప్రతిష్ఠాపనకు యిదే అనువైన చోటు అని వ్యవస్థాపకులు భావించారు. 'విశ్వ మానవ సోదరభావం' ప్రాతిపదికపైన సమాజ ప్రచారం ప్రారంభమైంది.

వారు బొంబాయి వచ్చిన మొదటి పదిరోజులలోనే సిమ్లాలోని పత్రిక సంపాదకుడు ఎ.పి. సిన్నెట్ అనే ఆంగ్లేయుని వద్దనుంచి ఒక ఉత్తరం వచ్చింది. తాను సమాజాన్ని గురించి, దాని ఉన్నత ఆశయాలను గురించి ఈసరికే విని వున్నానని దీని ప్రచారం కోసం ఎలాంటి సమాచారం అందచేసినా తన పత్రికలో బహుళంగా ప్రచురిస్తానని, తనకు వారిని కలుసుకుని మాట్లాడాలని చాలా ఉత్సాహంగా వున్నదనీ ఆయన వ్రాశాడు. ఇద్దరిమధ్య అనేక ఉత్తరప్రత్యుత్తరాలు జరిగిన మీదట సిన్నెట్‌ను చూచేందుకుగాను వ్యవస్థాపకులు అలహాబాద్ వెళ్ళారు. అక్కడ మేడం బ్లావట్‌స్కీ ప్రదర్శించిన కొన్ని 'విచిత్రాలు' ఆంగ్లో-ఇండియన్ వర్గాలవారిని ఇతర దేశీయులను చకిత పరిచాయి. సిన్నెట్‌తో స్నేహం బాగా కుదురుకుని ముందు ముందు సమాజ ప్రాచుర్యానికి, సాహిత్యం యేర్పడటానికి దోహదం జరిగాయి. 'పరమ గురువుల'తో తనకు సంబంధం యేర్పరచమని సిన్నెట్ ఆమెను కోరాడు.

దీనిలో వున్న చిక్కులను ఆయనకు విశదీకరించి తనద్వారా ఉత్తరప్రత్యుత్తరాలు మాత్రం నడిపించగల సదుపాయం యేర్పరచారు ఆమె. తనకు నచ్చిన పరమ గురువుల ఉత్తరాలలోని సమాచారం ఆధారంగా సిన్నెట్ దరిమిలా 'గుప్తప్రపంచము' (Occult World), ఇసోటెరిక్ బుద్ధిజమ్ (Esoteric Buddhism) అనే పుస్తకాలు వ్రాశాడు.

బ్లావట్‌స్కీ ఆయనతో తన చిన్ననాటి సమాచారాలు, ఈజిప్ట్ ఇతర దేశాలలో తాను చూచిన విచిత్రాలు, రష్యన్ సమాజంలో విశేషాలు........ యివన్నీ చెబుతూ వుండేవారు. ఆమె 'గుప్తవిద్య ప్రదర్శనలు' అందరినీ విపరీతంగా ఆకట్టుకోవడం గురించి సిన్నెట్ తన రచనలలో ఎంతో శ్లాఘిస్తూ వ్రాశారు. ఆమె పరమగురువుల ప్రత్యక్ష ప్రతినిధి అని ఆయన అభివర్ణిస్తారు. ప్రజలను నిజమైన ఆధ్యాత్మ జీవనం వైపు మరలించడమే ఆమె కర్తవ్యం.

వ్యవస్థాపకులు భారతదేశానికి వచ్చినది లగాయితు, దేశపర్యటన ప్రారంభించారు. అనేక ప్రాంతాలలో సమాజ శాఖలను స్థాపించడం,నిద్రాణితమైన నైతిక, మత విలువలను మేలుకొలపడం వారిప్రథమ కర్తవ్యంఅయింది. అలహాబాద్, కాన్పూరు, భరత్‌పూర్, జయపూర్, ఆగ్రా, షాహన్‌పూర్, మీరట్ ... యిలా అనేక నగరాలు సందర్శించారు. ఈ పర్యటనలో తాను చూచిన కొత్త విషయాలను- వాటి ఆంతరిక పరమార్థాలను వివరిస్తూ ఆమె 'హిందుస్థానంలోని గుహలు, అడవులనుండి....' (From the Caves and Jungles of Hindustan) అనే శీర్షికను రష్యన్ పత్రిక (Russian Messenger) రష్యన్ మెసెంజర్ అనేదానిలో ధారావాహికంగా వ్యాసాలు ప్రచురించారు.

1879లో ఆమె చేసిన అత్యంత ముఖ్యమైన పని 'ది థియాసఫిస్ట్' (The Theosophist) అనేపత్రికను ప్రారంభించడం. ఇది అక్టోబర్(1879)లో ప్రారంభం అయి సమాజ ఆధ్వర్యంలో ఇప్పటికీ మాసపత్రికగా వెలువడుతోంది. సమాజ ఆదర్శాలను వెలిబుచ్చటానికి, పాఠకులకు కలిగేసందేహాలను నివృత్తించటానికి. ఆధ్యాత్మ విషయాలను చర్చించటానికి ఈ పత్రికను ఆమె ప్రారంభించారు.

1880 మే నెలలో ఆమె కల్నల్ ఆల్కాట్, దామోదర మౌలంకర్ తదితరులతో కలిసి సింహళం (ఇప్పటి శ్రీలంక) వెళ్ళారు. ఆ దేశంలో సమాజ



శాఖలు అనేకం ప్రారంభం అయినాయి. మే 25 తేదీన వారిద్దరూ 'పంచశీల' ప్రయాణం చేసి బౌద్ధమతాన్ని స్వీకరించారు. బ్లావట్‌స్కీ 'రామణ్యనికాయం' అనే బౌద్ధ దేవాలయంలో బుద్ధ విగ్రహం ముందు మోకరించి బౌద్ధంపట్ల తమకు అనాదిగా వున్న విశ్వాసాన్ని తిరిగి ప్రకటించారు.

ఆ సంవత్సరమే రెండవమారు సిమ్లా వెళ్ళి సిన్నెట్ దంపతుల ఆతిథ్యం స్వీకరించారు. అక్కడనుంచి బొంబాయికి తిరిగివస్తూ మార్గమధ్యంలో అమృతసర్, లాహెూర్, ముల్తాన్, కాన్పూర్, అంబలా, కాశీ, అలహాబాదులలో సమావేశాలు యేర్పరచి ప్రసంగించారు.

1881లో కల్నల్ ఆల్కాట్ రెండవమారు సింహళానికి వెళ్ళారు. మేడం బ్లావట్‌స్కీ మాత్రం 'ది థియాసఫిస్ట్' పత్రిక యాజమాన్యం వహిస్తూ బొంబాయిలోనే వుండిపోయారు.

సిమ్లాలోను, అలహాబాద్‌లోను సిన్నెట్, ఎ.ఓ. హ్యూమ్‌లతో చాలామార్లు సమావేశాలు, చర్చలు జరిపారు.

1882లో మదరాసుకు వెళ్ళారు. బకింగ్‌హాం కాలువ మీదుగా పడవ ప్రయాణం చేస్తూ మోత్తుకూరు, నెల్లూరు, మైపాడు, పెదగంజాం, గుంటూరు, తిరుపతి పట్టణాలు దర్శించారు. ఈ సంవత్సరం రెండు ప్రధాన సంఘటనలు జరిగాయి. ఒకటి, బ్లావట్‌స్కీ 'సిక్కిం' వెళ్ళడం : రెండవది ప్రపంచ కేంద్రస్థానాన్ని బొంబాయినుంచి మదరాసుకు తరలించడం.

బొంబాయినుంచి మదరాసుకు వచ్చేస్తున్న సందర్భంలో అక్కడిపౌరులు డిసెంబర్ 17 తేదీన సత్కారసభ యేర్పాటుచేసి, సంస్థాపకులకు వీడ్కోలు ఇచ్చారు.

'మీరు ఇక్కడ వున్న కొద్దికాలంగా ఈ దేశానికి- ముఖ్యంగా ఈ బొంబాయి రాష్ట్రానికి చేసిన సేవలు ఎంతో గణనీయమైనవి. ప్రాచ్య తత్త్వ దర్శనాన్ని గురించి మీనుంచి ఎన్నో కొత్త సంగతులు నేర్చుకున్నాం మేము. మాలో విశ్వసౌభ్రాత్ర లక్షణాలను మీరు ప్రకోపింప చేశారు. పాశ్చాత్య వ్యామోహంలో పడిపోతున్న యువతరానికి కొంత కనువిప్పు జరిగింది మీ ప్రసంగాలవల్ల. మాఔన్నత్యం మాకు తెలిసివచ్చేట్లు చేసారు. దేశీయభావాలు, నైతిక పునరుజ్జీవనం, నిస్వార్థ సేవాపరాయణత మీనుంచి మేం పాఠాలుగా

నేర్చుకుంటున్నాం. ఆర్యావర్తానికి మీరు మరెంతో ఘనమైన సేవచేస్తారని ఆశిస్తూ మీకు శుభాకాంక్షలు చెప్పుతున్నాం–' అన్నది ఆనాటి సభలో ప్రసంగాల సారాంశం.

బ్లావట్‌స్కీ బొంబాయిలో వున్న మూడు సంవత్సరాలపాటు వ్రాతబల్ల దగ్గరే బానిసగా వుండిపోయి అనేక రచనలు చేశారు. థియాసఫిస్ట్ ద్వారా ఈ వ్యాసాలు ప్రచురణ అయినాయి. మరికొన్ని దేశీయ పత్రికలకు కూడా ఆమె రచనలు చేశారు. విదేశీ పత్రికలలో రచనలకుగాను తనకు వచ్చిన పారితోషి కాలను సైతం ఆమె సమాజ కార్యకలాపాలకే వెచ్చించారు.

1882 జూన్‌లో ఆమె, ఆల్కాట్ బరోడా వెళ్ళి అక్కడి గయక్వార్ మహారాజు ఆతిధ్యం స్వీకరించారు.

1883లో ఆమె ఎక్కువకాలం అడయారు (మదరాసు) లోనే కేంద్ర కార్యస్థానంలో వుండి రచనా కార్యక్రమంలో నిమగ్నులైనారు. ఆసంవత్సరం సెప్టెంబర్ నెలలో 'ఉదక మండలం' వెళ్ళారు. అక్కడి నీలిజాతులను గురించిన వివరాలు పత్రికలలో వ్యాసాలుగా ప్రచురించారు. తోడాలు, బడగులు, ఇరులు, కోటవాళ్ళు, కురంబుల జీవనవిధానాలను గురించి ఎక్కువగా పరిశీలన చేశారు, ఈ రచనలలో.

ఆమెను గురించిన ఒక పుస్తకానికి ముందుమాట వ్రాస్తూ ప్రఖ్యాత ఫ్రెంచి రచయిత ఇలా అంటారు :

'ఆమె విఖ్యాతమైన వ్యక్తి. ఏదో విచిత్రాలు చేశారనీ, అతీంద్రియ శక్తులు ప్రదర్శించారనీ కాదు ఆమెను మనం గుర్తుచేసుకుంటున్నది. నిజానికి ఇవన్నీ సిసలైన ఆధ్యాత్మ కార్యకలాపాలు కావని ఆమే చెబుతారు. విశ్వాన్ని, జీవితాన్ని ఆవరించి వున్న గుప్త సత్యానికి ఆమె జీవితం 'కీర్తన-గీతిక'. పారమార్థిక సత్యాలను పాశ్చాత్య దేశాలవారికి ఎఱుక పరచటానికి, తద్వార వాళ్ళలో 'వివేకం' ఉదయించటానికి ఆమె తీవ్రంగా పనిచేశారు. గోళాన్ని నడిపే ఏకతను ప్రజల దృష్టికి తీసుకువచ్చారు. లుప్తమైపోతున్న మహత్తర విషయాలను పునరుద్ధరించారు."

1884 సంవత్సరం దివ్యజ్ఞాన సమాజ చరిత్రలోను, బ్లావట్‌స్కీ జీవితంలోనూ అతి ముఖ్యమైనది. వంచన, నమ్మకద్రోహం జరిగాయి ఈ



సంవత్సరంలో. బ్లావట్‌స్కీని రూపుమాపటానికి ప్రయత్నం జరిగింది. దివ్య జ్ఞానం పట్ల ప్రజలలో ఏవగింపు తీసుకురావటానికీ శతధా ప్రయత్నాలు చేశారు, కొందరు. ఆమె భారతదేశంలో లేనప్పుడు కొందరు అవినీతికరమైన పనులుచేసి ఆమె పేరుప్రతిష్ఠలను కాలరాయాలనుకున్నారు. ఆమెపైన సమాజం పైన నిందలు మోపారు. సొసైటీఫర్ సైకిక్ రిసెర్చ్ వారు అబద్ధ ప్రచారానికి తావు ఇచ్చి ఆమెను మోసగత్తె అనీ, ఇంద్రజాలికురాలు మటుకే నని ఒక 'రిపోర్ట్' తయారుచేశారు. ఈ 'రిపోర్ట్' సర్వాబద్ధమని తేలటానికి దాదాపు మరో ఎనభై సంవత్సరాలు పట్టింది. కూలంబ్ దంపతులు అనేవారు తమ స్వార్థ ప్రయోజనాలకోసం ఆమెకు విరోధులుగా తయారై అపప్రచారాలు చేశారు. ఆ సంవత్సరం ఆమె యూరప్ దేశాలు పర్యటించారు. పారిస్, లండన్ నగరాలలో ఎక్కువ సమయం గడిపారు. ఆమె భారతదేశంలో తనపై జరుగుతున్న విద్రోహాలను గురించి తెలుసుకుని కృంగిపోయారు. దుర్మార్గులకు తగిన పాఠం చెప్పవలెనని సంకల్పించారు. అయితే దివ్యజ్ఞాన సమాజ కార్యనిర్వాహక వర్గం మరోరకంగా భావించింది. ఈ దుశ్చర్యలన్నీ ఎలాగైనా ఆమె కొనసాగిస్తున్న విశ్వశ్రేయస్కర కలాపాలకు అడ్డం కలిగించ టానికే ఉద్దేశించినాయి గనుక, ప్రత్యక్షంగా దోషులపైన ప్రతిచర్యలు తీసుకోనక్కర లేదన్నారు. ఆమెను కోర్టులోనిలబెట్టి అసంబద్ధమైన ప్రేలాపనలు జేయడమే వారి ఉద్దేశ్యం గనుక బ్లావట్‌స్కీ వీటినన్నిటినీ ఉదాసీనంగా చూడడమే మంచిదని అభిప్రాయపడ్డారు. వ్యక్తిగతంగా ఇందుకు ఆమె సమ్మ తించకపోయినా, మరోమార్గం లేకపోయింది.

'పరమ గురువులను గురించి కోర్టులో ఋజువులు, సాక్ష్యాలు ఇవ్వడం కంటే- నేను మరణించటానికైనా సిద్ధమే. ఆ పవిత్రుల పేరు కళంకితం చేయడం నేను జీవించివుండగా సాధ్యం కాదు. ఎవరు ఎన్ని నిందలుమోపినా, ఎంతగా అప ప్రచారాలు చేసినా వారిపై కోర్టులో నేరాలు మోపి కాలహరణం చేయలేను. నా పనిలోని నిజాయితీ, పరమ గురువుల ఔన్నత్యము- కోర్టులలో కాదు తేలవలసింది. ప్రజానీకం ముందుముందు యదార్థాలు తెలుసుకుంటారు. ద్రోహచింతన వున్నవారు కలకాలం మనలేరు–' అన్నారు ఆమె.

అయితే ఈ వాద ప్రతివాదాలు, మానసిక వ్యధ ఆమె ఆరోగ్యాన్ని దెబ్బతీశాయి. అనారోగ్యం ప్రబలకుండా, విరోధి ధంగాలకు దూరంగా వుండి

పోవాలనే ఉద్దేశ్యంతోను ఆమె 1885 మార్చి 31 తేదీన యూరప్‌కు ప్రయాణం కట్టారు. ఈ దేశంలో పరిస్థితులు సమరసంగా తయారయిన తర్వాత రావచ్చు ననుకున్నారు. అయితే ఆమెకు 1885 నుంచి యూరప్ దేశాలలో కార్యకలాపాల వల్ల గ్రంథ రచనలో ఏకాగ్రంగా మునిగిపోయి నందున తిరిగి ఇక్కడకురాకుండానే గడిచిపోయింది. అత్యధికంగా ప్రేమించిన భారతదేశాన్ని ఆమె విడిచి వెళ్ళిపోవలసి వచ్చింది. అయినా భారతదేశంలోని మిత్రులను, సమాజ కార్యకలాపాలను ఆమె మరచిపోలేదు. ఆరోగ్యం అనుమతించిన వరకు పనిచేస్తూ దివ్యజ్ఞాన ఆంతరిక సూత్రాల ప్రచారానికి, ప్రకటనకు ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వసాగారు; చివరివరకు- ఇదే పరిస్థితి కొనసాగింది.



# భారతదేశానికి తిరిగి రాకపోవడం

మేడం బ్లావట్‌స్కీ మార్చి 31, 1885 న భారతదేశం వదలివెళ్ళారు. తరువాత చాలమార్లు తిరిగి యిక్కడకు రావాలని ప్రయత్నం చేశారు. కాని పరిస్థితులు, సంఘటనలు అనుకూలించలేదు. 1891లో అనీబెసెంట్‌తో కలిసి భారతయాత్ర చేయాలని ప్రణాళిక వేసుకున్నారు. అయితే ఆసంవత్సరమే మరణం పాలు అవడం వల్ల ఈ కోరిక తీరలేదు.

భారతదేశం అంటే ఆమెకు మక్కువ ఎక్కువ. 'ఆర్యావర్తం' అని ఉదహరించేవారు దీనిని. ఆమె రచనలు- అనేక లేఖలలో ఈ దేశం అంటే ఆమెకు వున్న ఆత్మీయత, అభిమానం, గౌరవం మన్నన తెలుపుతాయి. దివ్యజ్ఞాన సమాజం ప్రత్యేకంగా ఇక్కడకు వచ్చి, కేంద్రస్థానాన్ని నిర్మించు కోవడం యాదృచ్ఛికంగా జరిగిన పనికాదు. ఆ సంస్థ సంస్థాపకులు- దాని వెనుక వున్న మహాత్ములు, మహర్షులు ఆ కార్యక్రమాన్ని ఒక పద్ధతిగా యేర్పరచారు.

మేడం బ్లావట్‌స్కీ 1890లో 'ఆర్యావర్తంలోని నా సహోదరులకు' అని ఉద్దేశించి ఒక సుదీర్ఘలేఖ వ్రాశారు. దీనిలో భారతదేశం అంటే దివ్యజ్ఞాన చరిత్రలో వుండిన ప్రత్యేకస్థానం, ఈ దేశాన్ని పూర్వపు ఔన్నత్యానికి తీసుకు రావటానికి సమాజ సభ్యులు చేసిన సేవ ప్రస్తాపితం అయినాయి. ఆమె స్వవిషయాలే కాక, సమాజ వ్యవహారాలు, దేశపరిస్థితులు, సాంఘిక మత ప్రాపంచిక విషయాలు ఇక్కడ- ఈ ఉత్తరంలలో- ఒక కొత్త వెలుగులో కనిపిస్తాయి. ఆమె మనోవేదన, కార్యదీక్ష, చివరి వరకు ఆమె ఎన్నుకున్న ఆదర్శాలపట్ల అకుంఠిత దీక్షతో ఆచరణ మార్గాలు వెదుక్కోవడం ఇక్కడ స్పష్టపడతాయి.

"ఆర్యావర్తంలోని నా సహోదరులకు—

ఈ ఏప్రిల్ (1890) నాటికి నేను భారతదేశాన్ని వదిలి అయిదు సంవత్సరాలు పూర్తి అవుతుంది.

నేను దేశాన్ని వదిలిపోయిన తరువాత కూడా చాలమంది భారతీయులు నాతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ నా క్షేమసమాచారాలు తెలుసు

కుంటూ వున్నారు, శుభాకాంక్షలు అందచేస్తూ వున్నారు. ముఖ్యంగా ఈ సంవత్సరం- 1890- తీవ్రమైన అస్వస్థతతో కృంగిపోతున్న నాకు అనేకులు భారత మిత్రులు తమ సానుభూతిని, శుభాశయాలను తెలిపారు. స్వదేశంకంటె మిన్నగా ఈ దేశాన్ని అభిమానించి భారతీయులకు, హిందువులకు అప్రమేయమైన సేవ చేసినందుకుగాను నన్ను తాము ఎన్నటికీ మరచిపోలేమని వ్రాశారు.

భారతదేశానికి నేను తిరిగి రాకపోవటానికి కారణాలు ఏమిటి అని వివరంగా మీకు తెలియపరచాలనే ఉద్దేశ్యంతో ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. ఆరోగ్యం బాగాలేకపోవడం ఎప్పటికప్పుడు మృత్యుద్వారం వరకు వెళ్ళడం వంటి కారణాలు సరేసరి. నన్ను అడయారులో ఒకమారు మృత్యుముఖంనుంచి తప్పించినవారు, తరువాత పర్యాయాలు నన్ను రక్షించినవారు నేను ఇక్కడ వున్నా అక్కడ వున్నా- ఎక్కడ వున్నా- నన్ను పనివున్నంతవరకు సజీవంగా నిలిపి వుంచగలరు. నాకిక్కడ ఒక ప్రత్యేకమైన కార్యక్రమం వున్నది. భారత దేశంలో దొరకని కొన్ని ప్రవర్తన తీరులు, యిక్కడ ఇంగ్లీషు- అమెరికన్ల సమక్షంలో లభ్యం అవుతున్నాయి.

యూరప్‌లోను, అమెరికాలోను- గడచిన మూడు సంవత్సరాలుగా 'మహాత్ముల ఉనికి'ని గురించి యదార్ధ సమాచారం తెలుసుకుని, వారిఆదేశాల ప్రకారం జీవితాన్ని పునర్నిర్మించుకుందామనే పూనికతో పనిచేస్తున్నవాళ్ళు కొందరు- వందల సంఖ్యలో, స్త్రీలు, పురుషులు- యిక్కడ నాకు తారసపడుతున్నారు.

భారతదేశంలో- నేను అక్కడనుంచి వచ్చివేసిన తరువాతమహాత్ములు- పరమ గురువులను గురించిన భక్తి శ్రద్ధ సన్నగిల్లినాయి. వ్యక్తుల మధ్య పోట్లాటలు, కీచులాటలు తలయెత్తినాయి. అనవసరమైన, అసహ్యకరమైన మనస్పర్ధలు, హేయభావాలు సభ్యులలోను, సమాజం కోసం పనిచేస్తున్న వారిలోను పొడచూపుతున్నాయి. అదేమి విచిత్రమోగాని- అంతకుముందు ఎంతో వినయంగా, విధేయంగా, వినమ్రంగా వున్నవారే ఎదురుతిరిగి నాకు, అధ్యక్షులకు, సమాజానికీ విరోధులుగా రూపొందుతున్నారు.

నేనెవరినీ నిందించడం లేదు. కలియుగ శక్తులు దివ్యజ్ఞాన సమాజ కార్యకలాపాలను మందగింపచేయటానికి, వీలయితే నిర్మూలించటానికిచేస్తున్న



ప్రయత్నాన్ని గమనించి, ఈ పరిస్థితులను, మనుష్యులను నేను యథాతథంగా అర్థం చేసుకోగలను.

ఆర్యావర్తాన్ని పునరుత్తేజ పరచటానికి దివ్యజ్ఞాన సమాజం తన పనులలో ఒక భాగంగా పరిగణించి, ఇందుకుగాను 'పరమ గురువుల' 'మహాత్ముల' ఆదర్శం తీసుకువచ్చి ప్రజలముందు వుంచింది. అయితే సరైన న్యాయనిర్ణయ శక్తి కొరవడినందువల్ల అనుచిత ఆలోచనల వల్ల, పరమ గురువుల పేరులు, వ్యక్తిత్వాలు వుదాహరించడంలో వచ్చిన అవకతవకలవల్ల వారిని గురించి ఎన్నో దుడుకులు, అపోహలు ప్రబలటానికి అవకాశం యేర్పడింది. పరిపూర్ణ సత్యాన్ని అందరికీ విచ్చలవిడిగా తెలివిడి చేయటానికి కుదరదు; అలా చేయగూడదని-చేయనని-నేను నా గురువులకు ప్రతిజ్ఞ చేసి వున్నాను. నేను బహిరంగ పరచటానికి అనుమతి వున్న విషయం మటుకు యిది : అటువంటి మహనీయులు, పరమ గురువులు ఎక్కడో వున్నారని; వారిలో కొందరు హిందువులని; గుప్తవిద్యలో వారు నిష్ణాతులని, ప్రకృతికి సంబంధించిన అనేక మహాత్మ్యాలను, సిద్ధులను ఎరిగినవారని; వారిలో ఒకరికి నేను శిష్యురాలనని- మాత్రమే నేను బాహాటంగా చెప్పగలను.

ఈ సిద్ధ పురుషులను గురించిన సమాచారం, వారిలో విశ్వాసం భారత దేశంలో తగినంత సత్ఫలితాలను తీసుకువచ్చింది. ప్రాచీన భారత మత తాత్త్విక చింతనను పునరుజ్జీవింపచేయడం, పునఃప్రతిష్ఠితం చేయడం వారి సంకల్పం. మిషనరీలు పడగొట్టచూస్తున్న ప్రయత్నాలను వమ్ముచేసి, దర్శనాలలోను- ఉపనిషత్తులలోను వుండిన ప్రాచీన సనాతన జ్ఞానాన్ని పైకెత్తి చూపటం వారి ధ్యేయం. కాలేజి విద్యాభ్యాసాలవల్ల మరుగుపడిపోయిన నైతిక, దేశభక్తి ప్రబోధక లక్ష్యాలను ఈనాటి యువతరంలో తిరిగి ప్రవేశపెట్టాలనేది వారి ఇచ్ఛ! ఈ పనులు చాలామటుకు దివ్యజ్ఞాన సమాజం ద్వారా- అది ఎన్ని తప్పటడుగులు వేసినా, ఎన్ని ఆటంకాలను ఎదుర్కోవలసి వచ్చినా- నెరవేరిందని చెప్పవచ్చును.

దివ్యజ్ఞాన ప్రభావం వలన కాకపోయినట్లయితే, తుకారాం తాతియా (బొంబాయి) వంటి మనిషి అతను చేసిన పనులన్నీ చేయగలిగేవాడా? తూర్పు దేశాలలోని పవిత్రగ్రంథాలు ఇతర భాషలలోనికి అనూదితం అయి- తప్పులు లేకుండా- ప్రచారంలోనికి వచ్చేవేనా ? తుకారాం తాతియా ఈ సమాజంలో

సభ్యుడుగా చేరకుండా వున్నట్లయితే ఈ మహత్తర కార్యాన్ని చేపట్టేవాడే కాదు. దివ్యజ్ఞాన సమాజసభ్యుల పని కాకపోయినట్లయితే, ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ ఆవిర్భావం అంటూ జరిగేదా? దామోదర్ మోలంకర్ వంటి జ్ఞాన పురుషులకు ఆలంబనం దొరికేదా ? అమెరికాలో ప్రారంభమై, దివ్యజ్ఞాన సమాజం భారతదేశానికి తరలిరావడం అనేది నిరుద్దేశ్యపూర్వకంగా జరిగిన పనికాదు. ఈ సమాజము భారతదేశానికి, భారతీయులకు- ముఖ్యంగాహిందూ సంతతికి మహోన్నతమైన ఉపకారం చేసింది.

దేశవ్యాప్తంగా స్తుతించబడిన పరమ గురువులను నా హిందుసోదరులు సభ్యులు ఈనాడు 'ఇంటింటిమాట'గా చెప్పుకుంటున్నారు. నాకు, కల్నల్ ఆల్కాట్‌కు కాదు మీరు కృతజ్ఞులుగా వుండవలసింది; ఈ మహాపురుషులకు.

'నేను 'అడయారు'లో వున్నంతవరకు వీరిద్వారా సమాజానికి రక్షణ వుండింది. దివ్యజ్ఞాన సమాజానికి ఎటువంటి దుస్థితి రాకుండా వారు కాపాడ గలిగారు. 1884లో నేను, కల్నల్ ఆల్కాట్ యూరపు దేశాలకు వెళ్ళాము. మేం ఇక్కడ లేనప్పుడు అనేక అస్తవ్యస్తతలు జరిగాయి. నేను నవంబర్‌లో తిరిగి వచ్చాక సుస్తీపడడం జరిగింది. ఆల్కాట్ బర్మా వెళ్ళాడు. అప్పుడు సమాజాన్ని ఛిన్నాభిన్నం చేయటానికి ప్రయత్నాలు జరిగాయి. ఇంత విజృంభించిన దుష్టశక్తుల ప్రభావాన్ని కూడా తట్టుకోగలిగి సమాజం నిలబడింది కేవలం వారి కృపవల్లనే. 'అసలు వారి ఉనికి' అంటూవుంటే ఈ గందర గోళాలన్నీ ఎందుకు జరిగాయి ? వారి శక్తితో వీటినన్నిటినీ అవరోధించ వచ్చునుగదా ? అని కొందరు బలహీన మందభాగ్యులు అంగలార్చారు. 'కర్మ' విషయంలో యే సదాచార మహాపురుషుడూ ప్రత్యక్షంగా జోక్యం కలిగించుకోడని అనేకమార్లు చెప్పడం జరిగింది. ఎంతో గొప్పవారైన యోగులు కూడా పనుల ఫలితాలను తారుమారు చేయజాలరని, అలా చేసినా అవి తరువాత కూడగట్టుకుని ఒకటికి పదింతలుగా రూపుకట్టుకుని విరుచుకు పడతాయని చాలామార్లు చెప్పాము. కర్మ, 'నిదానము'ల గుప్త సంవిధానం అటువంటిది.

ఎన్నో మహత్తులు చూపవచ్చును; కాని ఇవి నిజమైన ఆధ్యాత్మప్రగతికి దోహదం చేయవు. ఎవరికివారు తమ స్వయంకృత సత్కార్యాలవల్లమోక్షాన్ని నిర్వాణాన్ని పొందవలసి వుంటుంది. ఏ గురువు, దేవుడు మన తప్పిదాలను,



లోపాలను కప్పిపుచ్చలేడు. దేవతల- దేవుళ్ళకంటే మనిషి తన స్వార్జితంవల్ల సంపాదించుకున్న ఆనందమే 'మిన్న' అయినది. తప్పుచేసినవారిని శిక్షించడం 'కర్మ' పని; అది 'మహాత్ముల' పనికాదు. అయితే వారి బోధనలను చక్కగా ఆకళింపు చేసుకుని వాటిని అనుసరించి జీవించిన వారిని మటుకు వారు ఎప్పుడూ విడనాడరు. వారికి అవసరం అయిన సహాయ సహకారాలు అంద జేస్తారు. వారి సహకారం మనకు కనిపించవచ్చును, కనిపించకపోవచ్చును. పరమ గురువులలో ఇంకా విశ్వాసం సడలని వారికోసం ఈ సంగతి మళ్ళీ చెబుతున్నాను. వారిని ఎప్పుడూ నమ్మనివారు, నమ్మి వదలివేసినవారు.... తమతమ అభిప్రాయాలకు అంటిపట్టుకునే వుండవచ్చును. వారిని ఎవరూ యేమీ చేయలేరు. బహుకాలం తర్వాత తాము ఏమి పోగొట్టుకున్నారో వారికే తెలిసివస్తుంది.

నేను కృతకత ప్రదర్శించానని ఎవరైనా అనగలరా ? ఎవరినుంచైనా ఒక 'పైస' తీసుకున్నానా ? కానుకలు. బహుమతులు అందుకున్నానా?.... ఇదంతా తెలిసినవారు కూడా మిన్నకుండిపోయారు. ఎవరివద్దా డబ్బు తీసుకోక పోవడమే కాకుండా, నా రచనలద్వారా వచ్చిన డబ్బును సమాజానికే దఖలు చేశాను. విశ్రాంతి ఎరగకుండా పనిచేసి నా ఆరోగ్యాన్ని కొల్లగొట్టుకుని జీవచ్ఛవంలా తయారయ్యాను. నా పరమగురువుల కరుణాకటాక్షం లేకపోయి నట్లయితే ఎప్పుడో కన్నుమూసి వుండేదానిని గదూ! ఈ శరీర శ్రమ, యాతన అంతా తప్పిపోయేది. నన్ను 'రష్యన్ గూఢచారి' అన్నారు. ఇప్పటికీ కొందరు ఈ అనుమానాలతోనే సతమతం అవుతున్నారు.

ఇప్పటికయినా దివ్యజ్ఞాన సమాజ నాయకులు, సభ్యులలో ప్రముఖులు- భారతీయులు, యూరోపియన్లు కూడా- సంఘటితులై 'ఒక్కటి'గా నిలచి వున్నట్లయితే, పరమ గురువుల యదార్థత- శక్తిసంపదలలో విశ్వాసం ప్రక టించినట్లయితే- ఈ సమాజం యింకెంతో మహోన్నతమైన శిఖరాలను అందుకునేది. న్యాయ చట్టాల బోనులు ఎన్నివున్నా, నేను ఎన్ని పొరపాట్లు చేసివున్నా, యివన్నీ పరిహారం అయిపోయి 'సమాజ వ్యక్తిత్వం' మరింత ఉన్నతంగా శోభించి వుండేది.

అయితే సమయం వచ్చినప్పుడు అధికారులు, సహాయకులు అందరూ జారుకున్నారు. నేను కాదంటున్నా వద్దంటున్నా నేను కేంద్రస్థానం నుంచి

తొలగిపోవలసి వచ్చింది. నేను చివరి ఊపిరి వరకు 'దివ్యజ్ఞానం' కోసరం భారతదేశంలోనే పాకులాడుతూ వుండేదాన్ని, పోరాడుతూ వుండేదాన్ని, నాకు సక్రమమైన ఆలంబనం లభించలేదు. కొందరు కోర్టుచిక్కులు అన్నారు, కొందరు ప్రభుత్వ వ్యతిరేకత అన్నారు, కొందరు నిజమైన స్నేహితులు వైద్యుల అభిప్రాయం మన్నించడం అవసరం అన్నారు. నేను భారతదేశంలోనే కొనసాగేటట్లయితే చచ్చిపోవడం ఖాయం గనుక, యిక్కడి నుంచి తక్షణం వెళ్ళిపోవాలని తీర్మానించారు. యూరపుకు వెళ్ళాను; వీలయినంత త్వరలో భారతదేశానికి తిరిగి రాగలుగుతానని నాకు వాగ్దానం చేశారు,వాళ్లు.

నేను బయలుదేరింది మొదలు కుతంత్రాలు, అపోహాలు మరింత ఎక్కువ అయ్యాయి. నేను 'నేపిల్స్'లో- దారి మధ్యంలో వుండగానే, ఒక వ్యతిరేక సంస్థను స్థాపించబోతున్నానని, మూలసంస్థను నిర్మూలం చేయాలనే ఆలోచనలో వున్నాననీ వదంతులు ప్రారంభం అయినాయి. నాకేదో భూత ప్రేత పిశాచాల ఆవాహనం జరిగింది తప్ప, నిజమైన సిద్ధపురుషుల ప్రమేయం యేమీ లేదు నా చర్యలలో అని కొందరు పుకార్లు ప్రారంభం చేశారు. కుండలిని దుర్వినియోగం వల్ల నిజమైన హెచ్.పి.బి. మరణించింది; యిప్పుడు వున్నది ఎవరో వామాచార శిష్యుడు ఆక్రమించుకున్న శరీరం సుమా- అని మరికొందరు వార్తలు ప్రచారం చేశారు.... వివరాలన్నీ అనవసరం, కల్నల్ ఆల్కాట్ తప్ప తతిమ్మా వారందరూ పరమగురువుల ప్రసక్తి మరచిపోయారు. నేను మరణించినట్లయితే నా వారసులు అడయారు ఆస్తిపాస్తులపై హక్కు వున్నదంటారేమోనని, నాచేత అన్నిటినీ సమాజానికి దఖలు పరుస్తూ పత్రాలు వ్రాయించుకున్నారు. ఒక్కమాటయినా అనకుండా ఈ పత్రాలు సంతకం చేసి పంపేశాను. నాకు భారతదేశానికి తిరిగి రావాలని ప్రగాఢంగా అభిలాషవుంది. కాని దారులన్నీ మూసుకుపోతున్నాయి. నాకు వ్యతిరేకులయిన వాళ్ళసలహాలు, మన్ననలు పొందుతున్నాయి.

నేను దూరమయినాక అక్కడికార్యకలాపాలన్నీ అడుగంటిపోతున్నాయి; నీరుగారిపోతున్నాయి. నేను కన్న కొడుకులు మోస్తరుగా చూచుకున్న వాళ్ళందరూ నాకు వ్యతిరేకులు అయినారు....

నా పరమ గురువు ఆదేశం మేరకు యూరప్‌లో కొత్త సంస్థను- ప్రాథమికసూత్రాల ప్రాతిపదికమీదనే ప్రారంభం చేశాను, 'లూసిఫర్' పత్రిక



ఆరంభించాను. ఇక్కడ నా పేరిట ఒకలాడ్జి' వుంది (లండన్). ఆల్కాట్, ఇతరులు భారతదేశంలో సమాజ రెండవ ఉద్దేశ్యం కోసం అవసరమయిన పనులన్నీ చేస్తున్నారు. నేను ఇక్కడ తతిమ్మా రెండు వుద్దేశ్యాలు కొనసాగిస్తున్నాను. రెండుమార్లు కల్నల్ ఆల్కాట్ ఇక్కడకు వచ్చాడు. అప్పుడు తెలిసింది నాకు. ఇంకా నన్ను భారతదేశం రావలసిందిగా అక్కడ కొందరు ఆకాంక్షిస్తూనే వున్నారని, కాని అప్పటికే ఆలస్యంఅయిపోయింది. ప్రయాణాలు చేయగలంత, ఆ వత్తిడికి తట్టుకోగలంత దేహారోగ్యం నాకు లేదు.... ఇప్పుడు అక్కడకు వచ్చి యేం చేయగలను?

....జనం నన్ను పూర్తిగా నమ్మాలి. లేదా పూర్తిగా విసర్జించాలి. అరకొర అభిప్రాయాలవల్ల యేమీ ప్రయోజనం లేదు. నన్ను విశ్వసించని వారికి నేను యే రకంగానూ ఉపయోగకరంగా ప్రవర్తించలేను. ఇక్కడ- యూరప్, అమెరికాలలో- పరమగురువుల పట్ల అచంచల విశ్వాసం వున్నవారు దివ్యజ్ఞానం పట్ల అకుంఠిత దీక్షతో పనిచేయగలవారు వున్నారు. మూడు సంవత్సరాలుగా ఇక్కడి కార్యకలాపాలు చురుకుగా సాగుతున్నాయి. నా జీవితశేషం ఇక్కడే గడిపి, దివ్యజ్ఞానాన్ని, నన్ను విశ్వసించిన వాళ్ళకు సాధ్యమయినంత వరకు బోధనలు చేస్తూ వుండిపోతాను. భవిష్యత్తు నిర్మాణం చేస్తాను. పరమ గురువుల పట్ల అంత ఆసక్తి, నమ్మకము లేనివారికోసం పని చేయటానికి నా సమయాన్ని వ్యర్థపరచలేను....

....దివ్యజ్ఞానం పట్ల, పరమ గురువుల పట్లి అంకితభావంతో పనిచేయగలవారి మధ్య వుండి నా చేతనయిన పనిచేస్తాను. అంతేగాని అవిశ్వాసంతో తలమునకలుగా కొట్టుకుపోతున్న వారికోసం నేనేమీ చేయలేను. దివ్యజ్ఞాన సమాజానికి శత్రుతుల్యులుగా తయారయిన వారితో పోరాడుతూ కూర్చోవటానికి నాకు సమయం లేదు.

'గోడమీద పిల్లివాటం' పనిచేయదు. నాకు తెలిసిన పరమ సత్యాన్ని ప్రజలముందు వుంచాను. నాకు గురువులు బోధించిన మేరకు జ్ఞానాన్ని ఇతరులతో పంచుకున్నాను. లేదా, నేనే ఇదంతా స్వకపోల కల్పితంగా తయారుచేశాను. ఏమయినా అనుకోండి. ఏమనుకున్నా మీకు మీరు స్పష్టంగా వుండండి.

దివ్యజ్ఞానము, పరమ గురువుల పట్ల స్థిరమయిన విశ్వాసము వున్న సభ్యుల కార్యకలాపాలు పటిష్టం అయినకొద్దీ నాకు భారతదేశంతో అనుబంధం

పెరుగుతుంది. దివ్యజ్ఞానము నిజమయినదే, సత్యస్వరూపమే అని నన్ను ఇప్పుడు ఋజువు చేయమని కోరకండి. ఒక మనిషి మరుగు పడిపోయినప్పుడు దూరం అయినప్పుడు- సడలిపోయే విశ్వాసం నిజమైన విశ్వాసం కాదు దురూహలు, అపోహలు, కుతంత్రాలు, విమర్శలు లేకుండా స్వచ్ఛందంగా వుండగల వారికే నేనేమైనా ఉపదేశం చేయగలుగుతాను.

పరమ గురువులలో నమ్మిక, దివ్యజ్ఞానం పట్ల ఆత్మీయమయిన సేవా భావం, ప్రారంభంలో దివ్యజ్ఞాన సమాజం ఎన్నుకున్న కార్యక్రమాల నిర్వహణ....ఇవి అచంచలంగావున్న సభ్యులకే నేనేమయినా ప్రయోజనకారిని కాగలుగుతాను.

హిందు సభ్యులు, సోదరులు, భారత పునరుజ్జీవనం తీసుకురావలెనను కుంటే, పరమ గురువులు- మహాత్ములు వారితో కలిసిమెలిసి తిరిగి భూమి మీద నడవవలెననుకుంటే.... ముందుగా భయాన్ని, సంశయాన్ని వదలి వేయాలి. దివ్యజ్ఞాన ఉద్యమంలో నూతన అధ్యాయ చరిత్ర ప్రారంభం చేయాలి. నేను భారతదేశంలో ఉన్నా లేకపోయినా, మన సభ్యులందరు కల్నల్ అల్కాట్ దగ్గర చేరి, ఇతర దురాసక్తులు విడనాడి దివ్యజ్ఞాన ఆదర్శముల ఆలంబనలో- అతడు చెప్పినట్లుగా ధైర్యంగా మసలుకోవాలి ఇదే నేను చెప్పగల మాట."

## చివరి రోజులు :

మేడం బ్లావట్స్కీ చివరి వరకు దాదాపు చాల చురుకుగా, పనిలో నిమగ్నులయ్యే వున్నారు.

ఒకపక్క అనారోగ్యం కృంగదీస్తున్నా పత్రికా ప్రచురణ, గ్రంథరచన, అంతే వాసులకు ప్రత్యేక తరగతులలో శిక్షణ కొనసాగిస్తూనే ఉన్నారు.

1888లో 'రహస్య గ్రంథం' (The Secret Doctrine) ప్రచురణ అయిన తర్వాత గూడా ఆమె అవిరళంగా రచనలు చేస్తూనే వున్నారు. 1889లో The key to Theosophy అనే ప్రశ్నోత్తర మాలికలతో కూర్చిన గ్రంథం ప్రచురించారు. చిన్నచిన్న వ్యాసాలు ఎన్నో !

దివ్యజ్ఞాన యోగగ్రంథం అని పేరుపొందిన The Voice of the Scilence ను కూడా ఆమె 1889లోనే ప్రచురించారు.





రహస్యగ్రంథం మీద వివరణలుగా ఆమె అంతేవాసులకు ఇచ్చిన ప్రసంగాలు, ప్రశ్నోత్తరాలు రెండు విడివిడి పుస్తకాలుగా 1890, 1891 లలో ప్రచురణ అయినాయి. Transactions of the Blavatsky Lodge of the Theosophical Society అని ఆ పుస్తకం పేరు.

ఆమె లండన్ నివాసం 19 Avenue Road, St. Jonh's Wood, లోనే సభ్యుల సమావేశాలు- సాయంకాల చర్చలు- జరుగుతూ వుండేవి.

1891లో ఆమె ఆరోగ్యం క్రమక్రమంగా క్షీణించి చరమ స్థాయికి తీసుకువచ్చింది పరిస్థితిని.

ఏప్రిల్ 23 సాయంకాలం ఆమె మామూలు ప్రకారం సాయంత్రం సభ్యులను, స్నేహితులను కలుసుకుని ప్రసంగించారు. మరునాడు కూడా దాదాపు కులాసాగానే గడిపారు. ఆ వారాంతంలో డాక్టర్ మెన్నెల్ (Dr. Mennell) అనే వైద్య స్నేహితులు ఆమెను పరీక్షించి అంతా సవ్యంగానే వున్నదని చెప్పారు. రాత్రి దాదాపు పదకొండు గంటలవరకు స్నేహితులతో సంభాషిస్తూ కాలం గడిపారు. మరుసటి ఉదయం, తెలియవచ్చింది ఆమె గడచిన రాత్రంతా బహుకష్టంగా- నిద్రలేమితో- బాధపడ్డారని. వైద్య చికిత్స ప్రత్యేక స్థాయిలో జరగడం ఆరంభమయింది. ఒక క్షణం తేలికగా వున్నట్లు అనిపిస్తే మరుక్షణం చాలా క్లిష్టంగా ఉండింది ఆమె ఆరోగ్యం, అప్పటినుంచి క్రమంగా.... మే 6వ తేదీవరకు యిలాగే గడిచింది. ఆ రోజు మధ్యాహ్నం అందరితో కలిసి తేలికగా ఆహారం తీసుకున్నారు. అప్పుడు 'జ్వరం' యేమీలేదు, నీరసం మటుకు ఎక్కువ అనిపించింది. ఊపిరి ఆడడం కష్టమవుతూ వచ్చింది. 'నా పని అయిపోయింది. క్రమంగా అంతరించి పోవడమే యిప్పుడు మిగిలింది,' అన్నారు డాక్టర్‌తో. 7వ తేదీ ఉదయం పదకొండు గంటలకు (I.S.T. కాదు) అంతిమ నిశ్వాసం విడిచారు. ఆమె గదిలో గొప్ప ప్రశాంతత ఆవరించినట్లు అనిపించింది, దగ్గర వున్నవారికి. ఆధ్యాత్మ అంధకార యుగంలో అవతరించిన ఏకైక కాంతిరేఖ ప్రశాంతంగా నిష్క్రమించింది.

# తనను గురించి తాను

'అనేక సంవత్సరాలక్రితం తూర్పుదేశాలలో పర్యటన చేస్తూవున్నప్పుడ
ఎప్పుడూ ఇవే ప్రశ్నలు ఎదురవుతూ వుండేవి: ఈ ప్రశ్నలకు సమాధానాల
కావాలనే 'తపన' తీవ్రతరం అవుతూ వుండేది :

భగవంతుడు ఎక్కడ ఉన్నాడు?

భగవంతుడు అంటే ఎవరు?

భగవంతుడు అంటే ఏమిటి?

అమృతమయమైన మానవుని స్వరూపాన్ని ఎవరైనా చూచినవార
ఉన్నారా?

మానవుడు అమృతమయుడు అనటానికి ఆధారాలు ఏమిటి?

ఇవన్నీ తెలియకుండా 'శాశ్వతత్వాన్ని' అర్థం చేసుకోవటం ఎల
సాధ్యపడుతుంది?

—ఈ తపనలో, అన్వేషణలో ఆదుర్దాగా, సాహసంగా ముందు
నడుస్తూ యాత్ర సాగించి కొందరు మహనీయులను కలుసుకున్నాను. వా
సిద్ధ శక్తులను మహాత్మ్యాన్ని చవిచూడాను. వారి అనంత జ్ఞానాన్ని ప్రగా
ప్రమేయాలను తెలుసుకోగలిగాను. వారు తూర్పుదేశాల (Orient) లో
మహర్షులు, మహనీయులు, పరమ గురువులు.

వారి వాక్కులకు చెవులు నిక్కబొడుచుకొని ఉండిపోయాను-'అంటా
మేడం బ్లావట్స్కీ. తమ పుస్తకం అయిసిస్ అన్‌వీల్డ్ (ప్రకృతి అనావరణ
మొదటి పుటలలోనే.

'భారతదేశంలోని పరమ గురువులనే కాదు; లడఖ్‌లో, ఈజిప్ట్‌ల
సిరియాలో- యిటువంటి నిష్ణాతులయిన మహర్షులను చాలామందిని కలు
కున్నాను. వారు రోసిక్రూషియన్లు, కబాలిస్టులు, యోగులు, వీరందర
ఆధ్యాత్మ విద్యలో పరిపూర్ణులు. మౌనులు. జనసందోహంతో విచ్చలవిడి
కలవరు. ఎవరికీ యేమీ చెప్పరు; వారిని వినగల స్థాయికి తగిన పను
నేను చేసినట్లుగా చేయగలిగితే తప్ప. ఏడు- పది సంవత్సరాలపాటు వా
చెంతవుండి నన్ను నేను నిరూపించుకున్నాను. వారిపట్ల అచంచలవిశ్వాసా

పెంచుకున్నాను. ప్రాణంపోయినా సరే- బహిర్గతం చేయటానికి వీలుగాని విషయాలను బయటపెట్టనని ప్రమాణం చేశాను. ఈప్రమాణాలకు, ప్రతిజ్ఞలకు కట్టుబడి వున్నాను. చివరకు ప్రపంచంలోనికి రాగలిగాను. నేను చెప్పగలది ఒక్కటే; 'సత్యం ! హిమాలయాలకు అవలివైపున పరిపూర్ణులయిన ఋషి పుంగవుల సమ్మేళనం వుంది. వారు అనేక దేశాలకు, జాతులకు చెందినవారు. వారందరూ కలిసికట్టుగా వ్యవహరిస్తారు. మామూలు మనుష్యులుగానే కనిపిస్తారు. కాని వారి మాహాత్మ్యం' తెలుసుకోవడం దుస్తరం. నా పరమ గురువు 'మోర్య', వారి సన్నిహితుడు 'మహాత్మ కె.హెచ్', యింకా యితర మహర్షులను నేను స్వయంగా, సాక్షాత్తుగా ఎరుగుదును. ఈజిప్ట్, సిరియా, యూరప్ దేశాలలోని మహర్షులతో వారికి సన్నిహితసంబంధాలు, రాకపోకలు ఉన్నాయి'- అంటారు మరోచోట.

వేలకొద్ది సంవత్సరాలపాటు- ఒక విద్యార్థి తరువాత మరో విద్యార్థి అందరూ ఆధ్యాత్మ విద్యలోదీక్షలు తీసుకున్నవారు- ఈ కనిపించని విశ్వం గురించి, విశ్వాన్ని ఆశ్రయించుకు వున్న రహస్యాలను గురించి అన్వేషణలు చేశారు. తమ పరిమిత ప్రజ్ఞను అపరిమిత స్థాయిలకుపెంచి, ఆధ్యాత్మికతతోను 'ఏకత్వం'తోను తన్మయం చెంది మహాశక్తివంతమైన సర్వస్వాన్ని' తెలుసుకునేందుకు అన్వేషణ కొనసాగించారు. హిమాలయాలకుచెందిన సిద్ధపురుషులు ఒక్కరే కాదు; సర్వదేశ దశా కాలాలకు చెందిన బృందాల అన్వేషకులు ఎన్నో విశ్వ రహస్యాలను కనుగొన్నారు; తెలుసుకున్నారు; జీవితం - మృత్యువు; కనిపించే లోకాలు - కనిపించని లోకాలు; తమ దివ్యఆత్మలకు పరమాత్మతో జోడించి అనేక సంగతులు క్షుణ్ణంగా తెలుసుకోగలిగారు. తమతమ అనుభవాలను, అనుభూతులను, పొందిన జ్ఞానపరంపరలను ఒకరితోమరొకరు కలబోసుకున్నారు. తాము తెలుసుకున్న 'సృష్టి రహస్యాలు' తత్త్వతః ఒకటే సుమా అని నిర్ధారించుకున్నారు. పదివేల సంవత్సరాల క్రితం పరమ యోగులు చెప్పిన సంగతులు, ఆధునిక యోగులు అన్వేషణ ఫలితంగా తెలుసుకున్న సంగతులు— ఒక్కటిగానే ఉన్నట్లు ప్రత్యక్షంగా తాము సాక్షీభూతంగా వుండి తెలుసుకున్నారు.

ఒక ఆధ్యాత్మశాస్త్ర నిర్మాణం జరిగింది,

ప్రత్యక్ష దర్శనం, అనుభూతి ఫలితంగానే.

తిరస్కరించటానికి వీలులేని ఆధారాలు, సాక్ష్యాలు సమకూడినాయి ఎవరూ కాదనటానికి వీలుగాని నిదర్శనాలు.

శాస్త్ర చర్చల ఫలితంగా 'విద్య' రూపుకట్టుకుంది.

అందరికీ అందుబాటులో వున్న 'వికాసాన్ని' పెంపొందించుకోవడ ద్వారా- దీనికి పరిపూర్ణతను జోడించడం వల్ల- మహర్షులు ప్రజ్ఞయొక్క అన్ని అంతస్తులను తాకగలిగారు; అనుభూతిని తెచ్చుకోగలిగారు.

తరతరాలుగా, యుగయుగాలుగా పూర్ణపురుషులు ఆధ్యాత్మ విద్య అంతస్తులను తరచి తరచి తెలుసుకోగలిగారు. జీవితం– జననం, మరణం పునర్జన్మ యిలాంటివన్నీ. తాము తెలుసుకున్న సంగతులను ఇతర మానవాళి కొద్దికొద్దిగా తెలివిడి చేయసాగారు. ఇతరులు ఈ విషయాలు ఆసక్తికరంగ తెలుసుకునేందుకు దోహదం చేశారు.

1851లో-నా పరమగురువును మొదటిమారుగా సశరీరంగా చూచాను

అంతకుముందు నా కలలలో, ఊహలలో చూచాను గనుక ని స్వరూపాన్ని చూడగానే గుర్తుపట్టగలిగాను.

నా అంతరాత్మను జాగరూకం చేశారు ఆయన; మేలుకొలిపి దానిపని దానికి నియమించారు.

పరమ గురువును కలుసుకునేందుకు ముందుగా– నీకు నీకై ఒకగురువు అవసరం. ఆయనే రక్షకుడు. నీకు అంతర్యామి. నీలోని గురువు చెంతక నిన్ను చేర్చేవాడు.

అంతర్యామి మనను నడిపిస్తుంది. మత్రైక పరబోధనలలో విచ్చ విడిగా చెప్పినట్లుగా మనకు వేరే ఎవరూ రక్షకులు లేరు.

చిన్న టిబెట్, మొత్తం దేశాలలో నేను దాదాపు ఏడు సంవత్సరాల పాటు ఉన్నాను. లామాల ఆశ్రమాలలో అనేక రోజులు గడిపాను. ఇతరులకు ఎవరికీ సాధ్యంగాని ప్రాంతాలలో తిరుగాడాను.

ఇంగ్లీషుభాషలో సరైనపద్ధతిని 'సెన్‌జర్ వాక్యాలు' అనువదించడంలో మహాత్మ కుథూమి గారి వద్ద ప్రత్యేక శిక్షణ పొందాను.

ఆధ్యాత్మ విద్యను పాశ్చాత్యులకు ఎంతవరకు చెప్పవచ్చును. చెప్ప వలసిన విషయాలను యే రూపంగా, యే విధానంగా చెప్పాలి– అన్న సంగతి



గూడా నేను వారివద్దనే నేర్చుకున్నాను. 'దైవీప్రకృతి'ని గురించి ప్రగాఢంగా రేమండ్ లల్లీ, పికస్ డెల్లా మిరం డోలా, కార్నీలియస్ అగ్రిపా, రాబెర్ట్ ఫ్లడ్ హెన్రీమూర్ ఇత్యాదులకంటె లోతుగా-ప్రత్యక్ష అవగాహన పొంది, నా అను భవాలను, అనుభూతులను ఇతరులతో పంచుకోగలిగాను.

'స్పిరిచువలిస్టులు' చేస్తూన్న కార్యకలాపాలను గమనించడం కోసరమే 'ఎడ్డీ'ల ఇంటికి వెళ్ళాను. అక్కడ కల్నల్ ఆల్కాట్‌ను కలుసుకోగలిగాను. ఆధ్యాత్మవిద్యను గుప్తశక్తుల అవగాహనలేకుండా నేర్చుకోగలగడం అసాధ్యం అన్న సంగతి అందరికీ తెలియవచ్చేట్లు ప్రవర్తించాను.

నేను ఎలాంటి 'గుప్తప్రపంచం'లో నివశిస్తూ అక్కడికి సమాచారాలను సేకరించగలిగానో పూర్తిగా చెప్పగలగడం అసాధ్యం. 'ఐసిస్' వ్రాస్తూ వున్నప్పుడు నా కళ్ళముందు 'తెరుచుకు కనిపించిన' అద్భుతాలను గ్రంథస్థం చేశాను. సృష్ట్యాదినుంచి ఈ భూగోళంలో యేమి జరిగిందో– శతాబ్దం తరువాత శతాబ్దంలో ఎలాంటి పరిణామాలు సంభవించాయో అంతాస్పష్టంగా చూచి, చరిత్రకు ఇంతవరకు అందని విషయాలను వివరించగలిగాను. గమనార్హమయిన ప్రతి విషయము, జీవిత పుస్తకంలోని అతి సూక్ష్మమైన మలుపులు ఛాయాచిత్రంగా విశదీకరించాను. ఇదంతా మహర్షుల ఆశీర్వచన ఫలితంగా జరిగింది. వారి సహాయం లేనట్లయితే నావల్ల యే పనీ సాధ్యం అయేది కాదు.

చెబుతూ వున్న, వ్రాస్తూ వున్న విషయాలు వెంటనే మనసుకు అవగాహన కాకపోతే, యేదో పిచ్చితనం వల్ల, పైత్యం వల్ల ఇదంతా చేస్తు న్నానని అనుకోకండి. నా స్ఫూర్తికి తగినంత, నాకు విశదం అయినంత చెప్పగలుగుతున్నాను. ఒక్కొక్కమారు నాలోనుంచి నన్ను నెట్టివేసి ఎవరో- యే మహత్తర శక్తో- నన్ను ఆక్రమించుకుని ఈ పని చేసింది. అగోచరము, అప్రమేయము అయిన శక్తి ప్రవాహం వల్ల ఇదంతా సమకూడింది. ఇది కేవలం 'ఆవేశం' కాదు. ఆ క్షణాలు గడిచిపోయిన తరువాత కూడా అంతా నాకు స్ఫురణకు వస్తుంది; దానిని నేను తిరిగి తిరిగి చెప్పగలను; వివరించ గలను.

——ఈ విషయాలు ప్రత్యక్షానుభవంలో లేని మీకు ఇదంతా కట్టుకథ లాగ, ఏదో ఇంద్రజాలం మాదిరిగా అనిపించవచ్చును. నా పరమ గురువుకు,

నాకు ఉన్న ఆత్మీయత ఎలాంటిదంటే ఎన్నో యోజనాల దూరంలో వున్నా, నేను వారి కంఠస్వరాన్ని వినగలను, వారి స్వరూపాన్ని కన్నులతో చూడగలను. వారి ప్రభావం నన్ను అంతగా దగ్గరకు తీసుకుని క్షణక్షణము 'జాగృతం' చేస్తుంది.

మనిషి పుట్టుక, పెరుగుదల పరిణామము, అభ్యున్నతి- ఇవన్నీ గుదిగుచ్చి చదువరుల ముందు ఉంచటానికి ప్రయత్నం చేశాను. సూక్ష్మాతిసూక్ష్మమైన ప్రకృతి శక్తుల కార్యకలాపాలను అర్థం చేసుకునేందుకు ఇది ఉపకరిస్తుంది. మానవ ప్రకృతిని కొంతలో కొంత సజావుగా అర్థం చేసుకునేందుకు దోహదం అవుతుంది. ఊహాపోహల ప్రసక్తి లేకుండా యదార్థాన్ని మనకు తెలివిడి చేస్తుంది.

థియొసఫీ- మానవాళికి చేయబూనుకున్న సత్కార్యం యిదే. ఆధునిక మానసిక శాస్త్రపరిశోధనలను, సత్య స్వరూపం చెంతకు తీసుకువెళ్ళి ఆధ్యాత్మ విద్యను అందరికీ అందుబాటుకు తీసుకురావడం. అనేకయుగాలుగా మానవాళి చీకటిలో పడివుండి వెలుగుకోసం తడుములాడుతూ, అలంబనంకోసం వికాసంకోసం, ఆర్తులు చాస్తూ వుంది. ఆధ్యాత్మ విద్య సహకారంతో ఈ తృష్ణ తీరుతుంది. వేదాంత విషయాలు, సాంఘిక ఆదర్శాలు దీనిమూలంగా పరిపూర్ణత చెందుతాయి. మేధస్సుకు, ఆత్మకు మరింత మెలకువ యేర్పడి మానవాళి ముందుకు నడవ గలుగుతుంది. తన గమనాన్ని సుగమంగా, సరళంగా చేరుకోగలుగుతుంది.

థియొసఫీ సూత్రాలు చక్కగా అవగాహన చేసుకుంటే, కొత్త శకం ఆరంభం అవుతుంది. పునర్జన్మ, కర్మ, అదృశ్య లోకాలు, జ్ఞానం వల్ల తెలిసివచ్చే కొత్త బాధ్యతలు మనిషికి సరికొత్త వికాసాన్ని తీసుకువస్తాయి. నిజమైన 'థియొసఫీ' పరోపకార పారీణతయే, సత్యం పట్ల భక్తి పూర్వకమైన అంకిత భావమే. మనుషులు దీనిని తెలుసుకోగలిగితే, సరికొత్త ఆనందం- ఐశ్వర్యం వికసిస్తాయి. వ్యక్తిగత కాంక్షలు, సుఖాపేక్షలు, వస్తుసంపద పట్ల మక్కువ, స్వాతిశయం తరిగిపోతే కొత్త మానవజాతి ఈ భూమిపైన ఆవిష్కారం అయినట్లు, ఆవిర్భవించినట్లు అదే సువర్ణయుగం.

ఒక మహత్తర ఆశయం వైపు, విశ్వహృదయం దగ్గరకు, తీసుకువెళ్ళే రహదారి వుంది. ఈ దారి సంకీర్ణమైనది, ముళ్ళతో, ప్రమాదాలతో నిండినది.



కాని ఇదే దారి. అంతరంగం వైపు తలుపులు తెరిచే దారి యిదే. సాహసం చేసినప్పుడు సాధించలేనిదేమీ వుండదు. నిష్కల్మషము, పవిత్రము అయిన వాతావరణం తయారుచేసుకుంటే మనస్సు అందుకోలేని అంతస్తులు యేమీ లేవు. మానవాళి దీనికోసం ముందుకు అడుగులు వేయాలి. ప్రయత్నంలో లోపం వుండగూడదు. తగినంత పూనిక లేనివారికి, తప్పిదాలలోనే కూరుకుపోయిన వారికి- ముందు ముందు మరిన్ని అవకాశాలు వున్నా. వాయిదా వేయకుండా పనిచేసుకుంటూ పోతే యిప్పుడు సత్ఫలితం, పూనిక చాలనప్పుడు జన్మపరంపరలు.

ఆధ్యాత్మ విద్యలోని అంతస్తులన్నిటినీ అర్థం చేసుకోగల శక్తియుక్తులు అందరికీలేకపోవచ్చును. అయినా ఒకవిషయంమటుకు చక్కగాగ్రహించండి- అదృశ్య లోకాలు, జీవులు వున్నాయి. మనిషిలోనే నిగూఢంగా ఎన్నో శక్తులు వున్నాయి. తలుచుకుంటే, సంకల్పం బలంగా చేసుకుంటే, మనిషే ఈ భూలోకంలో అమృతమయుడు, దైవసముడు కావచ్చును.

నేను గతించిన తరువాతనయినా, ఆధ్యాత్మ విద్యను ప్రజలకు చేరువ చేయప్రయత్నించానని మానవాళి గ్రహిస్తుంది. 'సత్యం' చెంతకు అందరిని నడిపించడం, ఆ వెలుగువైపు దారిచూపటం నాపని. ఈపనిలో తలమునకలై వున్నాను. అర్థం చేసుకోలేనివారు నన్ను హేళన చేయవచ్చును, తిరస్కరించవచ్చును, తూర్పార పట్టవచ్చును. ముందు తరాల వారయినా నా పనిలోని నిజాయితీని, సత్సంకల్పాన్ని గమనించ గలుగుతారు.

—మేడం బ్లావట్స్కీ పైఅభిప్రాయాలను తమ రచనలలో అక్కడక్కడ పొదిగారు. ఆసక్తి వున్నవారికి అన్నీ అందుబాటుకు తీసుకురావడమే, సహాయపడడమే తమ పూనిక అని పదేపదే చెప్పారు.

తిరస్కరించటానికి వీలులేని ఆధారాలు, సాక్ష్యాలు సమకూడినా
ఎవరూ కాదనటానికి వీలుగాని నిదర్శనాలు.

శాస్త్ర చర్చల ఫలితంగా 'విద్య' రూపుకట్టుకుంది.

అందరికీ అందుబాటులో వున్న 'వికాసాన్ని' పెంపొందించుకోవడ ద్వారా- దీనికి పరిపూర్ణతను జోడించడం వల్ల- మహర్షులు ప్రజ్ఞయొక్క అన్ని అంతస్తులను తాకగలిగారు; అనుభూతిని తెచ్చుకోగలిగారు.

తరతరాలుగా, యుగయుగాలుగా పూర్ణపురుషులు ఆధ్యాత్మ విద్ అంతస్తులను తరచి తరచి తెలుసుకోగలిగారు. జీవితం- జననం, మరణం పునర్జన్మ యిలాంటివన్నీ. తాము తెలుసుకున్న సంగతులను ఇతర మానవా కొద్దికొద్దిగా తెలివిడి చేయసాగారు. ఇతరులు ఈ విషయాలు ఆసక్తికరంగ తెలుసుకునేందుకు దోహదం చేశారు.

1851లో-నా పరమగురువును మొదటిమారుగా సశరీరంగా చూచాను

అంతకుముందు నా కలలలో, ఊహలలో చూచాను గనుక ని స్వరూపాన్ని చూడగానే గుర్తుపట్టగలిగాను.

నా అంతరాత్మను జాగరూకం చేశారు ఆయన; మేలుకొలిపి దానిపని దానికి నియమించారు.

పరమ గురువును కలుసుకునేందుకు ముందుగా- నీకు నీకై ఒకగురు అవసరం. ఆయనే రక్షకుడు. నీకు అంతర్యామి. నీలోని గురువు చెంతక నిన్ను చేర్చేవాడు.

అంతర్యామి మనను నడిపిస్తుంది. మతైక పరబోధనలలో విచ్చ విడిగా చెప్పినట్లుగా మనకు వేరే ఎవరూ రక్షకులు లేరు.

చిన్న టిబెట్, మొత్తం దేశాలలో నేను దాదాపు ఏడు సంవత్సరా పాటు ఉన్నాను. లామాల ఆశ్రమాలలో అనేక రోజులు గడిపాను. ఇతరులక ఎవరికీ సాధ్యంగాని ప్రాంతాలలో తిరుగాడాను.

ఇంగ్లీషుభాషలో సరైనపద్ధతిని 'సెన్‌జర్ వాక్యాలు' అనువదించడంలో మహాత్మ కుథూమి గారి వద్ద ప్రత్యేక శిక్షణ పొందాను.

ఆధ్యాత్మ విద్యను పాశ్చాత్యులకు ఎంతవరకు చెప్పవచ్చును. చెప్ప వలసిన విషయాలను యే రూపంగా, యే విధానంగా చెప్పాలి- అన్న సంగతి



గూడా నేను వారివద్దనే నేర్చుకున్నాను. 'దైవీప్రకృతి'ని గురించి ప్రగాఢంగా రేమండ్ లల్లీ, పికస్ డెల్లా మిరం డోలా, కార్నీలియస్ అగ్రిపా, రాబెర్ట్ ఫ్లడ్ హెన్రీనూర్ ఇత్యాదులకంటె లోతుగా-ప్రత్యక్ష అవగాహన పొంది, నా అనుభవాలను, అనుభూతులను ఇతరులతో పంచుకోగలిగాను.

'స్పిరిచువలిస్టులు' చేస్తూన్న కార్యకలాపాలను గమనించడం కోసరమే 'ఎడ్డీ'ల ఇంటికి వెళ్ళాను. అక్కడ కల్నల్ ఆల్కాట్‌ను కలుసుకోగలిగాను. ఆధ్యాత్మవిద్యను గుప్తశక్తుల అవగాహనలేకుండా నేర్చుకోగలగడం అసాధ్యం అన్న సంగతి అందరికీ తెలియవచ్చేట్లు ప్రవర్తించాను.

నేను ఎలాంటి 'గుప్తప్రపంచం'లో నివసిస్తూ అక్కడికి సమాచారాలను సేకరించగలిగానో పూర్తిగా చెప్పగలగడం అసాధ్యం. 'ఐసిస్' వ్రాస్తూ వున్నప్పుడు నా కళ్ళముందు 'తెరుచుకు కనిపించిన' అద్భుతాలను గ్రంథస్థం చేశాను. సృష్ట్యాదినుంచి ఈ భూగోళంలో యేమి జరిగిందో— శతాబ్దం తరువాత శతాబ్దంలో ఎలాంటి పరిణామాలు సంభవించాయో అంతాస్పష్టంగా చూచి, చరిత్రకు ఇంతవరకు అందని విషయాలను వివరించగలిగాను. గమనార్హమయిన ప్రతి విషయము, జీవిత పుస్తకంలోని అతి సూక్ష్మమైన మలుపులు ఛాయాచిత్రంగా విశదీకరించాను. ఇదంతా మహర్షుల ఆశీర్వచన ఫలితంగా జరిగింది. వారి సహాయం లేనట్లయితే నావల్ల యే పనీ సాధ్యం అయేది కాదు.

చెబుతూ వున్న, వ్రాస్తూ వున్న విషయాలు వెంటనే మనసుకు అవగాహన కాకపోతే, యేదో పిచ్చితనం వల్ల, పైత్యం వల్ల ఇదంతా చేస్తున్నానని అనుకోకండి. నా స్ఫూర్తికి తగినంత, నాకు విశదం అయినంత చెప్పగలుగుతున్నాను. ఒక్కొక్కమారు నాలోనుంచి నన్ను నెట్టివేసి ఎవరో-యే మహత్తర శక్తో- నన్ను ఆక్రమించుకుని ఈ పని చేసింది. అగోచరము, అప్రమేయము అయిన శక్తి ప్రవాహం వల్ల ఇదంతా సమకూడింది. ఇది కేవలం 'ఆవేశం' కాదు. ఆ క్షణాలు గడిచిపోయిన తరువాత కూడా అంతా నాకు స్ఫురణకు వస్తుంది; దానిని నేను తిరిగి తిరిగి చెప్పగలను; వివరించగలను.

—ఈ విషయాలు ప్రత్యక్షానుభవంలో లేని మీకు ఇదంతా కట్టుకథ లాగ, ఏదో ఇంద్రజాలం మాదిరిగా అనిపించవచ్చును. నా పరమ గురువుకు,

నాకు ఉన్న ఆత్మీయత ఎలాంటిదంటే ఎన్నో యోజనాల దూరంలో వున్నా, నేను వారి కంఠస్వరాన్ని వినగలను, వారి స్వరూపాన్ని కన్నులతో చూడగలను. వారి ప్రభావం నన్ను అంతగా దగ్గరకు తీసుకుని క్షణక్షణము 'జాగృతం' చేస్తుంది.

మనిషి పుట్టుక, పెరుగుదల పరిణామము, అభ్యున్నతి- ఇవన్నీ గుదిగూర్చి చదువరుల ముందు ఉంచటానికి ప్రయత్నం చేశాను. సూక్ష్మాతిసూక్ష్మమైన ప్రకృతి శక్తుల కార్యకలాపాలను అర్థం చేసుకునేందుకు ఇది ఉపకరిస్తుంది. మానవ ప్రకృతిని కొంతలో కొంత సజావుగా అర్థం చేసుకునేందుకు దోహదం అవుతుంది. ఊహాపోహల ప్రసక్తి లేకుండా యదార్థాన్ని మనకు తెలివిడి చేస్తుంది.

థియోసఫీ- మానవాళికి చేయబూనుకున్న సత్కార్యం యిదే. ఆధునిక మానసిక శాస్త్రపరిశోధనలను, సత్య స్వరూపం చెంతకు తీసుకువెళ్ళి ఆధ్యాత్మ విద్యను అందరికీ అందుబాటుకు తీసుకురావడం. అనేకయుగాలుగా మానవాళి చీకటిలో పడివుండి వెలుగుకోసం తడుములాడుతూ, ఆలంబనంకోసం వికాసంకోసం, అర్రులు చాస్తూ వుంది. ఆధ్యాత్మ విద్య సహకారంతో ఈ తృష్ణ తీరుతుంది. వేదాంత విషయాలు, సాంఘిక ఆదర్శాలు దీనిమూలంగా పరిపూర్ణత చెందుతాయి. మేధస్సుకు, ఆత్మకు మరింత మెలకువ యేర్పడి మానవాళి ముందుకు నడవ గలుగుతుంది. తన గమనాన్ని సుగమంగా, సరళంగా చేరుకోగలుగుతుంది.

థియాసఫీ సూత్రాలు చక్కగా అవగాహన చేసుకుంటే, కొత్త శకం ఆరంభం అవుతుంది. పునర్జన్మ, కర్మ, అదృశ్య లోకాలు, జ్ఞానం వల్ల తెలిసి వచ్చే కొత్త బాధ్యతలు మనిషికి సరికొత్త వికాసాన్ని తీసుకువస్తాయి. నిజమైన 'థియాసఫీ' పరోపకార పారీణతయే, సత్యం పట్ల భక్తి పూర్వకమైన అంకిత భావమే. మనుషులు దీనిని తెలుసుకోగలిగితే, సరికొత్త ఆనందం- ఐశ్వర్యం వికసిస్తాయి. వ్యక్తిగత కాంక్షలు, సుఖాపేక్షలు, వస్తుసంపద పట్ల మక్కువ, స్వాతిశయం తరిగిపోతే కొత్త మానవజాతి ఈ భూమిపైన ఆవిష్కారం అయినట్లు, ఆవిర్భవించినట్లు అదే సువర్ణయుగం.

ఒక మహత్తర ఆశయం వైపు, విశ్వహృదయం దగ్గరకు, తీసుకువెళ్ళే రహదారి వుంది. ఈ దారి సంకీర్ణమైనది, ముళ్ళతో, ప్రమాదాలతో నిండినది.



కాని ఇదే దారి. అంతరంగం వైపు తలుపులు తెరిచే దారి యిదే. సాహసం చేసినప్పుడు సాధించలేనిదేమీ వుండదు. నిష్కల్మషము, పవిత్రము అయిన వాతావరణం తయారుచేసుకుంటే మనస్సు అందుకోలేని అంతస్తులు యేమీ లేవు. మానవాళి దీనికోసం ముందుకు అడుగులు వేయాలి. ప్రయత్నంలో లోపం వుండగూడదు. తగినంత పూనిక లేనివారికి, తప్పిదాలలోనే కూరుకుపోయిన వారికి- ముందు ముందు మరిన్ని అవకాశాలు వున్నా. వాయిదా వేయకుండా పనిచేసుకుంటూ పోతే యిప్పుడు సత్ఫలితం, పూనిక చాలనప్పుడు జన్మపరంపరలు.

ఆధ్యాత్మ విద్యలోని అంతస్తులన్నిటినీ అర్థం చేసుకోగల శక్తియుక్తులు అందరికీలేకపోవచ్చును. అయినా ఒకవిషయంమటుకు చక్కగాగ్రహించండి- అదృశ్య లోకాలు, జీవులు వున్నాయి. మనిషిలోనే నిగూఢంగా ఎన్నో శక్తులు వున్నాయి. తలుచుకుంటే, సంకల్పం బలంగా చేసుకుంటే, మనిషి ఈ భూలోకంలో అమృతమయుడు, దైవసముడు కావచ్చును.

నేను గతించిన తరువాతనయినా, ఆధ్యాత్మ విద్యను ప్రజలకు చేరువ చేయప్రయత్నించానని మానవాళి గ్రహిస్తుంది. 'సత్యం' చెంతకు అందరిని నడిపించడం, ఆ వెలుగువైపు దారిచూపటం నాపని. ఈపనిలో తలమునకలై వున్నాను. అర్థం చేసుకోలేనివారు నన్ను హేళన చేయవచ్చును, తిరస్కరించవచ్చును, తూర్పార పట్టవచ్చును. ముందు తరాల వారయినా నా పనిలోని నిజాయితీని, సత్సంకల్పాన్ని గమనించ గలుగుతారు.

—మేడం బ్లావట్స్కీ పైఅభిప్రాయాలను తమ రచనలలో అక్కడక్కడ పొదిగారు. ఆసక్తి వున్నవారికి అన్నీ అందుబాటుకు తీసుకురావడమే, సహాయపడడమే తమ పూనిక అని పదేపదే చెప్పారు.

# పరమ గురువుల దృష్టిలో

'మా బృందంలో కొందరము- ఒకరు, యిద్దరు మటుకు ప్రపంచానికి మరికొంత ఆధ్యాత్మ విద్యను అందుబాటు చేయాలనీ, దీనిని అవగాహన చేసుకునేందుకు తగినంత పరిజ్ఞానం మానవాళి సంపాదించుకున్నదనీ భావించాము. గుప్తవిద్య బోధనలలో కొత్త అధ్యాయాన్ని ప్రారంభించవలసిన తరుణం ఆసన్నమైందని అనుకున్నాము.... అమెరికాలో ఉన్న అల్కాట్‌ను ఇందుకు ఎన్నుకున్నాము. అతడు ధైర్యసాహసాలు వున్నవాడు, నిజాయితీ పరుడు, నిస్వార్థుడు— యింకా అనేక సల్లక్షణాలు కలిగినవాడు. ఉన్నవారిలో అతడే అగ్రగణ్యుడు. అతనితో సుశిక్షితురాలయి విద్యలతో నిష్ణాతురాలయిన బ్లావట్‌స్కీని జత చేశాము. ఆమె ఎంతో ప్రాజ్ఞురాలు. వారికి వ్యక్తిగత లోపాలు ఒకటి, అర వుండవచ్చును. కాని మేము నియోగించదలుచుకున్న పనికి వారిద్దరే యోగ్యులుగా కనిపించారు. ఆమెను అమెరికాకు పంపాము. సరికొత్త ప్రయత్నం ప్రారంభించాము; అన్నారు మౌర్య మహర్షి ఒకచోట.

ఏభయి సంవత్సరాలపాటు ఆలోచించిన మీదట జరిగిన నిర్ణయం యిది.

బ్లావట్‌స్కీ ధైర్యంగా రంగప్రవేశం చేశారు. ప్రపంచంలోని మేధావంతుల నందరినీ అక్కజ పరచగల పనులు చేశారు; త్రోసివేయజాలని పరమ సత్యాలను బాహాటంగా వెలిబుచ్చారు. చివరివరకూ తమ ధ్యేయాన్ని విడనాడకుండా, ఎన్ని యిబ్బందులు- నిష్ఠూరాలు- అపప్రథలు వచ్చినా ఎదుర్కొని విజయవంతంగా బయటపడ్డారు.

మనుషుల దృష్టి 'స్వాధ్యాయం'పట్ల మళ్ళేటట్లు, మూర్ఖత్వం- అంధ విశ్వాసం నుంచి బయటపడేటట్లు చేయటానికి తగిన ఉదాత్త అభిప్రాయ ప్రకటనలు చేశారు. ఆమె సహకారం, ఒప్పుదల లేకపోయినట్లయితే ఆమె ద్వారా వెలికి వచ్చిన ఆధ్యాత్మ సత్యాలు తెలుసుకోవటానికి మానవాళిమరెన్నో శతాబ్దాలు వేచి వుండవలసి వచ్చేది.



మేడం బ్లావట్‌స్కీకి అతీంద్రియ శక్తులు ఉన్నాయి. ఉన్నత మానసిక శక్తులు (Higher Sensory Perceptions), వాటికి అలంబనగా వున్న అదృశ్య జీవులు (Invisible Beings) ఆమెకు విధేయంగా మెలిగాయి.

అతీంద్రియ శక్తులు 'ఆధ్యాత్మ విద్య' కాదు; కనీసం ఆ విద్యకు సోపానం కూడా కాదు. వాటివైపు మనిషి తన దృష్టిని మళ్ళించవలసిన అవసరం లేదు. వాటి భ్రమలలోపడి ప్రమాద సూచివైపు పయనించనక్కరలేదు.— ఈ విషయాన్ని బ్లావట్‌స్కీ అతి స్పష్టంగా అనేకమార్లు చెప్పారు. ఆమె ప్రదర్శించిన కొన్ని అతీత శక్తులను చూచి సమ్మోహితులై అనేకులు ఆమె చెంతకు చేరుకునేవారు. అప్పుడు ఆమె నిజమైన ఆధ్యాత్మ విద్యవైపు వాళ్ళ దృష్టిని మళ్ళించటానికి ప్రయత్నించేవారు. అలా దృష్టి మళ్ళించుకోకుండా వాటితోనే సంతృప్తిపడి మిగిలిపోయి తమకు, యితరులకు అపకారులుగా తయారయినవారుకూడా వున్నారు. అందుచేతనే ఒక స్థితిలో మేడం బ్లావట్‌స్కీని 'అతీంద్రియ శక్తుల ప్రదర్శనం' నిలిపివేయవలసిందిగా ఆమె పరమ గురువు 'ఆజ్ఞ' యిచ్చారు.

ప్రకృతిలో అనేక రహస్యాలు వున్నాయి; గుప్తశక్తులు వున్నాయి. వీటిని తెలియనివారు మాయలు, మర్మాలు అనుకుని భ్రమలలో పడతారు. నిజస్థితి తెలుసుకున్నప్పుడు యిటువంటి ప్రమాదం జరగదు. అయితే యిది తెలుసుకోవటానికి ఎంతో 'పూర్వసంసిద్ధత' అవసరం. విశ్వనిర్మాణసూత్రాలు సూచికలు కొంతలో కొంత తెలియాలి. అన్నిటికీ వెనక ఏదో మహత్తర శక్తి వున్నదనీ ఆ శక్తి ఒక పద్ధతి ప్రకారమే ప్రవర్తిస్తుందనీ గమనం యేర్పడాలి. శాస్త్ర విజ్ఞానానికి, మత అనుభూతులకు ఈ పద్ధతులు ఆసాంతం తెలియవు, అందవు. అందుచేతనే వీటినే సర్వమూ అనుకోవడం తప్పు- అని ఆమె సందర్భపడినప్పుడల్లా మానవాళిని హెచ్చరిస్తారు. దివ్యజ్ఞాన సూత్రాలను అవగాహన చేసుకోవడం ద్వారా. మానవుడు తన ఆధ్యాత్మ ప్రగతికి సక్రమ సోపానాలు యేర్పరచుకోవాలంటారు. ప్రకృతి శక్తుల జ్ఞానం వల్ల వచ్చిన అవనపు సౌకర్యాలను తన స్వార్థం కోసం వినియోగించకూడదు; ఇతరులకు హాని కలిగించడం కోసం ఉపయోగించకూడదు; వీటిపట్ల 'అసక్తి' అనేది పనికిరాదు; 'ఆధ్యాత్మజ్ఞానం' పట్ల శ్రద్ధ చూపాలి, అంతే.

దివ్యజ్ఞాన సమాజం మనుషులందరికీ అతీంద్రియ శక్తులను నేర్పడాని యేర్పడింది- అనుకుంటారు చాలామంది. ఉదాత్తమైన ఆధ్యాత్మ విలువలన మానవ జీవితాలలో రంగరింపచేయడమే దీని పని.

దివ్యజ్ఞాన సమాజ సూత్రాలను, ఆధ్యాత్మ విద్య ప్రతిపాదనలన క్షుణ్ణంగా చదవండి. ఆత్మవిద్యను తెలుసుకుని పొరుగువారికి తోడ్పడటాని ప్రయత్నించండి. మానవాళికి సేవ చేయండి. ఆత్మవిద్య- దివ్యజ్ఞానము అంటే స్వార్థ త్యాగం, స్వ ఆపేక్షలను విడనాడడం. పరోపకార పారీణత 'నాకోసం కాదు నేను ఉన్నది, పదుగురికీ చేతనయినంతగా ఉపకరించటానికి ప్రకృతితో సహకరించి ఈ భూతల స్వర్గాన్ని మరింతగా వికసింపచేయటాని ప్రతివారూ విధిగా ప్రయత్నం చేయాలి;' యిదీ ఆమె సందేశం; ఆమెద్వార పరమ గురువులు ప్రపంచానికి చెప్పదలుచుకున్న మాటలు.

# సెన్‌జర్ భాష

మేడం బ్లావట్‌స్కీ గురించి సామాన్యంగా అందరికీ తెలియనివిషయాలు అనేకం వున్నాయి. ఆధునిక ప్రపంచానికి ఆమె పరిచయం చేసిన కొత్త విషయాలలో 'సెన్‌జర్' (Senzer) భాష అనేది ఒకటి ఉన్నది- అన్నది ఒకటి.

రహస్య గ్రంథానికి (The Secret Doctrine)మూలాధారమైన ధ్యాన శ్లోకాలు (Stanzas of Dzyan) ఈ భాషలో వున్నాయి, అంటారు ఆమె. ఈ భాష బొమ్మలు, రేఖాచిత్రాలు, గీతలతో కూడివుంటుంది. దీనికి వేరే 'అక్షరాలు' అంటూ వుంటాయని అనుకోగూడదు. చిత్రాలలో, గీతలలో వుండిన 'సంకేతాన్ని' విడమరచి ధ్యాన శోకాలను ఆమె వాఖ్యానించారు; అంటే ఆ భావాలను మనుషుల మనసులకు అవగాహన అయేట్లుగా ఆమె 'మాటల'లో కూర్చారు.

'సెనెజర్' అనేది విచిత్రమైన గుప్తభాష. ప్రపంచంలోని దీక్షితులు (Initiates) అందరికీ ఇది క్షుణ్ణంగా తెలుసును. మానవజాతి ప్రారంభంనుంచి ఇది అమలులో వున్నది, అంటారు ఆమె. ఉచ్చారణకు, శాస్త్రజ్ఞుల పరిశీలనకు అందుబాటు అయినది కాదు ఈ భాష. ఒకానొకప్పుడు ఈ భాష సర్వదేశాల లోనూ 'వాడుక'లో వుండేది. అయితే మన 'తరం' వచ్చేసరికి అది పూర్తిగా 'గుప్తం' అయిపోయింది. ఇది ఉచ్చారణకు కూడా అందని భాష అని మనం గమనించగలగాలి. అంటే, ఒక సంకేతాన్ని- రేఖాచిత్రాన్ని- చూడటంతోటే దానికి సంబంధించిన భావం మనసుకు కట్టేట్లు చేయగల ప్రక్రియ. ఈ సంకేతాలు కాలానుగుణంగా రకరకాలుగా విశదీకరించేందుకు వీలున్నది. ప్రస్తుతం ఈ భాషకు వాడుకలో వున్న పేరు సంకేత విద్య (Symbolism) అనుకో వచ్చును. అవ్యక్తమైన మనసులకు బోధగడుతుంది గాని మాటల చట్రంలో బిగించటానికి కుదరదు. ఎంత వర్ణించి చెప్పినా అసంపూర్ణంగానే వుండి పోతుంది.

జానపద కథలలోను, పురాణకథలలోను ఇలాంటి సంకేతాలుతరుచుగా వస్తాయి. పైకి కనిపించే అర్థం ఒకటి, అంతరార్థం మరొకటి. ఈసంకేతాలు

గీతల రూపంలో గజిబిజిగా వుండి, ఏ భాషకూ సంబంధం లేకుండా, దీక్షిత
లైన వారికి మాత్రమే అర్థమయ్యేట్లు వుంటాయి.

ఈ భాషను గురించి చెప్పవలసినప్పుడు మేడం బ్లావట్‌స్కీ అనే
వివరణ పదాలు వాడారు:

లాంగ్వేజ్, స్పీచ్, హిరోగ్లిఫ్, ఇడియోగ్రఫ్, సైఫర్ (Language, Speech, Hiroglyph, Ideograph, Cipher.)

ఆమె భాషాశాస్త్రవేత్త కాదు. అందుచేత ఈ పదాలను ఆ రోజులలో
భాషా శాస్త్రవేత్తలు వాడిన అర్థంలో వీటిని ఉపయోగించారనుకోవడం
పొరపాటు అవుతుంది. అంటే, మనకు తెలిసివున్న సంస్కృతము, లాటిన్,
ఇంగ్లీషు, తెలుగు భాషల మోస్తరుగనే 'సెన్‌జర్ భాష' గూడా ఒకటి సుమా.
అనుకోవడం కూడదు. అల్పాక్షరాలతో అనంతమైన అర్థ ప్రతిపత్తి తీసుక
వచ్చే మోస్తరుగా, కొద్దిపాటి గీతలతో- చిత్రాలతో- విశ్వ పరిణామ ప్రక్రియ
అంతా అతి తక్కువ పేజీలలో ఇముడ్చడం జరిగింది, ఈ భాష ఉపయోగించి
నప్పుడు.

సెనెజర్ భాషకు దేవనాగరి, ఈజిప్షియన్ హిరోగ్లిఫ్‌లతో కొంత
సన్నిహితత్వం వుంది. 'దేవనాగరి' అంటే దేవతలు ఉపయోగించిన భాష
(దేవ భాష) అని వ్యుత్పత్తి అర్థం; అలాగే సెనెజర్ భాష కూడా. అలాగని
సంస్కృతం, ఈజిప్షియన్ భాషలతో దీనికి ప్రత్యక్ష సంబంధం వున్నదని
అర్థం కాదు. ఈ భాషలో కొన్ని విచిత్రమైన నిగూఢమైన చిహ్నాలు వున్నాయి.
దేవనాగరి లాగానే దీనిలోనూ కొన్ని మూలవిషయాలు సాంకేతికంగాచెప్పడం
సులువు అన్నమాట.

సెన్‌జర్‌తో 'అమిద' అనే పదం- 'ఆది'కి సంబంధించినది, అంటారు-
ఒకచోట ఆమె. 'అమిద' అనేది 'ఆదిబుద్ధుని' మూలశక్తికి సంబంధించిన
రూపం. 'ఆది బుద్ధ' అనేది అవాచ్యము, అవర్ణనీయము అయిన శక్తి
(తేజస్సు). దీనికి రూపకల్పనలో 'ధ్యాన బుద్ధుల'ను ప్రతిబింబాలుగా చెప్ప
వచ్చును. ఇది ఆమె చేసిన ప్రయోగాలకు ఒక ఉదాహరణ మట్టుకే.

మరో పదం- 'కుంబుం' అనేది (Kumbum). ఇది ఒక వృక్షవిశేషం.
వృక్ష శాస్త్రసంబంధమైన పేరా లేక కేవలం సాంకేతికమా అనేది- ప్రశ్న.



వృక్షం పలుశాఖలుగా విశ్వం అంతటా వ్యాపించడం, ఆ వృక్షశాఖలు అక్ష
రాలుగా విస్తరించడం- సర్వదేశాలలోను వాడుకగా వున్న కథ. భగవద్గీతలో
చెప్పిన అశ్వత్థ వృక్షానికి మూలరూపం ఇది. కబలా సంప్రదాయములో దీన్ని
Tree of Life అంటారు; ఉత్తర బౌద్ధ సంప్రదాయంలోనిమాట Yggdrasil
అనేది. కుంబుం వృక్షం టిబెట్‌లోని ఒక చెట్టుఅనీ, దానిఆకులమీద సెన్‌జర్
చిహ్నాలు యేర్పడి వుంటాయని- సంకేతం. ఏడవ శ్లోకంలో మానవాళివృక్షం
గురించి ప్రస్తావిస్తూ 'సప్తపర్ణ' అనే పదం వాడుతారు. మనిషికి ఇదీ పేరు;
సెన్‌జర్ భాషలో సంకేతం. కుంబుం వృక్షం విశ్వాలన్నిటికీ మూలం. దాని
బెరడు వల్చిన కొద్దీ సెన్‌జర్ సంకేతాలు బయటపడతాయి. అలాగే, మనిషి
అంతరంగంలోనికి పోయినకొద్దీ 'రహస్య గ్రంథ' ప్రక్షిప్తమైన 'సనాతన
ధర్మం' గోచరం అవుతుంది. మనిషి విశ్వము ఈ ధర్మంలో నుంచి ఉద్భ
వించినవే. జ్ఞానాన్ని అంతటినీ సంతరించుకున్న ఈ 'కుంబుం' వృక్షము
మనమే, మనుష్యులమే. ఈ చెట్టుకూడా మనకు పరిచయమైన ఏ మామిడి
చెట్టు, కుంకుడు చెట్టు వంటిదో అని అనుకుంటే మళ్ళీ బోల్తా పడిపోతాము.
ఈ కుంబుం చెట్టు యాత్రాదర్శకుల పరిధిలోనికి వచ్చేది కాదు.

సర్వదేశ దశాకాలాలలోను సనాతన ధర్మాన్ని ప్రక్షిప్త పరచి పరిరక్షి
స్తున్న భాష సెన్‌జర్. మనిషి పుట్టుకకు ముందు, అతనికి తెలివితేటలు
యేర్పడటానికి ముందు- ఈ భాష వున్నది.

మామూలు భాషలు మానవుని మనస్సు నిర్మించినవి. ఈభాష మనసుకు
'మూలం' అయినది. భాషకు, తర్కానికి పూర్వ స్థితికి చెందినది. మన తెలివిడి
స్థితికి పూర్వస్థితి యిది. విశ్వవ్యాప్తమైన జ్ఞాన ఏకతకు చిహ్నం. అదే దాని
సుందరత; అదే దాని వైచిత్రి.



## సాహిత్య పరిచయం

ప్రకృతి అనావరణము
రహస్య గ్రంథం
దివ్యజ్ఞానానికి తాళపు చెవి
అంతర్వాణి

# ప్రకృతి అనావరణము
## (ISIS UNVEILED)

మేడం బ్లావట్‌స్కీ వ్రాసిన మొట్టమొదటి పుస్తకం ఇది. 1877లో ప్రచురణ అయింది.

ప్రాచ్యదేశములోని ఋషుల, మహనీయులతో అంతరిక పరిచయం సంపాదించి, వారి తత్త్వదర్శనాన్ని- ఆధ్యాత్మశాస్త్రాన్ని క్షుణ్ణంగా తెలుసుకున్న మీదట ఈ పుస్తకాన్ని ప్రచురించి ప్రజానీకంముందు ఉంచుతున్నాను. వారి సద్విమర్శకోసం. సత్యం అనేది ఎక్కడ కనిపించినా దానినిసమాదరించి పరిరక్షించి, దానిని గురించిన అపోహలను- దురభిప్రాయాలను తొలగింప చేయటానికి ఉత్సాహం చూపే అందరికీ ఈ గ్రంథం ప్రాచీన సంప్రదాయ రీతులను తెలుసుకునేందుకు ఉపకరిస్తుంది' అన్నారు ఆమె ముందుమాటలలో.

'ఈ విశాల ప్రపంచంలో ఎక్కడో ఒకచోట "అతి ప్రాచీన గ్రంథం" ఒకటి ఉంది. (An old book) ఆధునిక శాస్త్రవేత్తలు ఎన్నిరోజులపాటు ఈ గ్రంథం పుటలు పరిశీలించినా, దానికి ఉపయోగించిన కాగితం స్వరూప స్వభావాలు యేమిటో నిర్ణయించలేదు. ఒకే ఒక్క ప్రతి ఉంది ఇప్పుడు. హీబ్రూల ఆధ్యాత్మగ్రంథం- సిఫ్రా జెనౌటా(Siphra Dzeniouta) ఈప్రాచీన గ్రంథం ఆధారంగానే తయారయింది. దేశదేశాల తత్త్వదర్శన గ్రంథాలకూ యిదే మూలం' అంటారు ఆమె.

ఈ పుస్తకం రెండు భాగాలుగా విభజన అయింది; 1. శాస్త్రవిజ్ఞానం (Science) 2. ధర్మశాస్త్రం (Theology). దీనిని ప్రాచీన, ఆధునికగ్రంథాల అవగాహనకు అనుకూలించే 'తాళపుచెవి'గా అభివర్ణించారు.

ఈ పుస్తకం దివ్యజ్ఞాన గ్రంథాలలో మొట్టమొదటిది అని చెప్పవచ్చు. ఆమె భారతదేశానికి వచ్చేటప్పటికే ఈ పుస్తకం యిక్కడ కొంతలో కొంత ప్రచారంలో వుంది. ఆమె విస్తృత జ్ఞానానికి సమన్వయ రీతులకు ఇది అద్దం పడుతున్న పుస్తకం. దేశంలోని పండిత ప్రకాండులను అందరినీ అక్కజపరిచింది. మహారాష్ట్ర దేశంలోని దామోదరమ వ్లంకర్ అనే యువకుడు,

ఆంధ్రదేశంలోని తల్లాప్రగడ సుబ్బారావు అనే పండితుడు ఈ పుస్తకం చూచిన తర్వాతనే, మెడం బ్లావట్స్కీని కలుసుకునేందుకు ఆమె దగ్గర అనేక వేదాంతరహస్యాలు నేర్చుకునేందుకు సన్నద్ధులైనారు. వారిద్దరూ దివ్యజ్ఞాన సమాజ సభ్యత్వం స్వీకరించి మహోన్నత సేవ చేయగలిగారు. ఆ పుస్తకం వల్ల ప్రభావితులైనవారు ప్రపంచవ్యాప్తంగా వేనవేలు.

ఈ పుస్తకం మొదటిభాగం ముగింపు వాక్యాలు యిలా వున్నాయి :

'తెలియనివన్నీ నేను నమ్మనని కొట్టిపారవేయకండి. హిందు తత్త్వవేత్తలలో ప్రాచీనుడైన నారదుడు యేమంటున్నాడో చూడండి : "నేను ఈ సంగతి ఇంతకుముందు వినలేదు; అందుచేత ఇది అబద్ధం-అని కొట్టివేయకండి. విషయాలు తెలుసుకోవటానికి ఎంతో చదవాలి; అవగాహన చేసుకోవాలి. ఆ తర్వాత నిజానిజాలు విమర్శించుకోవాలి."

విజ్ఞానశాస్త్రం, ధర్మశాస్త్రిలలో మూఢత్వం ఎలా ప్రవేశించిందో సతార్కికంగాచూపుతూ, ప్రాచీనవిషయాలను సమాదరంగా అర్థంచేసుకోవడం ఎలా సాధ్యమవుతుందో బ్లావట్స్కీ వివరించారు.

ఈగ్రంథంలో ప్రస్తావించిన విషయాలను సిద్ధాంతీకరిస్తూ ఆమెచివరిలో పదిసూత్రాల పట్టిక యిచ్చారు. ఈ పట్టిక గమనించడం వల్ల గ్రంథంలోని తర్కవితర్కాలు- చర్చనీయాంశాలు కొంతలోకొంత అర్థం అవుతాయి.

1. సృష్టిలో విచిత్రం అద్భుతం (Miracle) అంటూ యేమీలేదు. అంతా ఒక న్యాయసూత్రం అనుసరించే నడుస్తోంది.
2. ప్రకృతి త్రిగుణాత్మకమైనది. ఒకటి కనిపిస్తూ వున్నది, రెండవది కనిపించనిది. మూడవది ఈ రెంటికీ మూలమైనది. కనిపిస్తున్నది, కనిపించనిది సదా పరిణామం చెందుతూ వుంటాయి. మూడవది మాత్రం యే మార్పులు లేకుండా వుంటుంది.
3. మనిషిగూడా త్రిగుణాత్మకుడే. స్థూలశరీరం, సూక్ష్మశరీరం; ఈరెంటికీ మూలాధారమైన అమృతత్వం.
4. 'విచిత్రం' (Miracle) అనేది ఈ మూడు తత్త్వాలు పనిచేసేతీరును విశదపరిచే జ్ఞానం, శాస్త్రం.



5. జ్ఞానాన్ని సదాచారంగానూ, దురాచారంగానూ (వామాచారం) ఉపయోగించవచ్చు.
6. 'మీడియం' వేరు; పరిపూర్ణత (Adept) వేరు.
7. ఈ వస్తువులూ ఆస్ట్రిల్ లైట్ (Astral Light) మీద ముద్రితమై వుంటాయి. దీక్షితుడైన Adept తన ప్రత్యేక దృష్టితో సర్వకాల సర్వావస్థలను చూడగలడు.
8. రంగు, ఆకారము, బాహ్య చిహ్నములలో మార్పులు వున్నట్లుగా మానవజాతులు కూడా ఆధ్యాత్మలబ్ధిలో వేరువేరు అయినవే. కొందరు వామాచారులయితే, మరికొందరు సదాచారులు అవుతారు, సహజ ప్రకృతిలోనే.
9. మనిషి బహిరంగ స్వరూపం నుంచి అంతరంగమూర్తిని విడదీయవచ్చును. అయితే 'పరిపూర్ణుడు' మటుకే స్వరూప సమగ్రతను సవ్యంగా పరికించగలడు.
10. ప్రకృతిలోని అంతరిక శక్తులను క్షుణ్ణంగా తెలుసుకోవడమే నిజమైన విద్య (Magic).

**Magic** అనే మాటను యిప్పుడు మనం సామాన్య అర్థంలో వాడే పదం లాగ చూడగూడదు యిక్కడ. అసలైన **Magic** బ్లావట్స్కీ దృష్టిలో ఆధ్యాత్మజ్ఞానం (**Spiritual Wisdom**).

ఆమె ఈ గ్రంథం రెండవభాగంలో వ్రాసిన చివరివాక్యాలు యిలా వున్నాయి :

'మానవాళికి ప్రాచీన కాలంలోను, ఆధునిక కాలంలోను ఉండిన మత విశ్వాసాలను తరచి చూచినప్పుడు మనకు స్పష్టంగా కనిపించేది యేమంటే అవన్నీ ఒకే మూలం నుంచి వచ్చినాయని (One Primitive Source). మానవాకృతిలో ఇమిడిపోయిన దైవ ప్రకృతి అనేక రకాలుగా బయటపడి ఉన్నత సీమలను అందుకుందామని ప్రయత్నం చేస్తోంది. తెల్లని కాంతిరేఖ అద్దం ద్వారా ప్రయాణం చేసినప్పుడు యేడు వేరువేరు రంగులుగా విభజన అయినట్లే. ఈ ప్రాచీన మూల తత్త్వదర్శనం మనిషి తాలూకు మూడుగుణాల ప్రకృతి నుంచి ప్రసరించినప్పుడు, వేరువేరు దర్శనాలుగా తయారయింది.

వీటినే మనం అనేక రకాలపేర్లతో 'మతములు' అని పిలుస్తున్నాము. అన్నీ కలిపికట్టుగా చూచినప్పుడు ఒకే శాశ్వత సత్యం (One Eternal Truth), విడివిడిగా చూచినప్పుడు మానవ అపరిపక్వత, తప్పిదాల ఛాయలు వేదాలలోని విశ్వదేవతల పూజలు క్రమంగా మనిషిలోని దైవత్వ ఆరాధనగా రూపాంతరం పొందుతున్నాయి. కనిపిస్తున్న వస్తువులను సరిగా సక్రమంగా చూడడం (Right Perception) వల్లనే, నిజమైన ప్రపంచం అనుభవైకవేద్యం (Subjective) మవ్వుతుందనే విషయం సువిదితం అవుతుంది.

'పాగనిజం (Paganism) అని మనం యిప్పుడు హేయంగా చూస్తున్న దానిలో 'దైవం పుష్కలంగా విస్తరించిన ప్రాచీన ధర్మం' కనిపిస్తుంది. జూడాయిజం, దానిలోనుంచి వచ్చిన క్రిష్టియానిటీ, ఇస్లాం— యీ మూల విషయంలోనుంచే స్ఫూర్తిని తీసుకున్నాయి. వేదకాలపు బ్రహ్మనిజం పూర్వరూపం (Prevedic Brahmanism), బుద్ధిజమ్ (Buddhism)- యీ రెండు దర్శనాలనుంచి అన్ని మతాలు ఉద్భవించాయి, అన్నీ 'నిర్వాణం' వయిపే ప్రవహిస్తున్నాయి.

తత్త్వదర్శన సూత్రాలను గమనించడం కోసం, తెలియచెప్పుకోవడం కోసం మనం ప్రపంచంలోని మతముల వికృతరూప చరిత్రలను చూడవలసిన పనిలేదు. నిజమైన విశ్వాసం దైవప్రసాదానికి మూర్తిమంతం, మానవులు సదా దానిముందు మోకరిల్లుతున్నారు.... తెరలు తొలగించుకొని చీకటిని పగలుగా మార్చుకుని అత్యద్భుతమైన అనావరణ సత్యాన్ని (Unveiled Truth)చూచేందుకు నిజమైనఆసక్తి కలవారికి ఉపకరించడమే మాఉద్దేశ్యం.'

ఈ పుస్తకంలో ప్రస్తావించిన సంగతులను 'విపులంగా అధ్యయనం చేయటానికి' ఉద్దేశించబడిన 'దివ్యజ్ఞాన సమాజము'నకే దీనిని అంకితం ఇచ్చారు రచయిత్రి.

---

# రహస్య గ్రంథం
## (THE SECRET DOCTRINE)

'అయిసిస్ అన్‌వెయిల్డ్' పుస్తకం ప్రచురణ అయిన తర్వాత పదకొండు సంవత్సరాలకు- 1888లో- మేడం బ్లావట్‌స్కీ 'రహస్య గ్రంథం' (The Secret Doctrine) ప్రచురించారు. ముందు అనుకున్నట్లుగా ఇది మొదటి పుస్తకానికి మరో రూపం కాదు. మహత్తరమైన మరో ఉద్గ్రంథంగా తయారయింది. ఈ రెండు పుస్తకాలూ కలిపి చదువుకుంటే పాఠకులకు ఎంతైనా ఉపయోగకరం అవుతుంది. ఆ పుస్తకంలోని విషయాలు అనేకం దివ్యజ్ఞాన సమాజికులకు అప్పుడు అర్థం కాలేదు. ఈ పుస్తకంలోని వివరణలు జోడించి చూచుకుంటే అవగాహనకు మంచి మార్గం ఏర్పడుతుంది.

చరిత్రగతిలో సమసిపోయిన తత్త్వశాస్త్రాలు, మరుగుపడిన నాగరికతలలో వెల్లివిరిసిన సాంకేతిక విజ్ఞానము ఆగ్రంథంలో హఠాత్తుగా పరికించడం మటుకే జరిగింది. ఈ గ్రంథంలో, యిప్పుడు బ్రహ్మాండ రచన, పరిణామ విధాన ప్రక్రియలు, ప్రస్తుత మానవకోటికి ముందుగా ఆవిర్భవించిన 'మూల జాతుల' వివరాలు దొరుకుతాయి. సనాతనమయిన ధర్మములు ఈ గ్రంథంలో క్రొత్తగా ప్రస్తావించడం జరిగింది. 'ఒక పురాతన గ్రంథం ఉంది. అది ఎంత పురాతనమయినదో దానిలోని పేజీలు- విషయాలు- ఎంత ప్రాచీనమయినవో ఎవరూ అంచనా వేయలేరు. ఒకే ఒక ప్రతి ప్రక్షిప్తంగా వుంది. ప్రాచీన మత గ్రంథాలన్నీ దాదాపు ఈ పుస్తకం ఆధారంగానే వ్రాయబడినాయి. భారత వర్షంలోని పురాణ గ్రంథాలకు కూడా ఇదే మూలం.' అన్న ప్రస్తావన 'రహస్య గ్రంథం'లోనూ వుంది. 'సెన్‌జర్' భాషలో వున్న ఈ పుస్తకం దీక్షితులు (ఇనిషియేట్స్-Initiates) అందరకూతెలుసును. సృష్ట్యాది నుంచి; అయిదువేల సంవత్సరాల క్రిందటి వరకు- అంటే కలియుగప్రారంభం వరకు మానవ పరిణామం అంతా యిక్కడ వివరించడం జరిగింది. మహాపురుషుడు, సంస్కర్త అయిన శ్రీకృష్ణుని అవతార సమాప్తి వరకు కథనం ఇక్కడ వుంది.

మరో గ్రంథం కూడా వుంది. కలియుగ ప్రారంభంలోనే అది అంతరించింది. అందుచేత అది అంత ప్రాచీన గ్రంథం అని చెప్పడానికివీలు లేదు. నవశకం తాలూకు విషయాలన్నీ అందులో వివరంగా వున్నాయి. బుద్ధుని అనుయాయి, శ్రీ శంకరాచార్యులు అవతరించిన సమయం నుండి ఈగ్రంథం తయారవుతోంది. పూర్వ మతాచార్యులకు యివన్నీ 'సరికొత్త విషయాలు' అనుకుందుకు ఆస్కారం లేదు. భౌగోళికంగా, చారిత్రకంగా ఎన్నెన్నిమార్పులు జరిగినా, పవిత్ర గ్రంథాలు బహు జాగ్రత్తగా ప్రక్షిప్తం అవుతూ వస్తున్నాయి. అనేక తావులనుండి సేకరించిన పుష్పాలు మీ ముందు వుంచుతున్నాను. ఇందులో నా స్వంతం అంటూ ఏమీలేదు. యీ పుష్పాలను ఒకటిగా చేర్చడానికి ఉపయోగించిన 'దారం' తప్ప నేను తీసుకువచ్చింది మరేమిలేదు- అంటారు బ్లావట్స్కీ. మీరు యీ దారాన్ని తెగలాగినా ఆ పూలు తమ సౌరభాన్ని కోల్పోవు. యీ పుస్తకం ఏదో'జానపద కథ'లాగా వుంటుందంటే- అంతే అనుకోండి. గతం వర్తమానాన్ని అర్థం చేసుకోవటానికి ఉపయోగపడుతుంది. వర్తమానం బాగా అర్థం అయితే, గతం అవగాహన అవుతుంది పూర్తిగా. తప్పులు 'అంచనాలను మీరి' వుండవచ్చును. పురాతనము, చారిత్రకము అయినవిషయాలు మనస్సునమ్మటానికి అంగీకరింపకపోవచ్చును. అయినా 'అంతరంగ స్ఫూర్తి' జోడించుకోగలిగితే కొద్దిమంది పాఠకులైనా. ఇందులోని విషయాల కొత్త వెలుగులు కనుగొనగలుగుతారు- అనిగూడా అంటారు ఆమె.

ఈ గ్రంథం ప్రధాన ఉద్దేశ్యాలు యివీ అని చెప్పారు ఆమె :

1. ప్రకృతి అనేది అణువుల యాదృచ్ఛిక కలయికలవల్ల, సముదాయంవల్ల యేర్పడినది కాదు.
2. విశ్వ రచనలో 'మనిషి'కి వున్న యథార్థమయిన స్థానాన్ని తెలియ చెప్పడం.
3. అన్నిమతాలకు మూలకందమైన ప్రాచీనసత్యాలు మరింత 'దిగజారుడు' జరగకుండా రక్షించడం.
4. కొంతలో కొంతగా- ఆ మతాలన్నీ ఒకే మూలం నుంచి ఉద్భవించినాయి సుమా అని చూపడం, తెలివిడి చేయడం.



5. ప్రకృతి తాలూకు అధ్యాత్మ (గుప్త) ప్రకృతిని తెలుసుకోవటానికి అధునిక నాగరికతలు, సైన్స్‌లు ప్రయత్నం చేయలేదని చూపడం.

మానవాళికి నేను అందిస్తున్న కానుక యిది; దీనిని ముందుతరాలవారు క్షుణ్ణంగా పరిశీలించి విలువలు కట్టాలి. ఈప్రయత్నంలో నేను యెంతమాత్రం కృతకృత్యురాలను అయ్యానో వారే నిర్ణయించాలి- అని సవినయంగా మనవి చేశారు. విజ్ఞానశాస్త్రము, మతము, తత్త్వశాస్త్రముల సమదర్శన సమన్వయ గ్రంథంగా వర్ణించి దీనిని సర్వదేశ దశాకాలాలకు చెందిన థియోసఫిస్టులకు- దివ్యజ్ఞానులకు- అంకితం యిచ్చారు.

ఈ పుస్తకం పరిచయ వ్యాసం (Introductory) షేక్స్‌పియర్ (Shakespeare) మహాకవి హెన్రీ V, (Henry V) నాటకానికి వ్రాసిన నాందిలోని వాక్యం **'Gently to hear, Kindly to Judge'** ఉటంకిస్తూ వ్రాస్తారు మేడం బ్లావట్‌స్కీ. ఈ వాక్యాన్ని సజావుగా అర్థం చేసుకోవటానికి మనం సుమతీ శతకంలోని ఈ పద్యపాదాన్ని గుర్తుతెచ్చుకోవచ్చును;

'వినదగు నెవ్వరు చెప్పిన
వినినంతనె వేగపడక వివరింపదగున్....'

ఆ పరిచయ వ్యాసంలో ఇంకా అనేక విషయాల ప్రస్తావన వస్తుంది.

'అబద్ధం కొండ దిగినంత తేలికగా ప్రచారం అవుతుంది.
నిజం ప్రచారం కావాలంటే కొండ ఎక్కినంత కష్టం'

మానవ మేధస్సు దురభిప్రాయాలు, దురూహల నుంచి బయటపడటం చాల కష్టం. విషయాలను కూలంకషంగా పరిపూర్ణంగా పరీక్షపెట్టి చూచుకోకుండా నమ్మడమో, తిరస్కరించడమో చేయడంవల్ల యీ పరిస్థితి యేర్పడుతోంది. రహస్యాలను 'గ్రంథస్థం' చేయడం వల్ల యింక అవి 'రహస్యాలు' అనడానికి వీలులేకుండా 'బట్టబయలు' అయిపోతాయి.

తూర్పుదేశాలలో ఎన్నో 'ఆప్తవాక్యాలు' వున్నాయి. వాటిలో కొన్నిమటుకే ఇప్పటివరకు బయటపడ్డాయి. ఇంతవరకు జరిగిన ప్రయత్నమంతా జ్ఞానమేరువును ఒక పక్క కొద్దిగా తెరతొలగించి క్షణమాత్రం చూపడమే. తగినంత శ్రద్ధ, ఆదరణ లేనివారికి, అనుమానపు ధూళిలోపడి నలిగిపోతున్న వారికి యుగయుగాలుగా ప్రక్షిప్తంగా పరిరక్షిస్తున్న జీవిత సత్యాలను ఒక్కమారుగా, హఠాత్తుగా తెలియచెప్పడం 'జ్ఞానుల' అభిమతం కాదు.

'జ్ఞానం' అన్ని దేశాలలో, అన్ని నాగరికతలలో, అన్ని కాలాల ప్రవర్తిల్లుతూ ఉంది. కొందరు అర్హులకు యీ జ్ఞాన ప్రసారం జరుగుతుం అయితే వారు దీనిని ఇతరులకు విచ్చలవిడిగా యిచ్చివేయటానికి కుదర ఒక్కొక్కమారు నోరు మెదపటానికైనా అవకాశం వుండదు.

'ఆర్య అసంగుడు' తన బౌద్ధధర్మ రహస్య గ్రంథాలలో, 'ఆది 'ఆది బుద్ధ' అనే మాటలను వాడారు. పరిపూర్ణ జ్ఞానాన్ని గురించి ప్రస్తా వచ్చినప్పుడల్లా ఇప్పటికీ మహాయానబౌద్ధులు యీ మాటలనే వాడు వుంటారు. ఇది సంస్కృత భాషలోని పదం. అపురూపుడైన భగవంతు ఉద్దేశించిన 'పదం' ఇది. ప్రాచీనకాలంలోని ఆర్యులు యిదేమాట వాడా అప్పుడు 'బ్రహ్మ' అనే పదం వేదాలలోగాని, ఇతర ప్రవచనాలలోగా కనిపించదు. 'పరిపూర్ణమయిన జ్ఞానం' అంతటినీ ఒకే ఒక్క ముక్క యిమిడ్చి చెప్పాలంటే, ఇటువంటి పదం యెంచుకోక తప్పదు.

దివ్యమయిన అంతరవగాహనకు 'బోధ' అనిపేరు. 'బుద్ధి' అనే ఆత్మజ్ఞానం. మనుష్యమాత్రునకు అవగాహన అవటానికి వొక మార్గం. బు అంటే స్వయంకృషివల్ల, తపన వల్ల యీ జ్ఞానాన్ని పొందడం.

ఆంతరిక తత్త్వశాస్త్రం అన్ని దేశాల, భాషల మత ప్రసక్తులన సమన్వయ పరుస్తుంది. సమరసతకు వీలు కలిగిస్తుంది. ఆయా మతా బాహ్యంగా తొడుక్కున్న ఆడంబర వస్త్రాలు, పటాటోపభాషల దుస్తు తీసివేస్తే మిగిలేది ఒకేఒక మూలాధార సూత్రం. ఈ సూత్రమే పైకి చిలువల పలువలుగా ప్రాకి, శాఖోపశాఖలుగా విస్తరించిందన్నమాట. దేశకాల పరిస్థి లకు అనుకూలంగా ప్రకృతిలో "అతీతమయిన దివ్యతత్త్వము" వుండడ అవసరం. బయటకు కనిపిస్తున్న సూర్యునివలెనే యీ తత్త్వాన్నీ కాదనలేము ప్రకృతిలోని దివ్యత్వమును అంతరిక తత్త్వశాస్త్రం యెప్పుడూ యెత్తిచూపుత వుంది. కాకపోతే అనేక మతాలు, మేధస్సులు సృష్టించిన "దివ్యత్వము మటుకు "అబద్ధం" సుమా అని చెబుతోంది. రూపంతో యిమిడిపోతున్న "భగవత్తత్త్వం" ప్రమాదకరమయినది సుమా అని హెచ్చరిస్తుంది.

ప్రాచీన జ్ఞాన ధర్మములలో ఒక ప్రముఖ భాగం నైతిక సూత్రాలు ఇవి మనిషి మనుగడకు అవసరం అయిన ధర్మసూత్రాలు. సామాన్య జనాని కూడా ఇదే అవసరం. వీటిని చక్కగా అవగాహన చేసుకుంటే, అవలంబి



లోనికి తెచ్చుకుంటే ఆ తరువాత అంతరిక సత్యాలు మనసుకు తెలిసివస్తాయి. గుప్తమయిన విషయాలవైపు అడుగులు వేయటానికి అవకాశం ఏర్పడుతుంది.

సనాతనము, ప్రాచీనము అయిన జ్ఞానధర్మంలో కొన్ని శకలాలు ఇప్పుడు బహిర్గతం వేయటానికి పరిస్థితులు అనుకూలంగా వున్నాయి. వస్తుగుణ శాస్త్రజ్ఞులు మనసును "అది భూత"మయిన విషయాలకు మటుకే పరిమితం చేసి, ఆధిదైవికమయిన విషయాలను మరుగుకు తోసివేయగల ప్రమాదం వుంది. ఈ ప్రమాదం నుంచి మానవాళిని తప్పించడం కోసం కొన్ని కొన్ని ఆధ్యాత్మిక, ఆధిదైవిక విషయాలు బయటికి వచ్చాయి. కాలానుగుణంగా లుప్తమయిపోయిన అనేక విషయాలను తిరిగి వెలికి లాగవలసివస్తుంది. ఉదాహరణకు ఋగ్వేదంలో 10,580 శ్లోకాలు (లేక 1028 పనసలు)వున్నాయి. ఎన్నో బ్రాహ్మణములు, భాష్యలు వున్న యీ శ్లోకాల పూర్తి అర్థం ఎవరికీ అవగాహన కావడం లేదు. దీనికి అవసరమయిన 'తాళపుచెవి' ఎక్కడో పోయింది. "ఓరియంటలిస్టుల"కు దొరకలేదు.

బౌద్ధ మతసంప్రదాయ గ్రంథాలకూ ఇదే అవస్థ ప్రాప్తం అయింది. అందుచేత ప్రాచీన మతాలను గురించి యితమిత్థమయిన అభిప్రాయాలు యేర్పరచుకోవడం కష్టం; నిర్ణయాలకు రావడం అసాధ్యము. అయినా వాటిని గురించి సంకుచితము, అసంబద్ధము అయిన అభిప్రాయాలు బహుళంగా ప్రచారంలో వుంటున్నాయి. వాటికేమీ ఇబ్బంది లేకుండానే వుంది.

బహుప్రాచీనము, చరిత్రకు అందని పూర్వ ప్రపంచానికి చెందినది ఈ రహస్యగ్రంథం. ఈ గ్రంథ శకలాలు ప్రపంచంలోని అనేక మతాలలో అక్కడక్కడ నక్షత్రకాంతితో మిణుకుమిణుకుమంటూ వుంటాయి. వేదాలను అర్థం చేసుకోవటానికి అవసరమయిన సరంజామా మామూలు దృష్టికి అందకుండా ఎక్కడో చీకటి గుహలలో భద్రంగా వున్నదనే మాట ప్రచారంలో వున్నది. అలాగే అన్ని మతగ్రంథాల విషయంలోకూడా.

భద్రత కోసం చేసిన పనికాని, 'జ్ఞానాన్ని' యెవరికీ అందకుండాచేయాలనే ప్రయత్నం కాదు ఇది.

గ్రహమాలికలు, సప్తజాతులు, మానవుని తత్త్వాల సాప్తిక విభజన.... ఇవన్నీ బ్రహ్మాండ రచనకు సంబంధించిన రహస్యాలు. ఈ జ్ఞానం వెనుక మహత్తరమయిన శక్తి వుంది. ఆ శక్తి దురుపయోగం అయితే- అశ్రద్ధగా

వాడితే- మానవజాతికి, యావత్తు ప్రకృతి మనుగడకు ప్రమాదం. అందుకోసమే తగిన సమయంలో తగిన మనుష్యులకు జ్ఞాన శకలాలు అందుబాటులోనికి వస్తున్నాయి. వీటిని అందుకోవడం అనే సత్ఫలితాలకు చేరువచేసే అర్హత యేమిటి అని మనం ఆలోచించవచ్చు.

గ్రంథాలు, సిద్ధాంతాలు రహస్యంగా ఉండిపోవచ్చును. లుప్తమై పోవచ్చును. అయితే వాటి సారాంశం మటుకు యోగ్యులైన పెద్దలద్వారా ఉచితరీతిని యెప్పుడూ బయలుపడుతూనే వుంటుంది. రహస్య సమ్మేళనాలలో మహనీయులైన తత్త్వవేత్తలు కాలానుగుణంగా ఈ సిద్ధాంత ప్రవచనాలను చేస్తూనేవున్నారు. పైతాగరస్, ప్లేటో మొదలైన గ్రీకు తత్త్వవేత్తలు ఈ విషయాలనే వివరించారు. సర్వదేశ దశాకాలాలలోను ఈ జ్ఞానం 'అవ్యక్తం'గా వర్ధమానం అవుతూనే వుంది. కొత్త విషయాలను వెలువరించిన వాళ్ళను గురించి అపప్రచారాలు జరగడం, జనం క్రొత్తరకాల దుష్కర్మలను పోగు చేసుకోవడం మానవాళికి అలవాటు అయిపోయింది.

'థియోసఫీ' అనేది కొత్తమతమా అని చాలమంది అడుగుతూవుంటారు. కాదు. ఇది 'మతం' సుతరాము కాదు. దాని తత్త్వచింతనలు నూతనమయినవి అసలే కాదు. ఆలోచనా పరులైన వ్యక్తులు భూమిమీద అవతరించింది మొదలు 'థియోసఫీ' రూపుదిద్దుకుంటూనే వున్నది. దీనిసూత్రాలు, ఆచరణ పద్ధతులు ఇప్పుడు క్రొత్తగా ప్రచురణ అవుతున్నాయి- అనుకోవడం సరికాదు. ఎందరో మహానుభావులు ఎన్నెన్నో విధాలుగా నిత్యసత్యాలను ప్రజావళికి చెప్పారు.

అసలు ఎవరైనా యేదేశంలోనైనా కొత్తగా ఒకమతాన్ని 'కనిపెట్టారు' అని చెప్పుకోవడం తప్పు. మత ప్రవక్తలందరు అనవరతంగా వున్న ఆద్య విషయాలను వివరించినవారే తప్ప కొత్తగా కనిపెట్టినవారు కాదు. అనూచానము, పరంపరాగతము అయిన సత్యాలను వారు సమకాలీన జనావళి దృష్టికి తీసుకువచ్చారు; అంతే. సత్యములన్నీ ప్రపంచం అంత పాతవి. ప్రవర్తకులు వాటికి కొత్త అర్థాలను, ఆచరణ- అనునయ సూత్రాలను తయారుచేసి ప్రచారంలోనికి తీసుకువచ్చారు. అన్నిదేశాలలో, భాషలలో ఇదే పనిజరిగింది. 'కన్‌ఫ్యూజియస్' అనే పైనా తత్త్వవేత్త ఇలా అన్నాడు. 'నేను కొత్త విషయాలు తయారుచేయలేదు. ఏదీ నా స్వకపోల కల్పితం కాదు.



ప్రాచీనులు చెప్పిన విషయాలను యథాతథంగా ముందు తలవారికి అందిస్తున్నాను. ఆ ఆప్తవాక్యాలలో నాకు విశ్వాసం వుంది. అవంటే నాకు ప్రాణం.'

మేడం బ్లావట్‌స్కీ కూడా 'నేను జ్ఞానవాహికను; కర్తను కాదు. మహర్షుల వాక్యాలు నాకు శిరోధార్యాలు' అంటారు. అంతేకాదు ఈవిషయాల వాస్తవం నాకు తెలుసును. దీనిలో నమ్మకం చిక్కించుకున్నవారి ప్రయోజనం కోసం ఇప్పుడు గ్రంథస్థం చేస్తున్నాను-' అంటారు. నమ్మకం లేనివాళ్ళు కోకొల్లలు. బల్లగుద్ది చెప్పినందువల్ల, వాదోపవాదాలవల్ల యేర్పడేది కాదు నమ్మకం అంటే. ఎవరికివారు పరీక్షపెట్టి చూచుకొని, స్వావలంబనవల్ల తెలుసు కోవలసిందే. కాదన్నవారిని కసిరికొట్టేదిలేదు. అవునన్నవారినిఅందలం ఎక్కించేదిలేదు. సత్యాన్నిప్రపంచంరెండురకాలుగా సమీక్షిస్తుంది. తూర్పుదేశాలవాళ్ల ఈ సంగతులు మనం ఎప్పుడూ విననేలేదుగదా, నిజం అనుకోవడం ఎట్లా- అనుకుంటారు. ఈ గ్రంథంలో విషయాలు ఇంతవరకు నోటిమాటలుగానే మనుషులందరూ అనుకుంటూ వున్నవి కొన్ని; గ్రంథస్థం అయి ఆదరణ- అనాదరణ పొందినవి మరికొన్ని.

జన బాహుళ్యానికి ఇంతవరకు తెలిసివుండని శ్లోకాల ఆధారంగా రూపొందించిన అంతరిక సూత్రాలు, సిద్ధాంతాలు ఈ గ్రంథంలో చోటుచేసుకున్నాయి. భాషలకు, భావాలకు ఇంతవరకు అందుబాటులోనికి రానివిషయాలు ఇవి. ఒక్కపట్టున వీటన్నిటినీ అందరూ నమ్ముతారని అనుకోవడం కంటే, అందరూ తిరస్కరిస్తారనీ అవహేళన చేసారనీ అనుకోవడమే ఉత్తమం. ఈ విషయాలను ఎవరూగంభీరమయిన విషయాలుగా సత్యాలుగా, ఆలోచించవలసిన అవసరం వున్నవిగా తీసుకోకపోవచ్చును. ఈ శతాబ్దంలో జరిగేపని యిదే. అయితే రానున్న శతాబ్దాలలో మటుకు పరిస్థితి వేరుగా వుంటుంది. (రహస్యగ్రంథం 1888లో ప్రచురణ అయింది. 19వ శతాబ్దంలో జనం దీనిని చాలామటుకు విడ్డూరంగా చూచారు. 20వశతాబ్దంలో అదీ యీనలభై యాభై సంవత్సరాలలో దీనిలోని అపూర్వవిషయాలు బహుజన గమనానికి వచ్చాయి. తోసివేయటానికి వీలుకాని శాస్త్రీయ పరిజ్ఞానం తోడై, ఇందులోనివి కొత్తసంగతులు కాదుసుమా అనిపిస్తున్నాయి.)

రహస్యగ్రంథం ఊహలు, అపోహలతో కూడిన పుస్తకం కాదు. "నిజం" తెలుసుకున్న మనుష్యులు దీనిని ఇతరుల దృష్టికి తీసుకురావాలని చేసిన ప్రయత్నం. దేనిలో వేదాల అవతరణకు ముందునుంచి వున్నవిషయాల వివరణం దొరుకుతుంది. కృతకత, కృత్రిమము లేని గ్రంథం ఇది.

గుప్తవిద్యకు సంబంధించిన విషయాలు ప్రతితరంలోను, యుగంలోను తగుమాత్రంగా బహిర్గతం అవుతూనే వున్నాయి. తలుపు ఓరవాకిలిగా తెరిచారు. ప్రతి శతాబ్దము, మన కృషికి ఫలితంగా, యీ తలుపు మరింతగా తెరుచుకుంటుంది. గుప్తవిద్య అంటే మూఢవిశ్వాసం కాదు. గంభీరమైన విషయాలు క్రమక్రమంగా బయటపడతాయి. అందరికీ క్రమానుగతంగా "శిరోధార్యం" అవుతాయి.

దాదాపు నూరు సంవత్సరాలక్రితం "వేదా"లను జనం అపహాస్యం చేశారు– పాశ్చాత్యులు, తూర్పుదేశాలవారు కూడా. సంస్కృతభాషను "మృతభాష" అన్నారు. 1820లో మాక్స్‌ముల్లర్, ఇతర ఓరియంటలిస్టులు చెప్పేంతవరకు ప్రపంచం దృష్టివేదాల సనాతన ధర్మాలవైపు ప్రసరించలేదు.

అంతరంగ సత్యాలను గురించి చెప్పే యే సిద్ధాంత గ్రంథం అయినా ఇంతే. ఋజువులు, సాక్ష్యాలు, వివరణలు, వ్యాఖ్యానాలు దొరికేంతవరకు ఎవరూ వాటివంక కన్నెత్తి చూడరు.

1877లో వ్రాసిన "అయిసిన్ అన్ వెయిల్డ్" అన్న పుస్తకంలో ఒక మాట వుంది. విషయములు పరిపూర్ణముగా తెలుసుకోవాలంటే, తాళపుచెవిని ఏడు పర్యాయాలు తిప్పవలసి వుంటుంది'– అని. ఆ పుస్తకంలో ఒకమారు తిప్పితే, 'రహస్య గ్రంథం'లో రెండవమారు తిప్పడం జరిగింది. ఈరోజులలో బాహాటంగా ఉపయోగిస్తున్న పదాలు, ప్రయోగాలు అప్పుడు అంతగా ప్రచారంలో లేవు. ముందు తరాలలో ఈ విషయాలను మరింత క్షుణ్ణంగా తెలుసుకున్న మహావ్యక్తి వచ్చి మరికొన్ని వివరాలు, వ్యాఖ్యానాలు ఇస్తాడు. 'గుప్తవిద్య' అనేది ఒకటి వున్నది. నైలునది- గంగానదివంటి పవిత్ర నదీ తీరాలలో ఈ విద్య ప్రసారం అవిరళంగా జరిగింది. యుగయుగాలుగా ప్రచారంలో వున్న మతాలు, తత్త్వదర్శనాల మూలభూతమైన మహత్తర విషయాలు మధ్యయుగంలో లుప్తం అయిపోయినాయి. అయినా ఇవి ఇప్పుడు తిరిగి చేతికి చిక్కుతున్నాయి, మనసుకు ఎక్కుతున్నాయి.



ఇలాంటి సిద్ధాంత ప్రాతిపదికకు సంబంధించిన పుస్తకం కేవలం కొన్ని పేజీల పీఠికతో సరిపడదు. ఎందుచేతనంటే 'రహస్య గ్రంథం' కేవల ప్రతిపాదన కాదు. అగమ్యగోచరమైన విషయాల ప్రస్తావన కాదు. ఒక శతాబ్దం పాటు ప్రపంచానికి అవసరం అయిన విజ్ఞానమంతా ఇందులో ప్రక్షిప్తమై వుంది. ఈ సంగతులు హడిహడిగా ప్రజలముందు పెట్టటానికి వీలుకాదు. పరం పరాగతమైన ఈ జ్ఞానం ప్రపంచంలోని పలు తావులలో విస్తరించి వుంది సుమా-అని ముందు 'ఖచ్చితం' చేయవలసి వుంది. పురాతన తత్త్వదర్శనాలు, చరిత్ర పుస్తకాలు, మహర్షుల జీవిత చరిత్రల నుంచి ఎన్నో 'ఉటంకింపులు' అవసరం అవుతాయి. ఈ విషయాలను ఇంతకుపూర్వమే తెలుసుకుని వుండిన మహనీయుల వచనాలు ప్రస్తావించవలసి వుంటుంది. చరిత్రకు తెలిసిన, విశ్వసనీయమైన పేర్లు చెప్పవలసి వుంటుంది. పూర్వ రచనలలో వుండిన మార్మికత, సాంకేతికత తెలియపరచవలసి వుంటుంది. ఇదంతా ఒక్కమనిషివల్ల, ఒక పుస్తకం ద్వారా సాధ్యమయ్యేపనేనా? ప్రపంచ ప్రయాణీకుడికి నాలుగుదిక్కులా విస్తరించిన రకరకాల ప్రయాణాలను గురించి జాగ్రత్తగా విశదపరచటానికి ఇక్కడ ప్రయత్నం జరుగుతోంది. ఓపికతో చదవాలి. జాగ్రత్తగా పరిశీలించాలి. ఈ పరిశీలనకు ఫలితంగా సరైన అవగాహన ఏర్పడుతుంది. అనేక దేశాలలో అనేక నామాలతో రూపాలతో ప్రస్తావన ఐన మూల విషయాలు బహు ప్రాచీనము, విశ్వజనీనము మటుకే కాక ఒకే 'పాదు' సుమా, ఒకే 'కుదురు' సుమా అనే భావన తప్పనిసరిగా యేర్పడుతుంది. శ్రద్ధాసక్తులతో పూర్తి గమనంతో చదవడం అవసరం.

మధ్య యుగాలలో సత్యాన్ని 'ఆవరణం' చేయటానికి, రూపుమాప టానికి ఎలా ప్రయత్నం జరిగిందో తెలుసుకుంటే తప్ప విషయం బోధపడదు. సత్యస్వరూపాన్ని మనిషి స్మృతుల నుంచి తుడిచివేయటానికి అనేక మతాల పురోహితులు ఎలా శ్రమించారో, ఎలా అపజయం పొందారో తెలియాలి.

సత్యం ఎప్పటికీ 'రూపు' మాయదు; అంతరించదు. ఎన్ని పుస్తకాలు, వ్రాతప్రతులు, తాటాకు గ్రంథాలు అగ్నికి ఆహుతి అయిపోయినా, పండిత ప్రకాండులు హత్యలలో ఆలవాలం అయిపోయినా, శిలాశాసనాలు గాలికి వానకు చెక్కుచెదరిపోయినా, క్రౌర్యం-మౌఢ్యం ఎంతగా దౌర్జన్య చర్యలు జరిపినా, 'సత్యం' మరుగు కాదు. మతఛాందసులు కత్తిఎర చూపి మనసులు

మార్చటానికి ప్రయత్నించారు. అన్నిటినీ నమ్మడం- లేదా తిరస్కరించడం. ఇదే తెలిసింది సామాన్య ప్రజలకు. అలాకాకుండా, నిదానించి ఆలోచించి. చర్చించడం ఒక మార్గం. అదే శ్రేయోమార్గం.

కాశీ మహారాజ వంశం మకుటాయమానంగా ప్రచారం చేసిన సూక్తి; 'సత్యాన్నాస్తి పరోధర్మః' అనేది. (సత్యమును మించిన ధర్మము మరొకటి లేదు). ఈ సూక్తినే దివ్యజ్ఞాన సమాజం తన మకుటంగా వాడుకుంటున్నది.

ప్రపంచాన్ని అయోమయంలో పడవేసిన అనేక సమస్యలకు ఈ 'రహస్య గ్రంథం'లో సూచనప్రాయమైన సమాధానాలు దొరుకుతాయి.

*　　　*　　　*

రహస్య గ్రంథాన్ని ఎలా వ్రాశారో మేడం బ్లావట్‌స్కీ వివరిస్తారు; చరిత్రకు అందని పుటలలో నుంచి ఈ వివరాలను ఎలా సేకరిస్తారో తెలుసు కోవడం కుతూహలంగా వుంటుంది.

గ్రంథం మొదటి పేజీల్లోనే ఆమె ఇలా వ్రాశారు;

'చరిత్రకు దొరకని అతి ప్రాచీన గ్రంథం- ఒక వ్రాతప్రతి- రచయిత కళ్ళముందు సాక్షాత్కరిస్తోంది. ఆ గ్రంథం నిప్పుకు నీటికి గాలికి 'విరూపం' అవనిది.

ఆ గ్రంథం మొదటి పేజీలో-

పేజి అంతా నల్లగా వుంది; పేజి మధ్య వలయాకారంలో ఒక తెల్లని చుక్క.

తరువాతి పేజీలో ఆ తెల్లని వలయాకారపు రూపచిత్రం. ఐతే ఇప్పుడు ఈ వలయం మధ్య ఒక బిందువు, చుక్క.

మొదటి పేజీలో కనిపించిన చిత్రం శాశ్వతము, కాలాతీతము, నిత్యము అయిన బ్రహ్మాండ స్థితికి సంకేతం. బ్రహ్మాండం ఇంకా నిద్రావస్థలోనే వున్న వున్నదని సూచన.

తెల్లని వలయాకారం నడుమ వున్న చుక్క, ఒక్కొక్క కాలానికి సంబంధించిన బ్రహ్మాండమును సూచిస్తుంది.

వలయాకారం నుంచే అంతా ఆవిర్భవించింది. అంతా తిరిగి అక్కడికే కుచించుకు పోతుంది. ఇది జ్యోతిలాగ ప్రకాశించే వలయం. దీనిని 'దైవ



ఏకత' అనవచ్చు. దీని పరిధి మనకు ఎప్పటికీ అర్థం కానిది; వ్యక్తము అయినట్లుగా కనిపిస్తూ వున్నా అగోచరము, అరూపము అయినది.

దానిలో వున్నది 'విరాట్' స్వరూపము.

ఈ రెండూ ఒకటే. అయినా రెంటికీ వ్యత్యాసం వున్నట్లుగా గోచరం అవుతుంది. మానవ పరిణామానికి అందే జ్ఞానం- మనం పొందగల జ్ఞానం- ఇంతవరకే పరిమితమై వున్నది సుమా అని ఒక సూచన, ఇది. ఈ స్థితిలోనే మన్వంతరాలు, వాని సృష్టి ప్రారంభం అవుతుంది. 'ప్రళయకాలం'లో దైవ సంకల్పం అంతా ఇక్కడే సావరించుకుని వుంటుంది. భవిష్యత్తులో అవతరించగల ఎన్నో బ్రహ్మాండాలు ఇక్కడే నిద్రావస్థలో వున్నాయి. అనేక విశ్వముల నిర్మాణం ఇక్కడే ఆరంభం అవుతోంది.

అన్నిటినీ ఆవరించి వున్న 'జీవం' ఇదే- ఇది శాశ్వతము. ఇది అగోచరమైనదే అయినా సర్వవ్యాపకము, ఆద్యంత రహితమూను. కాలప్రమాణాన్ని అనుసరించి అవతరిస్తూ వుంటుంది. అవతరణల మధ్య వున్న కాలప్రమాణం అవ్యక్తమైన స్వరూపం ఆవరించి పాలిస్తూవుంటుంది. ఇది చైతన్యరహితంగా అనిపిస్తుంది గాని చైతన్యవంతంగానే వుంటుంది. దీనిని గుర్తించగలగడం కష్టం. తనంతతానే అవగాహన చేసుకుంటూ వుంటుంది. (Self-Existing Reality). దీనిని 'ఆత్మభవుడు' అనడం సబబు.

'బుద్ధి' వికసించి అవగాహనకు అందేటట్లయితే దీనిని 'విశ్వం' అనుకుంటాము. మన బుద్ధి వికాసానికి అందకపోతే ఏదో 'గందరగోళం' అని పక్కకు వెళ్ళిపోతాము. నిరంతరమైన ఈ సంచలనాన్ని 'మహాసంకల్పం' (Great Breath) అని చెప్పవచ్చు. మహాపురుషుని ఉచ్ఛ్వాస నిశ్వాసలు అనుకోవచ్చు. సంచలనమే దానికి వున్న సహజసిద్ధమైన గుణం. పైగా- ఈ ప్రపంచం యొక్క నిర్విరామ సంచలనం మనం మననం చేసుకోవాలి. అది రావటానికి, పోవటానికి అవకాశం కల్పించే ఒక గొప్పస్థాయి (లేక స్థితి) ఉంది. దానిపేరు ఆకాశం (Space). సంచలనం వున్న వస్తువును దైవ సంబంధమైనదిగా గుర్తించవచ్చు. ఈ విశ్వంలో సంచలనం లేని వస్తువుగాని స్థితిగాని వుండటానికి వీలులేదు.

మానవుని ప్రారంభ దశనుంచి, ఈ ప్రపంచంలో అతడు 'జీవనం' ఆరంభించి నప్పటినుంచి, సృష్టిలో- ప్రకృతిలో వుండే శ్వాసవల్లనే అతడు

ఉత్సాహాన్ని పొందుతూ దైవత్వాన్ని గుర్తించడం మొదలుపెడతాడు. వెలుగు-వేడి-తడి- ఈ మూడూ భగవంతుని వ్యక్తరూపాలని ఆధ్యాత్మశాస్త్రం చెబుతోంది. ప్రకృతికి, అందులో జరుగుతున్న అంతులేని పరిణామాలకు ఈ మూడూ మూలకారణాలు.

ఒక గోళం నుంచి మరో గోళానికి సంచలనం కలుగుతూ వుండడం కూడా శాశ్వతము, ఆద్యంతరహితము అయినదే. ఈ సంచలానికి కాల ప్రమాణం వుంది. శాశ్వతమైన స్థితిగా ఇది ఎప్పుడూ అలాగే నిలిచి వుంది. వ్యక్తరూపంలో ఒకమారు రావడం, మరోమారు పోవడం- అవతరణ, నిష్క్రమణ- జరుగుతూ వుంటాయి. వ్యక్తమైన దానిలో కాలానికి పరిధికి సంబంధించిన రూపాలు వుంటాయి. అవ్యక్తమైనది మటుకు అలాగే ఆద్యంతరహితంగా శాశ్వతంగా వుండిపోతుంది. వ్యక్తమయినసృష్టిగా దానిని చూచినప్పుడు అది పరిపూర్ణమైనది; అనంతమైనదానికి ఒక అంశం.

మూలద్రవ్యం ఉచ్ఛ్వాసం చేసినప్పుడు సృష్టి; నిశ్వాసం చేసినప్పుడు ప్రళయం- అన్నది సామాన్య అభిప్రాయం. ప్రపంచం మనకు 'బాంధవ్యం' ద్వారానే వ్యక్తం అవుతుంది. ఈ సృష్టిలయలు ఎప్పటినుండో జరుగుతున్నాయి. అనంతమయిన సృష్టి పరంపరలలో ఇప్పుడు మనం చూస్తూ వున్నది- ఇదో చిన్నలోకం. దీనికి ఆది, అంతం లేవు.

ఏ విధమయిన విశేషణాలు చేర్చటానికి వీలులేని ఆకాశంలో వ్యక్తం అవటానికి వున్న 'ఆకాశం' తయారవుతోంది.

సృష్టికి అనుగుణమయిన ఆకాశం ఉత్పన్నం అవడంతోటే, దివ్యమయిన మాతృశక్తికి సంబంధించినది- అన్నిటినీ తనలో ఇముడ్చుకునే అనంతఅవ్యక్త స్వభావం నుంచి ప్రకృతి ఆవిర్భవించిందన్నమాట.

మొదట తెల్లని వలయాకారం, తరువాత ఈ వలయంలో ఒకబిందువు. సదా శాశ్వతమయిన ప్రకృతిలో లింగభేదం లేకుండా, అనంతంగా వుండే ఆకాశానికి ఈ బిందువు ప్రతీక. ఋగ్వేద పరిభాషలో దీనికి 'అదితి' అనిపేరు.

మూడవ అవస్థలో ఈ బిందువు 'సరళరేఖ'గా ఏర్పడుతుంది. అంటే వలయాకారంలో 'వ్యాసం'లా తయారవుతుందన్నమాట. 'జగన్మాత' ఆవిర్భావం అని చెప్పుకోవచ్చును ఈ అవస్థను.



తరువాతి దశలో 'వ్యాసం' నిలువుగా కూడా తయారవుతుంది. అంటే, వలయాకార ఆకాశంలో నిలువు, అడ్డములుగా వేర్పాట్లు జరిగినాయి. ఇది జగదావిర్భావానికి సంకేతం.

మానవాళి మూడవ మూలజాతిలోనికి అడుగుపెట్టింది. మానవ 'జీవ' ఆవిర్భావానికి ఇది గుర్తు.

చుట్టూ వున్న వలయం మాయమైపోయి, పొడుగు-వెడల్పు సూచించే 'వ్యాసాలు' మటుకే కనిపిస్తాయి తరువాతి పేజీలో. మానవ ఆవిర్భావం పూర్తి అయింది సుమా అనడానికి ఇది సంకేతం. మనిషి పూర్తిగా ప్రకృతిలో కూరుకుపోయాడు. నాలుగవ మూలజాతి ప్రవేశం ఆరంభం అయింది ఇప్పుడు. ప్రకృతిలోని పురుషుని అవతరణ పూర్తి అయిందన్నమాట.

మూడవ అంతస్తు- వలయం మధ్య అడ్డంగా వ్యాసం ఏర్పడి, రెండు విభాగాలు అయిన స్థితి ఏమితెలుపుతున్నదంటే; సృష్టికి సంబంధించిన ప్రథమ ఆవిర్భావం జరిగింది- అని. ఈ సృష్టి అంతా 'జగన్మాత'కు చెందినది. అప్పుడు జగన్మాతకు సంబంధించిన 'ఆరాధన' ఎక్కువగా జరిగింది.

నిలువుగా కూడా వ్యాసం ఏర్పడడం- శక్తి పాతానికి గుర్తు. ప్రకృతి సిద్ధమయిన పరిణామంలో లింగభేదం లేని ఒక జీవశక్తి రెండుగా విభజన అయింది సుమా- అని.

ఈ 'చిహ్నం' క్రమంగా తిరుగబడిన 'పంచకోణ తార'గా తయారవుతుంది. అది వామాచారానికి సూచన; కలియుగానికి చిహ్నం కూడా అదే. సృష్టియొక్క లక్షణం, శక్తుల వ్యవహారం తెలిసినవాళ్ళు భగవంతుని బహుళ రూపాలలో ఆరాధించటాన్ని ఇప్పుడు అర్థం చేసుకుంటారు.

బుద్ధ మతస్థులను, అద్వైతులను 'నిరీశ్వర వాదులు'గా చిత్రించడం పొరపాటు అని ఈగ్రంథం చూపించటానికి ప్రయత్నిస్తుంది. వారు విశ్వతత్త్వవేత్తలు కాకపోవచ్చునుగాని, తమ వాదాలను బోధనలను బహు తార్కికంగా కూర్చారు. వారి మాటలన్నీ హేతువాదానికి కట్టుబడి వుంటాయి. హిందువులు చెప్పే పరబ్రహ్మ; ఇతర దేశస్థులు ప్రచారం చేసిన గుప్తదేవత- శక్తులవంటిదేనని అర్థం చేసుకునేట్లయితే, అన్ని మతములకు 'సారూప్యం' వున్నదని తేలికగా అర్థం అవుతుంది.

Scanned with CamScanner

'పరబ్రహ్మ' అంటే భగవంతుడు కాదు; ఎందుకంటే అది 'ఒక' భ
గవంతుడు కాదు గనుక. 'పరబ్రహ్మ శక్తి మహత్తరమైనది; మహత్తరము
కాదు- కూడాను. (పర-అపర)' అని మాండూక్య ఉపనిషత్తులో ఒక సూత్ర
వుంది. మూలకారణముయినదిగా అది మహత్తరముయినదే; కానికారకము
అది కాదు. అవిర్భావముయిన అంతస్తులలో అది మహత్తరముయినది కాదు.

పరబ్రహ్మ అద్వితీయముయిన సత్యం. 'ఏకం ఏవ అద్వితీయమ్' అన
ముయిన ఆకాశం, బ్రహ్మాండం- అన్నిటినీ కలిగివున్నటువంటి బ్రహ్మాండ
లేక అనంతమైన సృష్టికి సంబంధించిన ఆకాశం అని చెప్పవచ్చు.

బ్రహ్మ- అంటే మార్పులేనిది, స్వచ్ఛమైనది, బంధము లేనిది, అవి
స్పష్టమైనదీని- అయిన 'బీజము'. ఏ విధమైన చలనం లేనిది, పవిత్రమై
చైతన్యం- ఈ రెండూ ఒకటే అవుతాయా?

చైతన్యం యొక్క లక్షణం, తానుఉన్నచోటునుంచే ఇతర వస్తువుల
తెలుసుకోవడం.

పరబ్రహ్మ స్వయంభవం. తాను వేరే చూడగల వస్తువు అంటూ ఏదీ
లేదు; అన్నీ ఆయనే గనుక; తనదికానిది ఈ సృష్టిలో ఏమీలేదు.

అగ్నిహోత్రం నుంచి వచ్చే జ్వాలను, అదే అగ్నిహోత్రం యొక్క
'మూలం' అనుకోవటానికి వీలవుతుందా?

ఈ మూలమే విశ్వము యొక్క జీవం; కాంతీని.

మనకు స్థూలంగా కనిపించే అగ్ని, జ్వాల- ఇవి మూలమైన అగ్ని
తేజస్సులలో ఎన్నో వంతో!

ప్రపంచంలో వుండే అగ్నిజ్వాల(భౌతికమైనది)అర్జాల్ లేక పరమహం
అయిన ఆయన దేహాన్ని ధ్వంసంచేస్తుంది. కాని మూలమైన తేజస్సు ఆయన
'అమృతమయుడి'ని చేస్తుంది; 'శాశ్వతుడి'ని చేస్తుంది.

పరబ్రహ్మ యొక్క జ్ఞానం ఏ విధమైన వర్ణనలు లేని భావన. అ
సూర్యునిలో వుండే తేజస్సు, తతిమ్మా వాటిలో వుండే వేడి- వీటన్నిటికం
భిన్నమైనది కాదు. అదే పవిత్రమైన ఈశ్వరతత్త్వం అన్నారు శ్రీ శంకరుల
అది అగ్ని కాదు, అగ్నియొక్క తేజస్సు. అందుచేత తేజస్సు, ఉష్ణము, వే
అని వర్ణించి చెప్పే లక్షణాలు ఆ మూల వస్తువుకు సంబంధించినవి కావ
కాకపోతే ఆ లక్షణాలకు కారణం ఆ మూల వస్తువే; 'అకారణ కారణం'.



పరబ్రహ్మ అనేది అనంతము, శాశ్వతము అయిన అఖిల బ్రహ్మాండాల సామూహిక శక్తి. 'తత్' మొదలయిన పదాలు, ఈ శక్తినుంచి ఉత్పన్నం అయ్యే వివిధ రూపాలకు సంబంధించిన భావాలు.

పరబ్రహ్మ స్వరూపం ఈ ప్రపంచాన్ని సృష్టిస్తోంది- అనే విషయాన్ని నిరాకరించటానికి వీలులేదు. సృష్టిక్రమం అంగీకరించవలసిందే. ఇదంతా అతీతముయినది అన్నప్పుడు సృష్టిక్రమం అంగీకరించడం లేదు అని అనుకో గూడదు. అనంతముయిన ఒక తత్త్వం- మూలవిరాట్టు దీనికి అద్యంతముయిన లక్షణాలు ఆపాదించడం లేదు.

ఉపనిషత్తులలోను, ఇతర మత గ్రంథాలలోను పరబ్రహ్మ అంటే 'అనిర్వచనీయమైన కారణం; మూలకారణం; ఏవిధమైన సంకెళ్ళు; పరిహద్దులు లేనిది.

సర్వజ్ఞము, సర్వవ్యాప్తము, సర్వశక్తి సమన్వితము అయిన దీనిని వర్ణనలు చేసి మానవుని దృష్టికి అందేటట్లు చేయటంకోసం సంకుచితపరచడం వాళ్ళకు మతరామూ ఇష్టం కాదు. పరబ్రహ్మ అనేది తనలోనే ఇముడ్చుకొని వున్న గొప్ప పదార్థం.

ఏ విధముయిన మార్పులు లేనిది, శాశ్వతమైనది, మూలమైనది, అవ్యక్త ముయినది.... ఇటువంటి దానికి ఏ విధముయిన వర్ణనలు, లక్షణాలు ఆపాదించ టానికి వీలులేదు. అది నిర్గుణముయినది.

వేదాంతులు ఈ లక్షణాలు దానికి సృష్టి ప్రారంభం అయిన తరువాత యేర్పడినట్లుగా చెప్పారు. సృష్టికి ముందు వున్న లక్షణాలు కావు, అన్నారు. అప్పుడు దానికి ఎలాంటి లక్షణాలు, గుణాలు లేవు. వ్యక్తముయిన సృష్టి లక్షణాలను వర్ణించిచెప్పటానికి ప్రయత్నించారు. సృష్టి అంటే, 'ఈశ్వరుడు-మాయ-అవిద్య' కలిసిన రూపము- అన్నారు. ఈ మూడూ చేరినప్పుడే సృష్టి అవుతుంది. సంపూర్ణమైన ప్రజ్ఞ లేకపోవడం అవిద్య. నిరంతర చైతన్యం లేకపోవడం అవిద్య అవుతుంది. కేవలం విద్య లేకపోవడం మటుకే అవిద్య కాదు.

ఈ రకంగా, భగవంతుని బహు రూపాలలో ముఖాలలో పూజించే ఈ భావం నిరీశ్వరవాదం అని చెప్పడానికి వీలులేదు. బంధవిముక్తము,

పరిధిలేనిది అనుకుంటూ వున్న ఈ విశ్వంలో అనంతము నిర్గుణము అయిన ధర్మాలు ఒకటి కంటే మించి వుండటానికి కుదరదు. స్వయం వ్యక్తమవుతున్న శక్తిని, మరొక విధంగా అనుకోవటానికి కుదరదు.

'ఏకత్వ భావన' ఉన్నప్పుడు ఆయనను వేరే ఒక సృష్టికర్తగా రూపొందించటానికి పూనుకోవడం సబబుకాదు. సృష్టి అంతటిలోను ఆయనఉన్నాడు. అప్పుడు పరబ్రహ్మను ఆరాధించడం గూడా హాస్యాస్పదం అవుతుంది.

మనకు ఉన్న ఇంద్రియ పరిమిత వైఖరిలో 'తత్' అనేది అగుపించదు. అది 'అనాత్మ'గానే వుండిపోతుంది. అలాగాక ఇదంతా సత్యరూపం అనుకున్నప్పుడు మూలతత్వం చక్కగా అవగాహన అవుతుంది. ఈ సర్వవ్యాప్తమైన పరబ్రహ్మంలో లయమై, అవ్యక్తమై ఉన్న భాగం శాశ్వతమయినది. అదే కాలానుగుణంగా బ్రహ్మగా భాసించి సృష్టికి మూలం అవుతుంది.

'బ్రహ్మ' అంటే స్త్రీ పురుష సమన్వయ సృజనాత్మక శక్తి. ఈ సృజనాత్మక శక్తి కాలానుగుణంగా విశ్వంగా రూపొంది, మళ్ళీ అంతరిస్తూ వుంటుంది.

'నారాయణుడు' అనంతమైన ఆకాశం మీద తేలుతూ వుంటాడు. ఈయన వ్యక్తం అయినప్పుడు ఈ విశ్వానికి మూలపురుషుడు (Logos) అవుతాడు. ఆయనే ఈఆకాశం, ఆకాశంలా అనిపించే జలరాశి అయిపోతాడు.

అద్వైతులను నిరీశ్వరవాదులు అనే వాళ్ళందరూ 'మనువు' చెప్పిన విషయాన్ని గూడా గమనించాలి. మనువు లెక్కలప్రకారం బ్రహ్మ నూరు సంవత్సరాల దేవమానకాలం గడిచినతర్వాత 'లయం' అయిపోతాడు; అంతరిస్తాడు. ఈ వంద సంవత్సరాలకాలం మానవ మానంలో మార్చుకుంటే పదిహేను అంకెల సంఖ్య అయిపోతుంది. అయితే ఈ 'లయం' 'అంతర్ధానం కావడం' తాత్కాలికమైనది, పునరవతరణకు దోహదం చేసేది— అన్న విషయం గమనించాలి. తాత్త్వికులు చెప్పే వర్ణనలు యిక్కడ మనకు ఆసరా అవుతాయి.

రహస్యవాదులైన ఆత్మజ్ఞానపరులు (Occultists) అద్వైతవేదాంతులు చెప్పే సూత్రాలతో ఏకీభవిస్తారు. సృష్టికి సంబంధించినంతవరకు వారు ఇలా చెబుతారు :

'పరబ్రహ్మ అనేది ముందు సృష్టించడం, లేక ఈ ప్రపంచం నుండే బ్రహ్మాండంలో ప్రవేశించి దానిని బ్రహ్మగా మార్చి తద్వారా అభివృద్ధిపొంది,



దేవుళ్ళను వ్యక్త ప్రపంచాలను సృష్టించడం- అనేది తత్త్వసిద్ధాంతాల దృష్ట్యా ఆమోదయోగ్యం అయినవిషయంకాదు. శాశ్వతమయిన పరబ్రహ్మ, పరబ్రహ్మకు మానసిక స్థూల ప్రతిబింబం, అంశ అయిన అనంత ఆకాశంలో ఎలా ఇమిడిపోతుంది? ఇది ఒక కర్త, కర్మ, అనుభూతులకు అందేది కాదు గదా?

శాశ్వతమయిన సంపూర్ణత్వాన్ని ఊహించినట్లయితే, దానిలోవున్న 'సర్వ వ్యాపక ఏకత్వం', అది శాశ్వతంలో వుండి- వ్యక్తము అవ్యక్తము అవుతూ కాలానుగుణంగా అనేక గోళాలలో, రూపాలలో వస్తూ- ఆఏకత్వాన్ని విచ్ఛిన్నం చేస్తుంది. ఆకాశం అనేది 'పరిమితులులేని శూన్యం' కాదు; అలాగే 'పరిమితులకు లోనయిన పూర్ణత్వమూ' కాదు. ఈ రెండూకూడాను. శుద్ధ తత్త్వ స్థాయిలో ఎప్పటికీ గుర్తు చిక్కని రూపం. ఇది మనస్సుకు 'శూన్యం'గానే గోచరం అవుతుంది. మళ్ళీ సృష్టి స్థాయిలో- వ్యక్తము, అవ్యక్తము అయిన అన్ని రూపాలకు ఇదే 'నిలయం'గా కనిపిస్తుంది. రూపుకడుతుంది. అందుచేత ఇది (Absolute-All) పరబ్రహ్మ-పరాత్పరం. హిందూ సంప్రదాయంలో బ్రహ్మ, విష్ణు అనే రెండుపేర్లు ఈఆంతరిక సత్యాన్ని సూచిస్తాయి. బ్రహ్మ అంటే 'బృహత్' ధాతువునుండి వచ్చినమాట, ఎప్పుడూ ఎదుగుతూ, పెరుగుతూ వుండేది. విష్ణు అంటే 'విస్' అనే ధాతువు నుండి వచ్చినమాట. ఎప్పుడూ అన్నిచోట్లా వ్యాపించేది. ఎప్పుడూ ఎదుగుతూ సర్వవ్యాపకంగా వుండే శక్తి బ్రహ్మ- విష్ణుతత్త్వం. అనంత ఆకాశానికి, దాని పెరుగుదలకు ఇదే ప్రతీక. రకరకాలదేవుళ్ళ (సృష్టికి అనుగుణంగా వర్తించే వివేకతత్త్వాలు) ఋషులు, మనువులు, విశ్వంలోని అన్ని అంశాలు- రూపాలు ఈ తత్త్వం యొక్క 'విభూతు'లు. అంటే దీనిలోంచి వచ్చినవే. అనంత ఆకాశానికి ఇంకొక పేరు వుంది. 'ఏడు పొరల శాశ్వత మాతృ-పితృ రూపం' అని. అవ్యక్తం అయిన స్థాయినుంచి వ్యక్తస్థాయికి రూపాంతరం పొందడంలో ఏడు అంతస్థులు వున్నాయి సుమా అని ఇది సూచిస్తుంది.

ఈ విశ్వం వున్నా లేకపోయినా, సృష్టి స్థితిలోనూ- లయస్థితిలోనూ- ఎప్పటికీ ఉండేది, ఉన్నది, ఉండినది.... యేమిటి?- అని ఒక రహస్యవివరణ గ్రంథంలోని ప్రశ్న.

దానికి సమాధానం 'ఆకాశము' (Space).

ఇదే విషయాన్ని మామూలు మాటలలో చెప్పుకోవాలంటే, యిలా అనుకోవచ్చు :

విశ్వాలన్నీ బ్రహ్మలోవున్నాయి. బ్రహ్మనుండే ఉత్పన్నం అవుతున్నాయి. తిరిగి బ్రహ్మలోనికే చేరుతున్నాయి.

అవ్యక్తమైన స్థితిలో వున్నప్పుడు : 'బ్రహ్మ'- ఇది అన్నిటినీ తనలో ఇముడ్చుకోగల గొప్ప శక్తి.

వ్యక్తస్థితిలో వున్నప్పుడు స్త్రీ పురుష సంయోగజనితమైన ప్రపంచం.

మహర్షులకు, దీక్షితులకు (Initiates) భగవంతుడు అంటే అవ్యక్త మయిన స్వరూపము; వ్యక్తమైన ప్రకృతీని;

ప్రకృతి అంటే పురుష- ప్రకృతి రూపం అయిన సప్తావరణస్థితి. అవ్యక్త మైన స్థాయినుంచి వ్యక్తస్థాయికి చేరుకోవటానికి ఏడు అవస్థలు గడుస్తాయి.

'భగవంతుడు' అనే భావన ఆధ్యాత్మవిద్య అభ్యసిస్తున్న వాళ్ళకు స్థిరమైన ధోరణిలో వుండాలి. లేకపోతే నిజం కానిది నిజమని, పరిమితి అయినది అపరిమితమనీ భ్రమపడడం జరుగుతుంది.

సృష్టిలో వున్న 'భగవత్ శక్తి'ని లేదని ఎవరూ అనుకోవడం లేదు. అయితే మనిషి తన'మూర్ఖత్వంతో నిర్మించిన భగవంతుడు'లేడు అంటున్నారు. భగవంతుడు అనే పదానికి రూపకల్పన చేసి, దానిని సాధనకు ఉపయోగించు కోవచ్చునేమో గాని అదే అనంతము, శాశ్వతము అయినదీ అనుకోవటానికి కుదరదు.

మనుష్యులు తమ 'అహంకారం' వల్లనైతేనేమి, 'అతిశయం' వల్లనైతే నేమి తమ చేతులతోనే, చేతలతోనే మనస్సులోని రూపాలను సృష్టించగలదో అన్నిటినీ సృష్టించారు. మనకు అందుతూ వున్న 'ప్రలోభాలు' ఈ పరిమితి రూపాల నుంచి వస్తాయిగాని, అవ్యక్తమైన ఆ ఏకైక శక్తినుంచి మటుకుకాదు.

ఆధ్యాత్మవాదుల అభిప్రాయం ప్రకారం, మనకు వచ్చే సందేహాలన్నీ వ్యక్తరూపాలనుండే తప్ప, అవ్యక్తమైన ONE LIFE నుండి కాదు. మహ పురుషులుగా పేరుపొందినవారు, ధ్యానబుద్ధులు, ధ్యాన చోహన్‌లు, ఋషి ప్రజాపతులు, దేవకుమారులు, సౌరకుటుంబ అధిపతులు, దేశదేశాలలో అనేక పేర్లతో పిలువబడే దేవుళ్ళు.... యివన్నీ ఆ వ్యక్తరూపాలు. వారినే మానవుడు 'భగవంతుడు' అనుకుంటున్నాడు.



'ఆత్మజ్ఞానపరులు 'ఆదిశక్తి'ని తాత్త్వికంగా 'మాయరూపి'గామనుష్యుల దృష్టిని ఆవరించే 'మాయ'గా భావిస్తారు. ఈ ఆదిశక్తి మూలప్రకృతి నుంచి ఉద్భవిస్తుంది. 'తత్' మూలరూపం యిదే. బ్రహ్మస్వరూపానికి త్రీమూర్తి యిది. ఇది ఒక మహా మన్వంతరం వరకు అవిచ్ఛిన్నంగా వుండగలుగుతుంది. మూలప్రకృతినుంచి ఆవిర్భవించే 'ఆకాశతత్వం' సృష్టికి సహాయకారి అవు తుంది. ఈ విధంగా 'విశ్వాత్మ భావం' ప్రకృతికి మూలకందంగా వుండి, ఆధునిక విజ్ఞాన పరిధులకు అతీతంగానే వుండిపోతుంది.

ప్రపంచంలోని అనేక మతాలకు అంతరంగికంగా మూలం ఒక్కటే. కాకపోతే బాహికంగా పురాతనమైన మతాలు భారతదేశం మజ్‌దియా, ఈజిప్టు దేశాలలో వ్యాప్తిలో ప్రచారంలో వున్నాయి. వీటినుంచి 'చాల్డియన్' మతం ఆవిర్భవించింది. అయితే అది యిప్పుడు యెక్కడా కానరాదు. ఇలా అనేక మతాల పేర్లు జాబితాగా ఇస్తూపోతే చివరకు యూదుల మతంవస్తుంది. కేవలం 'మార్మికత' సంతరించుకున్నందువల్ల ఈ మతాలన్నీ ఇప్పుడు కట్టుకథలుగానే కనిపిస్తాయి. విజ్ఞాన శాస్త్రానికి, తర్కానికి అందని తీరులో వుంటాయి. వీటన్నింటినీ సమరసంగా వివరించటానికి ఈ'రహస్యగ్రంథం'లో ప్రయత్నం జరిగింది.

'రహస్య ప్రశ్నావళి' (Occult catechism) లో ఈ క్రింది ప్రశ్నలు. జవాబులు అగుపిస్తాయి :

"సర్వకాల సర్వావస్తలలోను ఉన్నది యేమిటి?
—ఆకాశం. శాశ్వతమైన అనుపాదక స్థితి.
ఎప్పుడూ ఉండినది ఏమిటి?
—మూలంలోని బీజం.

ఎప్పుడూ వస్తూపోతూ ఉండేది ఏమిటి?
—మహా నిశ్వాసం (Great Breath)
శాశ్వతమైన మూడు ఏమిటి?
—మూడు కాదు. అది ఒక్కటే. అది ఆకాశం."

ఆ ఉన్న ఒక్కటి అవిచ్ఛిన్నమైన వలయం దానికి పరిధిలేదు. అది ఎక్కడా లేదు. ఎక్కడా లేకుండాలేదు. హద్దులు, ఎల్లలు లేని వలయం. ఆ వలయాన్ని ఆవరిస్తున్న ఆకాశం (సమతలం).

మన్వంతర కాలంలో ఈ వలయానికి వ్యాసం (అడ్డుగీత) ఏర్పడు తుంది. అవిభాజ్యమైన బిందువు. మన్వంతర కాలంలో ప్రతిచోట తానుగా వ్యాప్తం అవుతుంది. నిలువుగీత, అడ్డుగీత అదే. తల్లి, తండ్రి, ఉపరితలం, కింద ఆధారతలం అన్నీ అదే. వలయంలో వున్న చిన్నచిన్న వలయాలు కూడా అదే. చీకటిలోని వెలుతురు, వెలుతురులోని చీకటి, శాశ్వతమైన నిశ్వాసము- అన్నీ అదే. అంతరంగంలో నుంచి చొచ్చుకుంటూ ఇవతలకు వస్తుంది; అంతటా వ్యాపిస్తుంది; చరిస్తుంది; మళ్ళీ అంతర్థానం అయి పోతుంది. సంకోచవ్యాకోచాలు దాని లక్షణాలు. అది వ్యాకోచం చెందిన నప్పుడు 'తల్లి' బహుధా వ్యాపిస్తుంది. సంకోచం చెందినప్పుడు కడుపులో ఇముడ్చుకుంటుంది. సృష్టి, లయము, మన్వంతరం, ప్రళయం- ఈ రకంగా జరుగుతాయి. బీజం కనిపించదు, మహత్తరమైనది. మూలం శీతలమైనది. సృష్టిలోను, మన్వంతరంలోను దాని పొరలు దేదీప్యమానంగా ప్రకాశిస్తాయి. తండ్రి వెచ్చదనాన్ని ప్రసాదిస్తాడు. సంధ్యాసమయంలో ఎన్నో మార్పులు, చేర్పులు జరుగుతాయి.

మరో విషయం కూడా గమనించాలి.

అధ్యాత్మశాస్త్రం ప్రకారం :

విశ్వరూపమైన మూలభూత తత్త్వాలు (Cosmic Elements) మొత్తం ఏడు. వీటిలో నాలుగు పూర్తిగా భౌతికమయినవి. అయిదవది ఈథర్, సగం భౌతికం. ఇది నాలుగవ పరిణామప్రక్రియలో రూపాంతరంపొంది వాయువులో కలుస్తుంది. అయిదవ పరిణామ ప్రక్రియలో ఇదే అన్నిటికీ ప్రధానమయినదిగా భాసిస్తుంది. తతిమ్మా రెండూ మూలభూత శక్తులు. ప్రస్తుత మానవమేధస్సుకు అవగాహన అయ్యేవి కాదు. ఆరవ, ఏడవ పరిణామ ప్రక్రియలలో క్రమంగా తెలివిడి అవుతాయి. ఈ ఏడూ ఒకేఒక మూలభూత ద్రవ్యం నుంచి రూపాంతరం పొందినవి. పరిమిత పరావర్తనాలు, ఈథర్, ఆకాశము అనిపిలవటానికి కూడా కుదరదు వీటిని. ఎందుచేతనంటే వాటికి కూడా ఇదే 'మూలం' గనుక.

* * *

'బ్రహ్మాండ రచన మొత్తం ఏడు అధ్యాయాల గ్రంథం. సృష్ట్యాది నుంచి ఇప్పటివరకు జరిగిన పని ఏడు అధ్యాయాలలో ఇముడుతుంది. ఏడవ అధ్యాయం రచన ఇంతవరకు జరగలేదు.'— అన్నారు తల్లాప్రగడ సుబ్బారావు



గారు. అన్ని విషయాలను సాంకేతికంగా అర్థం చేసుకోవాలి. యుగయుగాలలో, కల్పాల అనంతరం కల్పాలలో ఒకేవిధంగా ప్రవర్తిల్లే 'ధర్మవైభవం' మొదటి జాతి పురుషుల హృదయాలపైన ముద్రితం అవుతుంది. విశ్వమనస్సు మహత్ (Mahat)కు ప్రతినిధులుగా వున్న మహాపురుషులు చేసిన పని ఇది. దీనిని గ్రహించి, గమనించి, అర్థం చేసుకోవడం కష్టమయిన పని. ప్రయత్నం మటుకు తప్పనిసరి.

ఈ రచన కార్యక్రమ పూర్తి వృత్తాంతం ఏ దేశ మత గ్రంథాలలోనూ 'యథాతథం'గా విపులంగా దొరకదు. ఆఖరుకు హిందూ సంప్రదాయానికి చెందిన షడ్దర్శనాలలోనూ (సాంఖ్య, యోగ, న్యాయ, మీమాంస, వైశేషిక వేదాంతశాస్త్రాలు) ఈ పూర్తి చిత్రం లభ్యం కాదు. ఈ దర్శనాలన్నింటికీ సమగ్రమయిన స్వరూపం ఏడవ గ్రంథంలో మటుకే దొరుకుతుంది. అదే 'రహస్యగ్రంథం'- గుప్త సిద్ధాంత దర్శనం. వేదాంత గ్రంథాలలో సృష్టికి సంబంధించిన 'మెటాఫిజికల్' ప్రస్తావన మటుకే ఉన్నది. ఉపనిషత్తులకు ఇప్పుడు సరికొత్త తాళపుచెవి అవసరం. 'రహస్యము', ఆత్మగతము ఐన జ్ఞానం ద్వారా అజ్ఞానాన్ని గడిచి గట్టెక్కడము' అని అర్థం ఉపనిషత్తులు అనే మాటకు- ఇదొక అర్థం. ఉపనిషత్తులలో అనేక రహస్యాలు ఉన్నాయి. ఇవి శృతులలో భాగం. శృతులు, స్మృతులు, వేదాలలో మూడవ భాగం అయిన బ్రాహ్మణములకు అనుబంధ విషయాలు ఇవి.

ఓరియంటలిస్టులు 150 ఉపనిషత్తులు వున్నాయంటారు. దాదాపు మూడువేల సంవత్సరాలక్రితం వీటి కూర్పు జరిగిందంటారు. నిజానికి ఇందులో అయిదో వంతు మేరకయినా ఉపనిషత్ గ్రంథాలు ఇప్పుడు లభ్యం కావడం లేదు.

యూదులు బైబిల్‌కు 'కబలా' సిద్ధాంతం ఎటువంటిదో వేదాలు ఉపనిషత్తులకు అలాంటివి. వేదాలలోని రహస్యాలను- గుప్తము గుహ్యము అయిన వాటిని ఉపనిషత్తులు వివరిస్తాయి. బ్రహ్మాండ రచన ఎలా జరిగిందీ భగవత్ తత్త్వము యేమిటి, ఆత్మయొక్క వివిధ అవతరణలు, మనసు- ద్రవ్యము ఈ రెంటి పరస్పరాశ్రయము.... యిలాంటి విషయాలు యెన్నో ప్రస్తావన అవుతాయి. ఒక్కముక్కలో చెప్పాలంటే మానవ విజ్ఞానికి తుదీ మొదలు అదే. బుద్ధుని కాలం నుంచి ఆ వివరణలు ఇవ్వడం మానివేశారు.

అవి పురాతన కాలానికి సంబంధించినవి. వాటి 'అసలు' స్వరూపం ఇప్పుడు లభ్యం కాదు. సగం మటుకు తిరగవ్రాస్తే వ్రాశారేమో, సంక్షిప్త పరచడం మటుకు విధాయకంగా జరిగింది.

వేదాలు ముందు దేవాలయ పురోహితుల అధీనంలో వుండేవి. కాలానుగుణంగా యివి ఇతరుల చేతులలో పడిపోతున్నవన్న భయంతో వీటిని తిరగవ్రాయడం, దుర్భరప్రయోగాలు (Blinds)చేయడం, దాచివేయడం మొదలైన ప్రక్రియలు తటస్థించాయి. అసలు రహస్యాలు 'దీక్షితులు' (Initiates) అయిన వారివద్ద ప్రక్షిప్తంగా వుండిపోయినాయి. ఆదిశంకరులు ఉపనిషత్తులకు వ్యాఖ్యానాలు వ్రాశారు. ఈ 'భాష్యాలు' ఇప్పుడు యథాతథంగా వున్నాయనుకోవటానికి వీలులేదు; మూల విషయాలు యే కొద్దిమందికో ఉన్నది వున్నట్లుగా గోచరం అవుతాయి. ఈ కొద్దిమంది బహు కొద్దిమంది అవుతారు. కాలానుగుణంగా భాష్యాలు వక్రస్థితులు పొందుతాయి.

సృష్టికి సంబంధించిన యే విషయాన్ని యెవరు వెలికి తీసినా బయటపెట్టే ప్రయత్నం చేసినా, జనసందోహం నుంచి అభ్యంతర వాక్యాలువస్తాయి. తిరస్కారాలు యెదుర్కోవలసి వస్తుంది.

ఈ ప్రసక్తులన్నీ యదార్థమైనవనీ, కల్పన అనేది లేశ మాత్రమైనా లేదనీ చెప్పగలగడం సాహసం అవుతుంది. యథార్థాలు వున్నాయి, నిజమే. వాటిని తిరస్కరించడం అసాధ్యం. విషయాలు అగ్రాహ్యం అయినవి గనుక వాటిని వివరించేటప్పుడు 'భాష తాలూకు అల్పత్వం' కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. వివరణలన్నీ స్పష్టంగా యే మాత్రము సంధిగ్ధం లేకుండా చెప్పగలగడం అసాధ్యం.

రహస్య గ్రంథంలో ప్రతిపాదితమయిన విషయాలు యుగయుగాలుగా, కల్పాలుగా మానవజాతి సంతరించుకుని భద్రపరుచుకొన్నటువంటివి. పురాణాలలో సాంకేతికంగా- మార్మికంగా- చెప్పిన బ్రహ్మాండ రచనను గురించి ఇక్కడ ఎన్నో మహత్తర వివరాలు ఇవ్వవలసి వుంది.

సర్వదేశ దశాకాలాలలోను దీక్షితులకు, మహోన్నత పురుషులకు పుట్టుకే లభ్యం అవుతూ వుండిన అంతరిక విషయాలను సామాన్యజనానికి అంగీకారయోగ్యం అయేట్లుగా చెప్పడమే ఇప్పుడు ఈ గ్రంథం ద్వారా జరిగిన పని.



ప్రకృతిలో అనేక శాఖలు ఉన్నాయి. ఒక్కొక్క దానిలోనూ సర్వదేశ దశాకాలలలోను ఎందరో దీక్షితులు, ఆసక్తి కలవారు అనేక విషయాలను కనుగొన్నారు. ఒకరు కనుగొన్న విషయాన్ని యితరులు కూడా పరిపోల్చి చూచుకుంటున్నారా లేదా అనిగూడా గమనించారు. బాహ్యము, మానసికము, ఆత్మికము అయిన అంతస్తులలో ఒకరికి తోచిన సంగతి మరి యితరులు కూడా పరీక్షించి నిగ్గు తేల్చుకుని 'నిజం' అని ఆమోదించడం అనేది ఈ సూత్రం. దీనిని అనుసరించి, ప్రకృతి సత్యాలు అనేకులచేత పరీక్షకు లోనైనాయి. పరిశీలించబడి ప్రచారంలోనికి వచ్చాయి. అన్నిటికీ కారణం అయిన 'సమగ్ర జన్య పదార్థ తత్వం' (Absolute Divine Substance) ఒకటి ఉన్నది సుమా- అనేది ఇటువంటి సూత్రాలలో ఒకటి. పదార్థ తత్వం అంతర్గతంగా వుంటుంది. అగోచరంగావుంటుంది. ఒకదానినుంచి మరొకకారణానికి, దాన్ని వెతుక్కుంటూ వెడుతూవుంటే ఆ తత్వం మనసుకు హొడగడుతుంది. దీనికి ఆది, అంతులేవు. సామూహికమైనది. కనిపించనిది, కనిపించేది కూడ ఇదే. అంతటా విస్తరించివున్న సత్యం. వ్యక్తిగా రూపుకట్టుకున్నదికాదు, అన్నిటినీ-అందరినీ తనలోఇముడ్చుకున్నది. అవ్యక్తమైన స్థితే (రూపుకట్టుకోకపోవడమే) ఈ తత్వం యొక్క ప్రధాన మూలభూత విశేషం. ఇది విశ్వంలోని ప్రతి అణువులోను ప్రక్షిప్తమై ఉంది. విశ్వమంతా ఇదే.

రహస్య గ్రంథం మొదటి భాగం Cosmogenesis. ఇది బ్రహ్మాండ రచనకు వర్ణన. రెండవభాగం Anthropogenesis. ఇది మానవ నిర్మాణానికి పరిణామ ప్రగతులకు వర్ణన.

మొదటి భాగం 7 ఖండికలకు (Stanzas) వ్యాఖ్యానం అయితే రెండవది 12 ఖండికలకు భాష్యం.

మన నిజస్వరూపం యేమిటి ?

ప్రవృత్తి నివృత్తులు ఎలా ఏర్పడినాయి?

జీవితాన్ని తిరస్కరించి తుష్ణీ భావంతో దూకడం సమంజసమా ? లేక జీవిత గమనాన్ని అర్థం చేసుకుని అవకాశాలను విస్తరింపచేసుకుంటూ బీజవతుగా వున్న సామర్థ్యాలను పరిపూర్ణంగా వికసించేట్లు చేయడం మరింత సమంజసమా ?

బ్రహ్మాండ రచనతోపాటు, మనిషి తననుగురించి తాను తెలుసుకోవడం అవసరం. రహస్య గ్రంథం ఈ సౌకర్యాన్ని కూడా కలుగజేస్తుంది. మనిషి లోను, సకల జగత్తులోను ఓ నూతన తేజం- చైతన్యం. ఉద్భవింపచేయడం, పరిణామ ప్రక్రియలో ప్రధానమైన అంశం- అని రహస్య గ్రంథం, దానికి అలవాలమైన సనాతన సంప్రదాయం స్పష్టపరుస్తోంది.

మానవ పరిణామ ప్రక్రియలోని 'భౌతికత' మూలకందమైన విషయం, గతంలోని మనుష్యులు, వారి అలవాట్లు, ఆలోచనలు ఇవన్నీ మనలోనూ విడదీయరాని భాగంగా వున్నాయి. అంతేకాదు. భవిష్యత్తులో ప్రభవించే పూర్ణస్వరూపం తాలూకు ఛాయలు కూడా ఇప్పుడు మనలో ఉన్నాయి.

మనం భగవత్ స్వరూపులం.

ముందు కాలాలలో భగవంతుళ్ళం మనమే.

ఆ భగవదంశ ఇప్పుడు మనలో ఉన్నది.

ఆ అంశంతోపాటు కొంత రాక్షసత్వం, కర్కశత్వం కూడా వున్నాయి, అసుర లక్షణాలు- మానవ, దైవలక్షణాలు మనలో ఇప్పుడు వున్నాయి. భగవంతుడు మనిషిగా రూపుకట్టుకున్న సందర్భాలు అన్ని దేశాల చరిత్రల మత సంప్రదాయాలలో విస్తారంగానే వున్నాయి. అలాగే మనిషి భగవంతుడు అవుతాడు సుమా- అనే సూచనలు కూడా వున్నాయి.

రహస్య గ్రంథం ప్రతిపాదించే విషయం ఏమిటంటే- విశ్వనిర్మాణంలో ఉపయోగించిన అణువులు (ఎలిమెంట్స్)- తన్మాత్రలు-మనిషి నిర్మాణంలోనూ విధాయకంగానే వున్నాయి. ఆధునిక శాస్త్రవిజ్ఞానం ఇంకా ఈ విషయాన్ని పరిశీలించి తెలుసుకోవలసి వుండగా, మానసిక తత్త్వశాస్త్రం కొంతలోకొంత గ్రహించగలిగింది. మానవులలో ప్రతిదీ- విశ్వంలోవున్న ప్రతి చిన్నఅంశము ప్రక్షిప్తంగా వున్నది. మనిషే సృష్టి అంతటికీ 'ప్రమాణం', కొలమానం (Measure of Things).

మనలో వెనుకటి పరిణామ చరిత్ర తాలూకు చిహ్నాలు, శేషాలు కూడా వున్నాయి. అంటే భూతభవిష్యత్తులకు నిలయం అన్నమాట మనం. ఈ మాట రూపాలకేగాదు, వైఖరులకు- విధానాలకు లక్షణ లక్ష్యాలకు వర్తిస్తుంది.

మనిషి నమూనా ఏమిటి?

'స్వర్గధామంలోని మూర్తిమంతస్థితి' (Heavenly man) అంటుంది రహస్యగ్రంథం.



పరిపూర్ణంగా భగవత్ స్వరూపాన్ని వికసనం పొందటానికి అత్యున్నత స్థాయికి చెందిన దైవసంపన్నమూర్తులు సైతం మానవాకారాలు తాల్చాలి. మానవులు అంటే ఈ లోకంలో మనకు తెలిసిన మనుష్యుల రూపురేఖావిలాసాలకు మటుకే పరిమితమయిన జీవులు కాదు. ఇతర గోళాలలో మానవులు ఎలా వుంటారో మనకు ఇప్పుడే తెలియదు. ద్రవ్యాన్ని- శక్తి, సంపన్నతను (Matter and Spirit) సమపాళ్ళలో రంగరించుకున్న జీవులు నాలుగవ మూలజాతి మధ్యకాలంలో తయారయినారు. వీరు 'స్వయం వ్యక్తత' ద్వారా దైవసంపదను పరిపూర్ణంగా ఆవిర్భవించుకోగలరు.' అని మేడం బ్లావట్‌స్కీ స్పష్టపరిచారు.

సృష్టిలోని అనేక రహస్యాలను యథాతథంగా అందుకుందుకు, అర్థం చేసుకుందుకు ఈ తరంలోని మేధస్సు ఇంకా తగినంతగా ఎదగలేదు- అన్న అభిప్రాయం ఆమె అనేకమార్లు గుర్తుచేస్తారు.

అలాంటి సునిశితమైన మేధస్సు- మనస్సు- ఎలా వుంటుంది ? దాని స్వరూప స్వభావాలు యేమిటి ? సత్యసందర్శనానికి, జ్ఞానసాక్షాత్కారానికి అనువయిన మనసు ఎలాంటిది?

అటువంటి 'మనసు' తయారవటానికి అవసరమయిన శిక్షణ కూడా 'రహస్య గ్రంథం'లో వున్నది. ప్రస్తుత ప్రపంచ తీరులలో రీతులలో వున్న ఆలోచనా ధోరణి, వైఖరి ఎటు ప్రయాణం చేస్తోంది? ఈ ప్రయాణం ఏదైనా పద్ధతిలో నడుస్తున్నదా?- ఈ రకమయిన ప్రశ్నలు ఇందులో వివరంగా చర్చించారు.

శ్లోకాలలో అనేక విషయాలు సాంకేతికంగా చెప్పడం జరిగింది. వీటి మార్మికత గురించి ఆలోచించారు. భౌతిక స్థాయికి చెందిన మెదడు అర్థం చేసుకోగల సంగతులకంటె ఎంతో మిన్న అయిన విషయాలు ఈ శ్లోక పాదాలలో వున్నాయి. మనిషిలోని అంతశ్శక్తులకు, సామర్థ్యాలకు మాత్రమే అర్థం అవుతాయి అవి. అంతఃస్ఫూర్తికి మటుకే అందుతాయి— కొన్ని సంగతులు.

'మనిషి' అంటే ఏడు ఆకుల సముదాయం (సప్తవర్ణ)

'విశ్వాన్ని అంతటినీ ఆలింగనం చేసుకోగల మనస్సు' అంటారు మేడం బ్లావట్‌స్కీ ఈ పరిపూర్ణతను. మన ఆలోచన క్షేత్రాలకు అందినా, అందక పోయినా 'చైతన్యం' మూడు రకాలుగా మనకు సూచితమవుతుంది.

1. భావనా ప్రపంచం
2. ఆదర్శప్రాయమైన క్షేత్రం
3. అకళంకమయిన దైవీ-ఆధ్యాత్మ క్షేత్రం.

మనస్సు ఒక సరికొత్త ఆలోచనా ప్రక్రియను మళ్ళించటానికి దాని నుంచి పాకుకుంటూ వెళ్ళి అంతఃస్ఫూర్తి (Intuition) పొందటానికి_ ఈ గ్రంథం ఉపకరిస్తుంది. దీని లక్ష్యం అదే.

మనలోని చైతన్య క్షేత్రం సరికొత్త రూపు కట్టుకోవాలి. ప్రస్తుతం మనం చిక్కుకుపోయివున్న వస్తుప్రధానమయిన ప్రమాణాలనుంచి గుణప్రధానమయిన తీరాలకు చేరుకుంటాము. గుణాలనుంచి రూపలావణ్యాలకు ఆతర్వాత 'అ-రూపస్థితి'కి ఎదుగుతాము. నిజానికి ఇది ఎదగడం కాదు. ఇప్పుడు వున్న సంకుచిత-ముడుచుకుపోయిన స్థితి-విడివడుతుంది. సంకుచితస్థాయి సువిశాలం అవుతుంది. 'సర్వమూ తానే' అన్న గుర్తు, గమనం దొరుకుతుంది. సృష్టి అంటే అనేక వస్తువుల, విషయాల సముదాయం కాదు. అన్నీ ఒక్కటే. అంతటా ఆవరించివున్న ఒకే ఒక వస్తువు మనకు భాగాలుగా, ఖండాలుగా కనిపిస్తోంది. కొన్ని భాగాలు కనిపించడంలేదు. కనిపించని భాగాలు, ఖాళీలు భాసిస్తూ కనిపిస్తున్న వస్తువులను వేరువేరుగా రూపొందినట్లు అనిపించేటట్లు చేస్తున్నాయి.

Existence is one thing- ఉన్నదంతా ఒక్కటే సుమా ! అన్న విషయం మనం ఆలోచించి గమనించటానికి, కృతార్థులం అవటానికి ప్రయత్నం చేయవచ్చు.

అంధ విశ్వాసాలు, దురభిప్రాయాలు, మోసపరిచే అజ్ఞానం అనే విష వృక్షాలను తెగనరికి, మానవ మేధస్సును ఈ కొత్త ప్రాంగణం వైపు దృష్టి సారించేందుకు 'రహస్య గ్రంథం'లో ప్రయత్నం చేశాను_ అంటారు ఆమె. యుగాల తరబడి మనుషుల మనస్సులలో పేరుకుపోయిన కాలుష్యం అంతా దులుపుకుంటేగాని ఆంతరికవిషయాలను తెలుసుకునే సామర్థ్యంఅంకురించదు. మనుష్యులను ఇందుకు తయారుచేయడమే నేను చేస్తున్న పని- అని ఆమె పదేపదే గుర్తుచేస్తారు. సవినయంగానూ, సాక్ష్యాధారాలతోను. అందుచేతనే ఈ రహస్యగ్రంథం కేవలం ఈ శతాబ్దానికే గాక, రానున్న శతాబ్దాలకూ కరదీపిక, జ్ఞానప్రబోధ శాస్త్రం అవుతోంది.

❋

# దివ్యజ్ఞానానికి తాళపు చెవి
# (THE KEY TO THEOSOPHY)

దివ్యజ్ఞాన సమాజం ప్రారంభమయిన రోజులలో దానిని గురించి, దాని తత్త్వదర్శనాన్ని- చరిత్రను- ఉద్దేశ్యాలను వివరంగా తెలిపే పుస్తకాలు లేవు. వ్యవస్థాపకులు ఇచ్చే ఉపన్యాసాలు, ప్రసంగాలు మటుకే ఆధారం.

అనేకులు వివరాలుకోరుతూ ఉత్తరాలు వ్రాసేవారు. మేడం బ్లావట్స్కీ స్వయంగా తానే అన్నిటికీ బదులు వ్రాస్తూ వుండేవారు. కల్నల్ ఆల్కాట్ ఒక్కరే ఆమెకు సహాయకారి. తరువాత తరువాత చాలమంది 'సహాయకులు' పోగయినారు.

వ్యక్తిగతంగా ఉత్తరాలు వ్రాయడం చాలదు గనుక ఆమె ఆనాటి పత్రికలలో సుదీర్ఘమయిన వ్యాసాలు వ్రాసేవారు.

'అభిప్రాయాల' ప్రచారం కోసరమే ఆమె బొంబాయి వచ్చిన తర్వాత 'ది థియాసఫిస్ట్' అనే పత్రికను ప్రారంభించారు.

లేఖకులు వ్రాసిన ఉత్తరాలు, సమాధానాలు అందులో ప్రచురణ అవుతూ వుండేవి.

ఈ అనుభవం పధ్నాలుగు సంవత్సరాలు గడిచిన తరువాత ఆమె ప్రశ్నోత్తరమాలిక రూపంలో The Key to Theosophy అనే పుస్తకాన్ని 1889లో ప్రచురించారు.

'దివ్యజ్ఞానం అంతటినీ తెలిపే సమగ్రమయిన పుస్తకం కాదు ఇది; ప్రగాఢ అధ్యయానికి తలుపుతెరిచే తాళం చెవి మటుకే' అన్నారు ఈపుస్తకం ముందు మాటలో.

ఇంకా ఇలా అన్నారు;

'మానసికంగా సోమరులయిన వారికి, దివ్యజ్ఞానం ఎప్పటికీ కొరకరాని కొయ్యగానే వుంటుంది. మానసిక, ఆధ్యాత్మిక క్షేత్రాలలో స్వప్రయత్నం వల్లనే ఎవరయినా ఉత్తీర్ణులు కాగలుగుతారు. రచయిత చదువరుల తరఫున

అన్ని ఆలోచనలు చేయలేడు ఎందరో పంపిన ప్రశ్నలు నాకు పుస్తక రూపంలో తయారుచేయటానికి దోహదం చేసినాయి.'

ఈ పుస్తకంలో పద్నాలుగు ప్రకరణాలు వున్నాయి.

1. దివ్యజ్ఞానము- దివ్యజ్ఞాన సమాజము- పదాల అర్థవివరణ.
2. బహిరంగ అంతరిక దివ్యజ్ఞానం
3. దివ్యజ్ఞాన సమాజం పనిచేసే తీరు
4. సమాజానికి దివ్యజ్ఞానానికి ఉన్న సంబంధం
5. దివ్యజ్ఞాన మూలసూత్రాలు
6. ప్రకృతి-మానవుడు; దివ్యజ్ఞాన వివరణ
7. మరణానంతర స్థితుల వివరణ
8. పునర్జన్మ గురించి
9. కామలోకం, స్వర్గం
10. మనస్సు- దానివైచిత్రి, విధానం
11. పునర్జన్మలోని మార్మిక వివరాలు
12. అనుభవ దివ్యజ్ఞానం అంటే ఏమిటి?
13. దివ్యజ్ఞాన సమాజాన్ని గురించిన అపోహలు
14. దివ్యజ్ఞాన "మహాత్ములు"

    ముగింపు వ్యాసం: సమాజ భవిష్యత్తు

ప్రశ్నోత్తర రూపంలో వుండడం వల్ల విషయ వివరణకు ఎక్కువ అవకాశం కలిగించిన పుస్తకం యిది.

పుస్తకంలో చివరి అభిప్రాయం ఇలా ఉంది.

'మానవ పరిస్థితిని, స్థితిగతులను మెరుగుపరచటానికి పూర్వం ఎన్నో సంస్థలు వచ్చాయి. వాటన్నిటికంటే ఇప్పటి మా ప్రయత్నము- దివ్యజ్ఞాన సమాజస్థాపన- విజయవంతం అవుతే, ఇది ఇరవైయవ శతాబ్దంలో కూడా సంఘటిత శక్తిగా వుండి తేజోవంతంగా పనిచేస్తుంది. ఈసమాజ ప్రతిపాదనల ఫలితంగా మానవ మేధస్సు, హృదయము మరింత వికసించి పవిత్రవంతం



అవుతాయి. దురూహలు అంధవిశ్వాసాలు కొంతవరకయినా తొలగిపోతాయి. సత్యాన్ని మరింత విస్పష్టం చేయగల భావినాయకునికి ప్రపంచం స్వాగతం పలుకుతుంది. అతడు తన అభిప్రాయాలను సూటిగా ప్రజల హృదయాలకు అందించగలుగుతాడు. అందుకు తగిన భాష, పదజాలం, ప్రక్రియ, సంస్థ మేం తయారుచేశామనుకుంటాను. అతని దారిలో ఎదురయ్యే ముళ్ళను, ప్రమాదాలను తొలగించాం.... దివ్యజ్ఞాన సమాజం తన ఉద్దేశ్యాలను, కార్యక్రమాలను చక్కగా నిర్వహించగలిగితే ఇరవైఒకటవ శతాబ్దం ఇప్పుడున్న పరిస్థితులతో పోల్చిచూస్తే, "స్వర్గతుల్యం"గా తయారవుతుంది. నా అంచనా ఎంతవరకు సమంజసమైనదో మీరే గమనించండి.

ఆంతరిక సత్యాల పరిపూర్ణ వివరాలతో తలలు బద్దలు కొట్టుకునే ఓపిక, తీరిక లేనివారికి ఈ పుస్తకం దివ్యజ్ఞాన సూత్రాలను తెలుసుకునేందుకు బహు తేలిక అయిన, సులభమైన అధ్యయన గ్రంథం.



# అంతర్వాణి
## (THE VOICE OF THE SILENCE)

దివ్యజ్ఞాన యోగ గ్రంథంగా ప్రచారంలోవున్న (The Voice of the Silence) అనే పుస్తకాన్ని మేడం బ్లావట్‌స్కీ 1889లో ప్రచురించారు.

ప్రాచ్యదేశాలలో గుప్తవిద్యను అభ్యసించేవారికి అధ్యయన గ్రంథాలు (Book of the golden Precepts) అనే పేరుతో ప్రక్షిప్తంగా వున్నాయని దానిని వారు తప్పనిసరిగా చదవాలని అమె చెబుతారు.

దీనిలోని బోధనలు దివ్యజ్ఞాన సమాజికులకు ఆమోదయోగ్యంగా ఉంటాయి గనుక ఈ పుస్తకం తయారుచేస్తున్నాను, అంటారు.

(Book of the Golden Precepts)లో దాదాపు తొంభై ఖండికలు వున్నాయని, దీనిలో తమకు ముప్పైతొమ్మిది వరకు కంఠతా వచ్చునని అమె చెబుతారు.

తమ సోదరికి వ్రాసిన ఒక ఉత్తరంలో 'ఈ పుస్తకాన్ని ఒక తెలుగు పుస్తకం నుంచి ఇంగ్లీషుకు అనువాదం చేసి వ్రాశాను,' అని గూడా అమె చెప్పారు.

పుస్తకం అంతా సూత్రప్రాయంగా, కవిత్వ రీతిలో సులభంగా చదువ కుందుకు వీలుగా వుంటుంది. దీని బోధనలు మనిషికి అంతరేంద్రియజ్ఞానం కలిగించడంతోపాటు, నిర్వాణస్థితికి జీవన్ముక్త స్థితికి తీసుకుపోతాయి.

ఈ పుస్తకం మూడు భాగాలుగా విభజన అయివుంది.

1. అంతర్వాణి
2. రెండు మార్గాలు
3. ఏడు అవరణలు

మొత్తం సూత్రాలు 316 అయితే, ఈ సూత్రాలలో ఉపయోగించిన వేదాంత పదాలు- నూటపందొమ్మిదింటిని మరింత వివరిస్తూ చివరి టిప్పణి కూడా యిచ్చారు.

ప్రగాఢ సత్యాల సాధనకు ప్రోత్సాహం యిచ్చే పుస్తకం యిది. అమె జీవితకాలంలో ప్రచురణ అయిన చివరి సమగ్ర పుస్తకం కూడా యిదే.



# తత్త్వదర్శనం

దివ్యజ్ఞానం - దివ్యజ్ఞానులు
ఆధునిక విజ్ఞానశాస్త్రం గురించి
ధ్యానవాహిక
సువర్ణసోపానములు
భావ పరంపర
విజ్ఞానఖని - తరగని గని
ప్రబోధక తారకం

# దివ్యజ్ఞానం-దివ్యజ్ఞానులు

దివ్యజ్ఞానం అంటే ఏమిటి? (THEOSOPHY)

దివ్యజ్ఞానులు అంటే ఎవరు? (THEOSOPHISTS)

—ఈ రెండు ప్రశ్నలు మేడం బ్లావట్‌స్కీ తత్త్వదర్శనానికి మూల ప్రశ్నలు. వీటికి సరిగా సమాధానం తెలుసుంటే తప్ప మనం ఆమె తత్త్వ దర్శనాన్ని నిష్పక్షపాతంగా అర్థం చేసుకోలేము.

దివ్యజ్ఞానం అంటే భగవంతుడి గురించిన జ్ఞానం అనీ, దివ్యజ్ఞానులు అంటే దివ్యజ్ఞాన సమాజంలో సభ్యులయినవారనీ సామాన్యఅర్థం చెప్పుకోవడం తేలిక. కాని ఈ అర్థం తగినంత బలమైనది కాదు. ప్రామాణికమైనదీకాదు.

దివ్యజ్ఞానం అనేది (Theosophy)అనే ఇంగ్లీషు మాటకు తెలుగు అను రూపంగా వాడుతూ వుంటాం. దీనికే బ్రహ్మజ్ఞానం, సనాతన ధర్మం, ఆత్మ విద్య, తత్త్వాన్వేషణ- యిలాంటి అనురూప పదాలు గూడా మనదేశంలో వాడుకలో వున్నాయి.

Theos; Sophia అనేవి గ్రీకు భాష పదాలు. వీటికి అర్థం భగవత్ సంబంధమైన, జ్ఞానము అనే అర్థాలు- సూటిగా చెప్పుకోవచ్చు. ఈ పదా అర్థాన్ని తాత్త్వికపరంగా వివరించి చెప్పటానికి మేడం బ్లావట్‌స్కీ అనేకమార్లు ప్రయత్నం చేశారు. ఎన్నో వ్యాసాలు వ్రాశారు.

'థియాసఫిస్ట్' అంటే భగవంతుడిని గురించి ఒక సిద్ధాంతాన్ని ప్రతి పాదించేవాడు, భగవత్ కార్యాలను గురించి వివరించ బూనుకునేవాడు అతనికి దీనిని ఎవరూ చెప్పి పంపలేదు, కేవలం తన ఆలోచన అలంబనగా, తన స్ఫూర్తి ఆధారంగా ఈ వివరణలన్నీ ఇస్తాడు- అని వాఘన్ (Vaughan) అనే ఆయన చెప్పిన వివరణ, నిజాన్ని కాస్త దగ్గరగా వస్తుంది, అంటారు బ్లావట్‌స్కీ.

థియాసఫీ, థియాసఫిస్టులు అనే మాటలు మనిషి ఈ భూమిమీద తన ఆలోచన ప్రారంభం చేసినప్పటినుంచి వున్నాయి, అంటారు ఆమె.



మూడవ శతాబ్దంలో అమోనియస్ సకస్ (Ammonius Saccas) అనే నవ-ప్లేటనిక్ స్కూల్ ప్రారంభకుడు ఈ పదాన్ని ప్రచారంలోనికి తీసుకు వచ్చాడు. అప్పటికి ప్రచారంలో వున్న అన్ని తత్త్వదర్శన మార్గాలను సమన్వయపరచడం ఆయన ఉద్దేశ్యం. ఈ విశాల విశ్వాన్ని పాలిస్తూ ఒక మూలతత్త్వం వున్నదనీ, దానికి కొన్ని నియతులు వున్నాయనీ, అన్నిమతాలు-సంప్రదాయాలు ఈనియతిని అనుసరించే యేర్పడినాయి గనుక పైకి కనిపించే విభేదాలను పెద్దగా చేసి ప్రజలు వాటికోసం పోట్లాడుకోకుండా సమరసంగా జీవించాలని ఆయన ఉద్దేశించాడు. ఆయన స్కూల్‌లో బౌద్ధసంప్రదాయాలు, వేదాంత చర్చలు, ఈజిప్ట్ రహస్యాలు, జొరాస్ట్రియన్ పద్ధతులు అన్నీ బోధన జరిగేవి. గ్రీస్ దేశపు తత్త్వసంపద గూడా ప్రస్తావించడం జరిగేది. తలిదండ్రులను గౌరవించాలని, వయోధికులకు ఆదరం చూపాలని, సకల మానవాళిని సోదరులలా పెంపొందాలని, నోరులేని జీవరాశులపట్ల కారుణ్యం ప్రదర్శించాలని— ఆయన తన స్కూల్‌లో నైతిక విలువలకు ప్రాధాన్యం యిస్తూ బోధనలు చేసేవాడు. ఈ నైతిక వర్తనంతోపాటు, ప్రజల మనస్సులను విశ్వవ్యాప్తమైన ఆధారసూత్రాల వంకకుకూడా మళ్ళించి, తత్త్వదర్శనం అన్వేషణ- చింతన- శోధనలను ప్రోత్సహిస్తూనే పారమార్థిక విలువలపై గమనం ఏర్పడేటట్లు శ్రమించాడు.

థియాసఫీ అనేది సనాతన జ్ఞాన – మత – ధర్మం. దీని అంతరంగ సూత్రాలు ఒకప్పుడు ప్రపంచంలోని అన్ని నాగరికదేశాలవారికీ తెలిసివుండేవి. వారు ఈ మూలధర్మానికి ఒక పేరును, జ్ఞాన సంచయానికి మరోపేరును ప్రచారం చేస్తూవుండేవారు. ప్రాచ్య, పాశ్చాత్య దేశాలలోని తత్త్వవేత్త లందరూ భగవంతుని గురించి, సృష్టిరహస్యాలను గురించి పరిశోధనలుచేసి అభిప్రాయ ప్రకటనలు చేసేవారు. ఈజిప్ట్‌లోని హైరోఫన్ట్స్ (Hierophants) ఆర్యావర్తంలోని ఋషులు గ్రీస్‌లోని థియోడిడాక్‌టాయ్ (Theodidaktoi)– యిలా అనేక దేశాలలో మహామహులు 'థియాసఫీ' గురించి పేరుపేరున వ్యవహరించారు. ఒక మూలదైవీ వస్తువు, సృష్టి, మనుషులు- వీటన్నిటిమధ్య సామరస్యం వీరు ప్రకటించారు.

'కబల' సంప్రదాయంలో ఒక గీతిక ఉంది;

"మూల విషయాన్ని స్వరూపాన్ని ఎవరు అర్థం చేసుకోగలరు ? దానికి రూపం లేదు, కనిపించదు!"

ఋగ్వేదంలో (10వ పుస్తకం, 129 గీతిక) యిలావుంది;

'ఈ సృష్టి అంతా ఎక్కడనుంచి ఉత్పన్నం అయిందో ఎవరు ఎరుగుదురు ? ఆయన సంకల్పమే యిలా రూపొందిందా ? లేక దానికేమీ తెలియని మూగదా ? ఆ సంగతి ఆయనకే తెలియాలి. బహుశః ఆయనకు కూడా తెలియదేమో!'

బ్రహ్మ అనేమాట వేద సంప్రదాయంలో వుంది. ఉపనిషత్తులలో 'దానికి మనస్సులేదు, పవిత్రమైనది; కదలికలేదు-' అని వుంది. అలాగే బ్రహ్మకు 'అన్నింటినీ ఎరిగిన ప్రజ్ఞానం' (Absolute Consciousness) అనే పేరూ వుంది.

నేపాల్ సంప్రదాయంలో 'స్వభావత్' అని ఒకమాట వాడుకలో వుంది. స్వభావత్ తప్ప యితరమేమీ లేదు- అంటారు వాళ్ళు. దానికొక సృష్టికర్త అంటూ లేదు; అది అలాగే స్వతస్సిద్ధంగా వుంది- అంటారు.

గ్రీస్ సంప్రదాయంలో డియిటీ (Diety) Divine All అనే మాటలు ఉన్నాయి.

మాటలలో కుదించడంవల్ల 'థియాసఫీ' పరిమితమైపోతుంది.

రూప ప్రపంచం నుంచి అరూప ప్రపంచానికి తీసుకువెళ్ళేది, అంతరంగాన్ని గురించి, అదృశ్య లోకాలను గురించి తెలియచెప్పేది థియాసఫీ.

హిందూ సంప్రదాయంలో 'ధ్యాన యోగ సమాధి' అని ఒక మాట వున్నది. ఇది థియాసఫీ సాధనక్రమాన్ని వెలువరిస్తుంది. అలాగే దేశదేశాలలోను, సంప్రదాయాలలోను ఎన్నో పేర్లు, వివరణలు శ్రోత్రియులు 'విద్య' అంటారు.

ప్రాచీన ఆచార్యులు- జొరాస్టర్, బుద్ధుడు, ఆర్ఫియస్, పైతాగరస్, కన్‌ఫ్యూజియస్, సోక్రటిస్, అమ్మోనియస్ సకస్, యిలాంటివారు- తమ ప్రవచనాలను గ్రంథస్థం చేయలేదు. దీనికి కారణం వుంది. 'థియాసఫీ'వంటి సనాతన ధర్మ-జ్ఞానం రెండుపక్కల పదును వున్న కత్తి వంటిది. అజ్ఞానులకు,



స్వార్థపరులకు అనుసరణీయమైనది కాదు. ఇటీవలి వరకు దీని అనుయాయులు బహు కొద్దిసంఖ్యలో మటుకే వున్నారు- దేశదేశాలలో.

మేడం బ్లావట్‌స్కీ 'ది థియొసాఫికల్ సొసైటీ'అనేపేరున న్యూయార్క్ (అమెరికా)లో ఒక సంస్థను, మరికొందరు వ్యక్తులతో కలిసి, స్థాపించారు. 'విశ్వమానవ సోదరభావం' ఈ సంస్థకు ప్రాతిపదిక సూత్రంగా వివరించారు.

ఆర్యావర్తంలోని అతి రహస్య పవిత్ర సందేశాలను ఆమె ఆధునిక ప్రపంచం ముందు ఉంచింది. మానసిక శాస్త్రపరిశోధనలను మరింత లోతుకు తీసుకువెళ్ళి ఆధ్యాత్మంతో దానిని జోడించింది. సత్యాన్వేషణ పరులు, నిష్పక్షపాతంగా విషయ వివరణ చేయగలవారందరూ థియాసఫిస్టులే-అని చెప్పారు. 'సత్యం' ఒక్కటే శాశ్వతమైనది దీనిని తెలుసుకుందుకు కృషిచేయడంలోనే మానవ జన్మకు సార్థకత; అన్నారు.



# ఆధునిక విజ్ఞానశాస్త్రం గురించి

మేడం బ్లావట్‌స్కీ తన రచనలలో- ప్రధానంగా అయిస్ అన్ వెయిల్డ్ సీక్రెట్ డాక్ట్రిన్‌లలో- 'సైన్సు'ను (విజ్ఞానశాస్త్రాన్ని) ఖండిస్తారు. శాస్త్ర సంబంధమైన మౌఢ్యాన్ని, మతసంబంధింత చాదస్తాలను పరిహరించుకోవాల ఆమె పదేపదే సూచన చేస్తారు.

'గుప్తవిద్యకు సంబంధించిన కొన్ని అంతరిక బోధనలు బహిః ప్రపం చానికి ఈయవలసిన అవసరం వచ్చింది ఇప్పుడు, అయితే ఈ బోధనలకు తగినంత వివరణ, వ్యాఖ్యానము యివ్వకుండా కేవలం 'ముడిసరుకు'గా యిచ్చేట్లయితే అందరికీ అర్థం కాదు. దివ్యజ్ఞాన సమాజ సభ్యులకు కూడా దురవగాహనగానే మిగిలిపోతాయి చెప్పదలుచుకున్న విషయాలు. అందుచేత వర్తమాన విజ్ఞానశాస్త్ర పోకడలతో వాటిని సరిపోల్చి, బేరీజువేసి మరీ చెప్ప వలసి వుంటుంది', అంటారు ఆమె రహస్యగ్రంథంలో.

'దివ్యజ్ఞానం' అనేది కేవలం సనాతన ప్రాచీన మత విషయాలను మాత్రమే ముచ్చటించడంతో సరిపోదు. మనిషి జ్ఞానము, అభివృద్ధికి సంబం ధించిన అనరవత ప్రయత్నము- యిదంతా ప్రస్తుతం ఎక్కువపాలు 'సైన్సు' తోనే ముడిపెట్టుకు వుంది.

అయితే ఆమె ఆ పుస్తకాలలో వ్రాసిన, ఉటంకించిన 'సైన్స్'సూత్రాలు సిద్ధాంతాలు ఈ రోజున చాల మారిపోయినాయి. ఆమె సైన్స్‌ను గురించిచేసిన అనేక వ్యాఖ్యానాలు ఈనాడు వర్తించవు. పైపెచ్చు, ఆమె చెప్పిన అనేక అంతరిక విషయాలను ఈ రోజున సైన్స్ అంగీకరిస్తోంది. దివ్యజ్ఞాన ప్రభావం వల్ల సైన్స్ దృష్టికోణం కూడా చాలాపటుకు మారిపోయినట్లు అనిపిస్తుంది ఈనాడు. దీనిని గురించి ఎక్కువ వివరాలు తెలుసుకోవడం అవసరం.

సైన్స్- థియాసఫీలను సరిపోల్చి చూసుకుంటూ గడచిన యాభై సంవ త్సరాలలో అనేక పుస్తకాలు వచ్చాయి. ఆలోచనలను సమీకరించుకుందుకు కాలానుగుణంగా రూపొందించుకుందుకు ఇవి దోహదం చేస్తాయి. ఆధునిక శాస్త్రవిజ్ఞానుల (Modern Physicists) అభిప్రాయాలు ప్రస్తుతం పరికిస్తే సైన్స్‌కు మతానికి వెనకటి రోజులలో వున్నంత వైరుధ్యం యిప్పుడు లేదేమో అనిపిస్తుంది.



సర్ విలియం క్రుక్స్ (Sir William Crookes) పరిశోధనలను, అభిప్రాయాలను మేడం బ్లావట్‌స్కీ అమోదిస్తారు; ఈయన 1863లోనే రాయల్ సొసైటీకి ఎన్నిక అయి మన్నన పొందాడు, థలియమ్ (Thallium) అనే కొత్త ఎలిమెంట్ (Element)ను కనిపెట్టినందుకుగాను తరువాత ఆయన 'Crookes Tube' అనే దానిని కనిపెట్టాడు. అది ఈనాడు మనం ఉపయో గిస్తున్న టెలివిజన్ ట్యూబులకు, ఫ్లోరసెంట్ వెలుతురుకు మూలరూపం, స్పెక్ట్రోస్కోపి (Spectroscopy)లో ఆయన పరిశోధనలు మానవ జీవితాన్ని సుకరం చేసేందుకు. అనేక కొత్తకొత్త ఉపయోగాలను తీసుకువచ్చాయి; తరువాత ఎప్పుడో ఆయన 1883లో దివ్యజ్ఞాన సమాజ సభ్యత్వం స్వీక రించాడు. బ్లావట్‌స్కీ ఆయనతో పరిచయం పెంచుకుని, లేబరీటరీని గూడా సందర్శించారు. క్రూక్స్ ఆధ్యాత్మ పరిశోధనలలో ఎంతో ఉత్సుకత చూప సాగాడు. నిర్భయంగా తన అభిప్రాయాలను ప్రకటించగల సాహసం చూపాడు. ఆయన సూచనకే 1897లో జె.జె. థామస్ అనే అతడు ఎలెక్ట్రాన్ల గుర్తింపు. శక్తిమానం పెంపొందడంలో సహాయపడినాయి.

పరమ గురువుల ఆసరాతో బహు దూరదృష్టిని పొంది, విశ్వానికి సంబంధించిన కొన్ని రహస్యాలను ఆమె బయలు పరచడంవల్ల శాస్త్రవిజ్ఞానుల పరిశోధనలకు కల్పనలకు కొత్త ఆలంబన దొరికింది.

1900 లోనే మాక్స్‌ప్లాంక్ (Max Planck) అనే ఆయన క్వాంటమ్ మెకానిక్స్‌కు పునాది ఆలోచనలు చేశాడు. (Quantum Mechanics)ఇంతకు ముందు కాంతి తరంగాలుగానే ప్రసరిస్తుందని అనుకునేవారు. పార్టికిల్స్ (Particles) ప్రవర్తన అంచనా వేయటానికి వీలులేకుండా వుంటుందనే అభిప్రాయం తరువాత ప్రచారంలోనికి వచ్చింది.

సైన్స్‌లో సిద్ధాంతము, ప్రయోగము కలిసి చేదోడువాదోడుగా వుంటాయి, ప్రయోగానికి అందని సిద్ధాంతం సైన్స్ అనిపించుకోదు. ప్రయోగం కంటే చాల ముందుగానే సిద్ధాంత ప్రతిపాదన జరిగితే అది 'మెటాఫిజిక్స్' (Metaphysics) అయిపోతుంది.

ప్రస్తుతం మనం ఫిజిక్స్‌కు, మెటాఫిజిక్స్‌కు వున్న అంతర ప్రదేశంలో చొరవగా ప్రయాణం చేస్తున్నాము. ఫీజిక్స్, సైన్స్ త్వరత్వరగా ముందుకు

నడిచివస్తున్నాయి. ఈ రోజు కొత్తగా కనుక్కొన్నామనుకున్నది మరికొన్ని రోజులలో అబద్ధమని ఋజువు కావడం జరుగుతోంది.

విశ్వంలో మనకు కనిపిస్తున్న దానికంటే ఎక్కువ ద్రవ్యం (Matter) వున్నది అనేది గుప్తవిద్య చెప్పేమాట. సైన్స్ డార్క్‌మేటర్(Dark matter) గురించి ప్రయోగాలు చేస్తోంది యింకా. అలాగే విశ్వంలో అనేక బ్రహ్మాండాలు ఉండడం. అవి విస్తరించడం, కుచించుకుపోవడం, యుగాలు-కల్పాలు- యీ సమాచారం అంతా సైన్స్ అవగాహన పరిధిలోనికి వచ్చేస్తోంది. బ్లావట్‌స్కీ మాటల ప్రకారం 'అదృశ్య లోకాలు మన భూమిలోనో బయటనో, వున్నాయని కాదు అనుకోవలసింది. అవి మనభూమితో ఓతప్రోతంగా కలిసిపోయి వున్నాయి.' సైన్స్ చెబుతున్న 'విర్చువల్ పార్టికిల్స్' సిద్ధాంతం (Virtual Particles) దీనికి దగ్గరగా వస్తోంది. హైసెన్‌బర్గ్ (Heisenberg) అనిశ్చిత స్థితి సిద్ధాంతం (Uncertainty Principle) కూడా మనం గుర్తుచేసుకోవచ్చు. 'విర్చువల్' అనే దానినే వేదాంతులు 'దేవతలు' అన్నారా అనిపిస్తుంది, దాని వివరాలు తెలుసుకున్నప్పుడు.

మేడం బ్లావట్‌స్కీ చేసిన అనేక సూచనలు, సిద్ధాంత ప్రతిపాదనలు శాస్త్రజ్ఞులకు పరిశోధనా రంగాన్ని కల్పించడం మనం స్పష్టంగా చూస్తాం.

శాస్త్రజ్ఞులు ఈ రోజున ధైర్యంగా తమ పాత అభిప్రాయాలను మార్చుకోగలుగుతున్నారు. దివ్యజ్ఞానులు ఈ పని ఎప్పుడో చేశారు. ఏమైనా, శాస్త్ర పరిజ్ఞానం, వేదాంత సిద్ధాంతం ఎప్పటికప్పుడు సరిపోల్చి చూచుకోవలసిన అవసరం అందరూ గుర్తిస్తున్నారు.

ఈ విశాల విశ్వంలో జడ పదార్థం అంటూలేదు, అంతా సజీవంగా చేతనంతో తుంబి నర్తిస్తోంది- అన్న బ్లావట్‌స్కీ మాటలు; అంతా ఏకతవైపు ప్రయాణం చేస్తోంది- అన్న దూరదృష్టి మాటలు- యిప్పుడు శాస్త్రజ్ఞులకు సమంజసంగానే కనిపిస్తున్నాయి. ఆంతరిక విషయాలు- గుప్తవిద్య- తెలిసిన వారికి యీ సంగతులు మొదటినుంచీ ఖచ్చితంగానే తెలుసు.

విశ్వాన్నంతటినీ పరిపాలిస్తున్న సూత్రాలు- ధర్మాలు- అన్నీ ఏకతవైపు దృష్టి సారించడం తత్త్వదర్శన సూత్రం. అన్నీ ఒక సజీవ చేతనంలోనే కదలాడుతూ, జీవిస్తూ, ఉండడం యింకా శాస్త్రవిజ్ఞాన ప్రయోగ ఫలితంగా తెలుసుకోవలసి వుంది.

'రహస్యగ్రంథం'లో ఆమె చేసిన అనేక ప్రకటనలు, ప్రవచనాలు మానవ మేధస్సును సక్రమ రీతిలో నడిపిస్తాయి.

❀



# ధ్యాన వాహిక

సనాతన ధర్మాన్ని ఆధునిక ప్రపంచానికి తెలియచెప్పే ప్రయత్నంలో మేడం బ్లావట్‌స్కీ తన అంతేవాసులకు అనేక విషయాలు వెల్లడి చేశారు. అయిసిస్ అన్‌వీల్డ్, ది సీక్రెట్ డాక్ట్రిన్ పుస్తకాల ప్రచురణ అయిన తరువాత అందులోని విషయాలను మరింత వివరంగా కోరినవారికి తెలుపుతూ తమ కాలాన్ని ఉపదేశ ప్రక్రియలో గడిపారు. ఈమె చెప్పిన సంగతులను కొందరు శిష్యులు 'నోట్స్'గా వ్రాసుకుని ఉపయోగపరుచుకున్నారు. ఇటువంటి నోట్స్ దరిమిలా ప్రచురణ భాగ్యానికి కూడా నోచుకుని, ఈనాటికి మనకు లభ్యం అవుతున్నది.

'థియాసఫీని అధ్యయనం చేయడంఎలా?' అనేది ఇటువంటి నోట్స్‌లో ఒకటి. అధ్యయనానికి, ధ్యానానికి కావలసిన ప్రాతిపదిక సూత్రాలు దీనిలో కొన్ని దొరుకుతాయి. అలాంటిదే మరొకటి 'ధ్యాన వాహిక' అనేది. 'డయాగ్రమ్ ఆఫ్ మెడిటేషన్' అనే పేరుతో యిది ప్రచారంలోనికి వచ్చింది.

'ది సీక్రెట్ డాక్ట్రిన్'లో చెప్పిన మూడు ప్రాథమిక సూత్రాలు ఇందుకు నాంది.

1. ఒక తత్త్వం (Principle) ఉన్నది. అది సర్వవ్యాపి, శాశ్వతము; పరిధిలేనిది; స్థిరమైనది. దానిని గురించి మాటలలో ఏమీ చెప్పలేము. చెప్పటానికి ప్రయత్నం చేయడం దానికి 'మరుగుజ్జుతనాన్ని' ఆపాదించడమే.
2. శాశ్వతము, సరిహద్దులు లేనిది అయిన ఈ 'తలం' అసంఖ్యాకమైన బ్రహ్మాండాలకు మూలస్థానం. బ్రహ్మాండాలు ఏర్పడటానికి; తిరిగి ఆ మూలంలోనికే నిష్క్రమించటానికి ఒక 'క్రమత' అనేది ఉన్నది.
3. సర్వవ్యాపి అయిన ఈ Over-Soul కు, బహురూపాలలో కనిపించే Souls కు మూలాధారమైన సమరూపత (Identity) ఉన్నది. ప్రతిజీవి తన అనంతమైన తప్పనిసరి అయిన యాత్ర ముగించుకుని (Obligatory Piligrimage) క్రమంగా 'ధ్యానబోధ' స్థితి పొందుతుంది.

ఈ మూడింటికీ స్థూలంగా [i] పరమాత్మ [ii] బ్రహ్మాండ రచన [iii] మనుష్య నిర్మాణము- జీవన పథము అని పేర్లు చెప్పుకోవచ్చు.

ఆసక్తిదాయకంగా నాలుగు మాటలు చెప్పడం వేరు, సత్యదర్శనం వేరు- అంటారు ఆమె. రహస్య గ్రంథాన్ని (The Secret Doctrine)చదివి నందువల్ల బ్రహ్మాండమైన 'అంతిమ రహస్యాలు' అన్నీ మనకు తెలివిడి అయిపోతాయనే దురూహ పనికిరాదు. ఈ రహస్యాలవైపు- సత్యం వైపు- ప్రయాణం చేయడానికి ఈ పుస్తకం ఉపకరిస్తుంది.

ఈ పుస్తకాన్ని ఎలాగయినా- యే వరుసక్రమంలో అయినాసరే- చదవండి. అయితే ఈ నాలుగు సూత్రాలు- కింద చెప్పినవి- ఎప్పుడూ మీ మనసులలో స్థిరంగా వుండాలి.

1. సృష్టి అంతా ఒక్కటే ఉన్నది ఒకేఒక మూలరూపం: (One Beaing) దీనికి రెండురూపాలు- లక్షణాలు; చైతన్యము, పదార్థత్వము. ఈ మూల రూపానికి, ఏకతకు అతీతంగా మరేమీలేదు.
2. సృష్టిలో మృతపదార్థం (Dead Matter) అంటూ ఏమీలేదు.
3. మనిషి విశ్వరూపి; సృష్టిలోని అన్నిరహస్యాలూ అతనిలో ప్రక్షిప్తంగా వున్నాయి. విశ్వము-మనిషి వేరువేరు కాదు.
4. ఒకే ప్రాణం - ధర్మం; లోపల - బయట, పైన - క్రింద, పెద్ద-చిన్న ఇటువంటి వ్యత్యాసాలు ఎంత విస్తృతంగా కవిపిస్తూ వున్నా, సృష్టిని అంతటినీ ఆశ్రయించుకుని ఆధారభూతంగా వున్నది ఒక్కటేప్రాణము- ఒక్కటే ధర్మము.

ఈ నాలుగు అంశాలను మనసులో స్థిరపరచుకున్న మీదటనే యే అధ్యయనం అయినా సక్రమంగా రూపొందుతుంది; సత్ఫలితాలను యిస్తుంది- అంటారు ఆమె.

'మెదడు జాగ్రదావస్థలో మనిషికి ఉపాధి. ప్రతిజాగరూక రూపమానసిక నిర్మాణము- మెదడులోని అణువులను విరూపం చేస్తుంది; మారుస్తుంది. సాధారణ వివేక కార్యకలాపాలు మెదడులోని పాత గీతలు, చారలు, రహదారులను అనుసరించే ప్రయాణం చేస్తాయి. అవి మెదడులో ఆకస్మికమైన మార్పులు, మానసిక ద్రవ్యపరిణామము తీసుకురావు. కొత్త తరహాగా- అంటే



ఈ నాలుగు అంశాలకు స్థిరపరచుకున్న మీదట- చేసిన మానసిక పరిశ్రమ సరికొత్త పరిణామాన్ని తీసుకువస్తుంది. మేధస్సులో సరికొత్త దారులను (New paths in the Brain) ఏర్పాటుచేస్తుంది. చిన్న మెదడులో నూతన ప్రక్రియలను ప్రవేశపెడుతుంది. ఈ పని- బహుజాగ్రత్తగా, సజావుగా జరక్కపోయినట్లయితే ఉన్మత్త స్థితి కలిగే ప్రమాదం వుంది-' అని గూడా ఆమె హెచ్చరిస్తారు.

ఈ ఆలోచన తీరుకు భారత సంప్రదాయంలో 'జ్ఞానయోగం' అని పేరు. జ్ఞానయోగంలో ముందుకుపోయినకొద్దీ కొన్ని నూతన ఆలోచనలు, ప్రాతిపదికలు మనసులో మెదులుతాయి. ఎంత ప్రయత్నించినా వీటికి 'రూపకల్పన' చేయడం కుదరదు. క్రమంగా 'మానసిక రూపం' యేర్పడుతుంది. వీటికి ఈ సమయంలో 'జాగరూకం'గా వుండి, ఈ కొత్తరూపాలే 'సత్యం' అనుకునే భ్రమలలో పడిపోగూడదు. ఒకప్పుడు సుందరంగా,సజీవంగా, సృజనాత్మకంగా కనిపించే రూపమే- తరువాత తరువాత మొద్దుబారిపోయి బండతనానికి 'ప్రతిరూపంగా తయారై క్రమంగా మరుగైపోతుంది. ఇది మరో ప్రమాదసూచిక. ఎందుకంటే, ఏ రూపమూ మనసులో ఇమడనప్పుడు, 'ఖాళీ' యేర్పడి మరో మంచిరూపం దొరికేంతవరకు పాతదానికే కొత్తరంగులు పులిమి మనసులో నిలుపుకుందాం- అనిపిస్తుంది. నిజమైన సాధకుడు మటుకు వీటన్నిటితో నిమిత్తం పెట్టుకోకుండా తనపనిలో తాను ముందుకు వెళ్ళిపోతాడు. మరికొన్ని రూపంలేని వెలుగులు వస్తాయి. వెనుకటి వాటికంటే, సుందరత-సూక్ష్మత ఇముడ్చుకుని రూపాలుగా తయారవుతాయి. సాధకుడికి ఈ సరికే తెలిసిపోయింది, 'సత్యం' అనేది యే 'రూపం'లోనూ యిమిడిపోదని, యే రూపం యెంత గొప్పదయినా సత్యాన్ని పూర్తిగా ప్రతిబింబించ లేదనీని. ఈ చివరి చిత్రం కూడా క్రమంగా పాలిపోయి కనుమరుగు అవుతుంది. ఇలా క్రమానుగతంగా నడచినడచి మనసు రూపాలకు, లావణ్యాలకు అతీతంగా తయారయి, సాధకుడు 'అరూపమైన ప్రపంచం'లో చరించడం నేర్చుకుంటాడు. అన్ని రూపాలు ఆ 'అరూపానికి' సంకుచితమైన అనురూపాలే అని తెలుసుకుంటాడు- అని ఆమె వివరణ యిస్తారు.

మేడం బ్లావట్‌స్కీ చెప్పిన 'ధ్యాన వాహిక' యిప్పుడు పరిశీలిద్దాం.

'ముందు "ఏకత"ను మనసులో ప్రతిష్ఠించుకోండి. స్థలం (Space) దృష్ట్యా విస్తారాన్ని ఊహించండి. కాలం (Time) దృష్ట్యా అనంతాన్ని

రూపొందించుకోండి. దేశ, కాలాలను అతిగమించి ఏకతను మనసులో నిరూపించుకోండి. తరువాత తార్కికంగా, క్రమానుగతంగా (Logically And Consistantly) ప్రజ్ఞయొక్క అవస్థలను మననం చేసుకోండి. అభ్యాసము- విరాగము ఇక్కడ సాధన క్రమంగా సూచితం అవుతున్నాయి. మనమాములు ప్రజ్ఞావస్థను క్రమంగా కొత్తకొత్త ఆలోచనలతో సరిదిద్దుకోండి- పరిపూర్ణం చేసుకోండి.

'మనలో నింపుకోవలసిన అంశాలు కొన్ని వున్నాయి. అవి :

1. అన్ని దేశాలకు- అన్ని కాలాలాకు అతీతంగా వున్న స్థాయిలోవున్నాను అనే భావన. ప్రతిక్షణము- స్థలకాలాల ప్రభావానికి పరిమితులకు అతీతమైన స్థాయిలోనే ఎప్పుడూ నిలదొక్కుకుని వుండటానికిప్రయత్నం చేయాలి.

   ఈ ప్రయత్నం వల్ల- జాగ్రదవస్థ, స్వప్నావస్థలలో మటుమాయం కాజాలని స్మృతి (Memory) పొడసూపుతుంది. ఈ స్మృతివల్ల ధైర్య సాహసాలు ఏర్పడుతాయి.

   పరిమితుల ప్రభావానికి లోనుకాని మనఃస్థితిని అభ్యాసం చేసినందువల్ల భయవిహ్వాలతలు తొలగిపోతాయి. జీవితంలో వచ్చే అనేక కష్టాలకు, సంభవించే నష్టాలకు భయపడడం అనేది తగ్గిపోయి, 'ఉదాసీనత' యేర్పడుతుంది.

2. సృష్టిలోని అనేక వస్తువుల పట్ల- సందర్భాలు, మనుష్యుల ఎడల మమకారము, వైమనస్యము, నిర్లక్ష్యము యిలాంటి ద్వంద్వభావాలను దూరం చేసుకునే ప్రయత్నం చేయండి.

   ప్రతిదానిపట్ల బాహ్య కార్యకలాపాలలో ఒక విధమైన 'ఉదాసీనత', 'తాలిమి' అభ్యాసం చేయండి. క్రమంగా ఈ భావనలు మనస్సుకు కూడా వ్యాపిస్తాయి. మానసిక వాతావరణాన్ని ద్వంద్వాతీతంగా తయారుచేస్తాయి.

   ఎప్పుడూ 'సమస్థితి'లో 'ప్రశాంతం'గా ఉండటానికి ప్రయత్నం చేయండి. సుగుణములు ఉపాసించడంలో సౌలభ్యం దొరుకుతుంది. జ్ఞాన సముపార్జనవల్ల కలిగే సత్ఫలితం యిది. బయటి మనిషికితెలియక



పోయినా. అసలైన మనిషికి- ప్రజ్ఞాంశవుకు- ఉదారత, సానుభూతి, న్యాయం, ధర్మం వంటి సల్లక్షణాలు ఒనగూడుతాయి.

3. రూపసహితమైన వస్తువులన్నీ 'పరిమిత ప్రజ్ఞ'నే కనుపింపచేస్తున్నాయని గుర్తుపెట్టుకోండి. అప్పుడు నింద, స్తుతి యిటువంటివి లేకుండా ఉన్న దానిని ఉన్నట్లుగా చూచి విమర్శించుకోగలుగుతారు.

   నేనే అన్ని ప్రదేశాలను, నేనే అన్ని కాలాలను.... అనే భావం పదేపదే పునశ్చరణ చేసుకున్నందువల్ల విశ్వమంతటితోను 'తాదాత్మ్యం'ఏర్పడుతుంది. విశ్వానికి అవలవున్న 'అధారశక్తి'- మూలపదార్థంతోనూ సంబంధం కుదురుతుంది.

సర్వదేశ దశాకాలాలు నేనే అనేభావన పరిపూర్ణంగా మనసుకుకలగడమే మనలో నింపుకోవలసిన అంశాలకు పరిపూర్తి.

అలాగే- మనలోవున్న కొన్ని సంకుచిత స్థాయిలను పూర్తిగా విడవవలసిన అవసరం కూడా వుంది.

మన ప్రజ్ఞలో, ఆలోచనల్లో విడవ వలసిన అంశాలు యివి :

1. ఎడబాటులు, సమాగమాలను గురించిన భావనలు, ఇవన్నీ నిజమైనవి- శాశ్వతమైనవి అనుకునే ఆలోచనను ఎప్పటికప్పుడు తిరస్కరించడం మనసు నేర్చుకోవాలి.

   పదేపదే ఏవో అత్యాశలు, కోరికలు పెంచుకోవడం; ఏదో జరగాలని ఆశించడం, విషాద స్మృతులను తరుచుగా మనసుకు తెచ్చుకోవడం. హృదయ ఆక్రందనలతో సమసిపోతూ వుండడం.... వీటిని దూరం చేసుకోవాలి.
2. స్నేహితుడు- శత్రువు అనే ఆలోచన విడనాడాలి. దీనివల్ల కోపము, ద్వేషము వంటి దుర్లక్షణాలు మటుమాయం అయిపోయి, ప్రతి సందర్భాన్ని ధర్మయుతంగా చూడగలగడం అలవడుతుంది.
3. ఆస్థిపాస్థులపట్ల మక్కువ; దురాశ, స్వార్థపరత్వం, అతిశయం-ఇలాంటి లక్షణాలను వైదొలగించుకోవాలి.
4. వ్యక్తిత్వభావన, స్వాభిమానం, అనుతాపం, క్లేశం, ఖేదం- యిలాంటి లక్షణాలను గూడా దూరం చేసుకోవాలి.

5. ఇంద్రియలోలత్వం, అతిగా తినడం, విషయాసక్తులు అవడం- వంటి పనులను సైతం మానివేయాలి.

పూర్తిగా విడనాడవలసిన అంశాలను జాగ్రత్తగా గమనిస్తూ వుండి, మళ్ళీ వాటి తాలూకు ప్రలోభాలలో పడిపోకుండా, ఎప్పటికప్పుడు ఉదాత్తత, సమున్నతల గురించే ఆలోచించుకుంటూ వుండటం అవసరం. దీనివల్ల దుఃఖం, బంధం, అజ్ఞానం తొలగిపోతాయి.

నాలో ఎటువంటి గుణలోలత లేదు- అనుకోవడమే, అనుకోగల స్థితి రావడమే విడవవలసిన విషయాలకు సాధన క్రమంలో పరిపూర్తి.

ప్రత్యేక వ్యక్తిత్వ భావన (Personality) అనేది లేకుండా- పూర్తిగా మరచిపోగలిగినప్పుడే- భ్రమ ప్రమాదాలలోపడే అపాయం లేకుండాపోతుంది.

అన్ని సత్కామనలు, సద్లక్షణాలు ఒకటిగా కలిసిపోతాయి. కేవలం సూచనమాత్రంగానే ఈ 'వాహిక'లో కొన్ని పేర్లు ఉటంకించటం జరిగింది. దీనిని సూచనగానే గ్రహించి ఎవరికివారు వదలించుకోవలసినవి, నేర్చుకోవలసినవి నిర్ణయించుకుని చరించాలి.'

మనసును ముందు 'ఖాళీ' చేసుకోవడం, దానిలో 'నిశ్శబ్దత' వుంచి పరిపూర్ణగమనంతో క్రొత్త మనసును ఆవిష్కరింప చేసుకునేందుకు కృషి చేయాలి.

మనుష్యులకు క్రొత్తమనస్సు అవసరం.

క్రొత్త మనస్సుతో (నవత) ఆలోచించగల 'మానవాళి' ఆవిర్భావం కావాలి. ఇదే మానవజాతి మనుగడకు, ప్రగతికి, అభ్యున్నతికి మార్గం.

దివ్యజ్ఞాన ప్రాథమిక సూత్రాలలోని అంశం ప్రతి మనిషిలోను ద్వంద్వ ప్రకృతి వున్నది- అని; నీచ మనస్సు- ఉన్నత మనస్సు అనే రెండు విభాగాలు పనిచేస్తున్నాయనీని. 'కామ' మనస్సు స్థాయినుంచి 'బుద్ధిమనస్సు' స్థాయికి ఎదగడం- తద్వారా మరింత జ్ఞానసముపార్జనచేసుకొని, సృష్టికి ఉపకరించడం మానవుల కర్తవ్యం.

# సువర్ణ సోపానములు
## (THE GOLDEN STAIRS)

మేడం బ్లావట్స్కీ అధునిక ప్రపంచానికి యిచ్చిన అనేక కానుకలలో 'సువర్ణ సోపానములు' (THE GOLDN STAIRS) ప్రధానమైనది. దివ్య జ్ఞాన దేవాలయమును చేరదలుచుకున్న వారికి నిత్యవ్యవహారంలో-దైనందిన జీవితంలో వుండవలసిన వైఖరిని ఇవి తెలియచెప్పుతాయి. మానవస్వభావాన్ని ప్రకృతిని, పురోగమనాన్ని దృష్టిలో వుంచుకుని కూర్చిన సముదాయ నైతిక సూత్రాలు ఇవి. నైతికత ఆధ్యాత్మికతకు ప్రధానమైన అంగం. మొదటిది లేనప్పుడు రెండవది సాధ్యమే కాదు.

దివ్యజ్ఞాన సమాజ సభ్యులకేకాక సామాన్య ప్రజలకు కూడా ఈ నియమ మూలసోపానాలు ఉపకరిస్తాయి. వీటిని అవగతం చేసుకుని నిత్యవర్తనంలో 'భాగం'గా రూపొందించుకున్నప్పుడు 'ఆధ్యాత్మ ప్రసాదం' (Divine Bliss) చేరువ అవుతుంది.

పైకి చాల తేలికగా, సులభంగా కనిపించినా, వీటి అభ్యాసం శ్రమపడి సాధించవలసినంత తీవ్రమైనది. అన్ని ఆధ్యాత్మ సూత్రాల మాదిరే ఇవికూడా తేలికగా అనుసరణీయం అయేట్లు కనిపిస్తాయి. (Deceptively Simple). భ్రమ కలిగిస్తాయి.

ఒక్కొక్క సోపానాన్ని జాగ్రత్తగా మననం చేసుకోవాలి.

'సోపానం' అనే మాటలోనే కొంతమర్మం వున్నది. ఈ మెట్లు ఒకదాని తరువాత మరొకటి అనుకోవటానికి కూడా వీలులేదు. నిజానికి తతిమ్మావన్నీ మొదటి సోపానంనుంచే పల్లవిస్తాయి. 'ఒకదాని తరువాత మరొకటి అభ్యాసం చేస్తాము' అని అనుకోకుండా అన్నిటినీ దృష్టిలో వుంచుకునే సామూహికంగా అవలంబనలోనికి తెచ్చుకోవాలి.

సువర్ణ సోపానముల పూర్తిపాఠం ఇలా వుంది:

"పరిశుద్ధ జీవనము
నిష్పక్షపాతమైన మనస్సు
నిర్మల హృదయము

తీవ్ర జిజ్ఞాస
అనాచ్ఛాదితమైన ఆధ్యాత్మ దర్శనము
అందరి యెడల సోదరభావము
సలహాను ఇచ్చుటకు, పుచ్చుకొనుటకు సంసిద్ధత
గురువుపట్ల విశ్వాసము
సత్యము యొక్క ఆజ్ఞలపట్ల అనువర్తనము
తనకు సంభవించిన అన్యాయమును ధైర్యముగా సహించుట
తత్త్వములను నిర్భయముగ ప్రకటించుట
అన్యాయముగా పరాభవింపబడువారిని ధైర్యముతో కాపాడుట
మానవ పురోభివృద్ధి, పరిపక్వతల పట్ల నిరంతర దృష్టి"

వీటిలో మొదటి నాలుగు మానవుని అభివృద్ధికి, ఆత్మ నిగ్రహమునకు ఉపకరిస్తాయి.

తరువాతి అయిదు అంతకుమించిన ఆంతరిక సత్యమును అవగాహన చేసుకుందుకు ఉపకరిస్తాయి.

తరువాతి నాలుగు పైవాటి అనుసరణకు, ప్రగాఢతకు సంబంధించినవి. వీటిని గురించి ఎంత లోతుగానైనా అధ్యయనం చేయవచ్చును.

మానవ పురోభివృద్ధి, పరిపక్వత (Progression and Perfection) అధ్యాత్మిక విద్య బోధించే ఆదర్శము. సాధకుడు దీనియందు 'నిరంతర' దృష్టి (Constant Eye) ఉంచవలెనని ఆమె ఆదేశము. ఇదే జీవిత పరమార్థము.

మానవ పరిణామము సక్రమ మార్గములో నడువ వలెనంటే ఈ సోపాన సూత్రములను అచంచల విశ్వాసంతో అందరూ అవగాహన చేసుకొని, వాని అంతరార్థములను చింతన చేసుకుంటూ ఆచరణమ 'సాన' పెట్టుకోవలెనని వేరుగా చెప్పనవసరం లేదు.

మానవ జీవితం సరళంగా, సజావుగా, సహజంగా నడిచి దైవత్వ సాన్నిహిత్యం యేర్పడటానికి ఈ సోపానములు దోహదం చేస్తాయి.

అధ్యాత్మ జీవనం అనుదినవర్తనంలోనికి రావటానికి ఇటువంటి 'కిటుకులు' ఎన్నో చెప్పారు మేడం బ్లావట్ స్కీ.

---



# భా వ ప రం ప ర

## దివ్యజ్ఞాన తత్త్వదర్శనం

[సృష్టి చాలా పవిత్రమైనది. జీవితంలో అత్యంత పవిత్రమైనది అదే. మీ జీవితాన్ని అతలాకుతలం చేసుకున్నారా?— వెంటనే మార్చుకోండి. సరి చేసుకోండి. ఈ రోజే మార్చుకోండి. రేపటికి వాయిదా వేయకండి. మీకు యిదంతా అనిశ్చితంగా కనిపిస్తూంటే- ఎందుకు అలా అనిపిస్తోందో విచారించండి. గమనించండి. నిశ్చితస్థితిని సాధించండి.

మీ ఆలోచనాధోరణి సజావుగా, సరళంగా లేకపోతే, దానిని సరళీకరించుకోండి. తార్కికబద్ధం చేసుకోండి. ఈ ప్రయత్నం అంతా చేసుకోకపోతే పూర్వసంసిద్ధత రూపొందుకోకపోతే, మీరు ఈ 'సృష్టి' ప్రపంచంలోనికి అడుగుపెట్టలేరు. అంతా అయిపోయింది.]

—జె. కృష్ణమూర్తి, చివరిమాటలు. మద్రాసు. 1986 జనవరి 4

"ఈ ప్రపంచం సృష్టి పరిణామముల చరిత్ర ఆదినుంచి ఈనాటివరకు 'ఏడు' అధ్యాయాలలో సమగ్రమయిన 'రచన' జరిగి వుంది. అయితే ఏడవ అధ్యాయపు రచన యింకా పూర్తికాలేదు" అని కీ॥శే॥ తల్లాప్రగడ సుబ్బారావు గారు (1856–'90) ఒక వ్యాసంలో వ్రాశారు.

ఈ సమగ్ర రచనలోని 'మొదటి' అధ్యాయాన్ని మాత్రం అక్షరాలలో కూర్చటానికి ప్రయత్నం చేసి, దాదాపు కృతకృత్యురాలను అయ్యాను— అంటారు మేడమ్ హెచ్.పి. బ్లావట్ స్కీ, తమ The Secret Doctrine (రహస్య గ్రంథం) మొదటి సంపుటం, చివరి అధ్యాయంలో ఈరచన ఎంతో అసంపూర్ణం కావచ్చును, పేలవంగా రూపొంది వుండవచ్చును, అయితేనేం- సృష్టిరచన పరిణామాలకు దాదాపు దగ్గరగా, అసలుకు సరయిన నకలుగా తయారయింది అనిగూడా ఆమె భరోసా యిస్తారు.

అనువృత్తంగా పదేపదే ప్రవర్తన అవుతూ వుండే ధర్మం (Law)— దాని వైభవం, వీటిని యూరోపియన్ భాషలో పెట్టగలగడం కష్టం; సాహస కృత్యం కూడా, ఈ ధర్మం, చైతన్యంతో తుంబి తునకలవుతున్న మొదటి

మూలజాతుల (First Races) పదునైన (Plastic) మనసులమీద ముద్రితం అయింది. ఇలా ముద్రితం చేసినవారు విశ్వమనస్సు (Universal Mind) నుండి దీనిని తమకుతాము పరావర్తింప చేసుకున్నవారు, మహోన్నత భావుకులు. ఈ భావాలను భాషలలోనికి అనువర్తింప చేయడం అసాధ్యం. దీనికి తగిన భాష 'దేవభాష' అయిన సంస్కృతం మటుకే. అదే దీనిని తగినంతలో- సముచితంగా- తెలియచెప్పగలుగుతుంది. ఈ ప్రయత్నంలో నా రచనలో లోపాలు వుండవచ్చును. అయినా ప్రయత్నంలోని సదుద్దేశాన్ని దృష్టిలో వుంచుకుని, చదువరులు యీలోపాలను క్షమించి వేయాలి-అంటారు మేడమ్ బ్లావట్‌స్కీ అమిత వినయంగా.

మొత్తంమీద, ముందుగా ఒక విషయం గమనించాలి. ఇంతవరకూ వ్రాసిందీ- యికముందు వ్రాయబోయేది (ఈ విషయం ఆమె The Secret Doctrine- మొదటి సంపుటం చివరలో వ్రాశారు, అనుకున్నాంగదా. దాని తరువాత మరో ఐదు సంపుటాలు ఉన్నాయి.) యింతవరకు యే ప్రాచీన గ్రంథాలలోను సమగ్రంగా లేదు, కానరాదు. భారత తత్త్వశాస్త్ర షడ్దర్శనాలలో కూడా యీ విషయాలు క్షుణ్ణంగా చెప్పివుండలేదు. ఏమంటే, ఈ ధర్మం ఆ షడ్దర్శనాల సంపుటీకరణ, సమ్మిశ్రం (Synthesis) అవడమే కాకుండా సమగ్రరూపంలో 'ఏడవ' దర్శనం. దీనికి (Occult Doctrine) (రహస్య గ్రంథం) అనే పేరు విధాయకం. ఇది ఈజిప్టు తాళపత్ర గ్రంథాలలోగాని, అసిరియన్ ఇటుకలలో- గ్రానైట్ గోడలలోగాని లిఖింపబడలేదు. వేదాంత గ్రంథాలు (మానవ పరిజ్ఞానంలో చివరి మాటలు— అంతిమ సూత్రాలుకదూ వేదాంతం అంటే !) ప్రపంచ నిర్మాణ సూత్రాలను భౌతికాతీత స్థాయిలలో వివరిస్తాయి. వాటిలో భాగం అయిన ఉపనిషత్తులు (ఉప-ని-షద్) గుప్తము, ఆధ్యాత్మికము (మానసిక స్థాయికి పైమెట్టు) అయిన జ్ఞానాన్ని బయలుపరచి ఆ కాంతిపుంజంలో అజ్ఞాన అవిద్యా తిమిరాలను లోగొంటాయి, పారదోలుతాయి. అయినా వాటిని సమగ్రంగా సంపూర్ణంగా అర్థం చేసుకోవాలంటే యిప్పుడు మరొక 'తాళం చెవి' (Master Key) అవసరం అవుతుంది. ఈ అదనపు తాళం చెవి లేకుండా వాటిని ప్రస్తుతకాలంతో అర్థం చేసుకోగలగడం అసాధ్యం. అందుకు కారణం— నేను నా గురువులనుండి తెలుసుకున్నంతవరకు వివరించటానికి ప్రయత్నం చేస్తాను, అంటారు మేడమ్ బ్లావట్‌స్కీ.



'ఉపనిషత్' అంటే 'రహస్య సిద్ధాంతగ్రంథం' (Esoteric Doctrine) ఈ సూత్రపరంపరలు 'శృతి'లో భాగం; బయలుపరచిన జ్ఞానంలో భాగం. నిజానికి యివి కొత్తవెలుగులు(Revelations). వేదాలలోని 'బ్రాహ్మణములు' గా (మూడవ భాగంగా) యివి ఉటంకించబడినాయి. శ్రీ సుబ్బారావు గారు 'వేదము' అనే మాటను గురించి ఒక సందర్భంలో యిలా వ్రాశారు :

'వేదం' అనే మాటకు రెండు అర్థాలు వున్నాయి. మాటల అర్థంఒకటి; దానికి ఉపయోగించే ఛందస్సు, స్వరము తెలియచెప్పేది రెండవది. రెండవదే వేదాలలోని జీవం— ప్రాణం. పండితులు, భాషాతత్త్వజ్ఞులు స్వరానికి ఆ మాటల వెనకాల వున్న తత్త్వానికీ (Philosophy) యేమాత్రం సంబంధం లేదంటారు. ప్రాచీన గుప్త సిద్ధాంతాల ప్రమేయం యిక్కడ యేమీ లేదంటారు.

అయితే స్వరము, తేజస్సుల మధ్యవుండే అవినాభావము, విచిత్రము అయిన సంబంధం అమిత రహస్యమైనది; గోప్యమైనది కూడా.

ఓరియంటలిస్టులు (Orientalists) యిప్పటివరకు 150 ఉపనిషత్తులు దొరికినాయని జాబితా తయారుచేశారు. వాటిలో బహుపురాతనమయినది 600 B.C. లో వ్రాసి వుండవచ్చునని వాళ్ళు అభిప్రాయపడుతున్నారు. అయితే ఈ గ్రంథాలలో నిజమయినవి— నికార్సయినవి దాదాపు అయిదోవంతు మాత్రమే వుంటాయి. యూదుల బైబిల్ గ్రంథానికి 'కబాలా' ఎటువంటిదో, వేదాలకు ఉపనిషత్తులు అలాంటివి. అవి వేదాలలో చెప్పిన పంక్తులకు వివరణలు, రహస్య అర్థ ప్రతిపాదనలు, వ్యాఖ్యానాలు చేస్తాయి. విశ్వం యొక్క పుట్టుపూర్వోత్తరాలు, భగవంతుని (Deity) స్వభావము, మహత్తర శక్తి (Spirit)— జీవము (Soul) ల గురించి, మనస్సుకు ద్రవ్యానికి (Mind-Matter) వున్న భౌతికాతీత సంబంధం గురించి చెబుతాయి ఉపనిషత్తులు. ఒక్కమాటలో చెప్పవలెనంటే, మానవ జ్ఞానపరిజ్ఞానాలకు మొదలు— తుది అవే. అయితే ఈ వెలుగును ప్రసరించడం నిలిపివేశాయి అవి, బుద్ధుని కాలంనుంచి. అలా కాకపోయినట్లయితే వాటిని రహస్యములు (Esoteric) అనడానికి కుదరదు. ఇప్పుడవి పవిత్ర బ్రాహ్మణీక గ్రంథాలకు అనుబంధాలుగా ప్రచురణ అవుతూనే వున్నాయి. వాటిలో యేమీ గోప్యం, రహస్యము లేదు. ఇప్పుడవి యీ మార్గాన విదేశీయులకు, యూరోపియన్ ఓరియంటలిస్టు

లకు లభ్యం అవుతున్నాయి. ఈ ఉపనిషత్తులన్నిటిలోనూ ఒక సూత్ర
యిమిడి వుంది. ఆ ఏక సూత్రం యేమిటంటే-

1. అవి అత్యంత పురాతనమయినవి. వాటిలో కొన్ని భాగాల
దేశంలో యింకా కుల (Caste) ప్రాతిపదిక యేర్పడకముందు వ్రాసినవి.
కుల విభజన యెంత క్రూరంగా తయారయి పరిణమించిందో మనం
వరలో చూచాం. ప్రస్తుత స్థితికూడా యిందుకు యేమీ మినహాయింపు కాదు.

2. ఈ ఉపనిషత్తులలో సగానికిసగం మూలగ్రంథంలోంచి తొలగింప
బడ్డాయి. వాటిని తిరగరాయడమో, కుదించడమో జరిగింది.

పరిజ్ఞానం (Higher Knowledge) కోసం పనిచేసే మహోపాధ్యా
యులు, బ్రాహ్మణులుకూడా రక్షణ – పాలన కర్తవ్యంగా వుండిన 'రాజుల'
(క్షత్రియ కులం) దగ్గరకు జ్ఞానార్జనకోసం వెళ్ళినట్లు కనిపిస్తుంది. తతిమ్మా
బ్రాహ్మణీక గ్రంథాలకంటె వేరయిన ధోరణి, సంవిధానం ఉపనిషత్తులలో
కనిపిస్తుంది. వాటిలోని భావతీవ్రత, స్వాతంత్ర్యము అపూర్వమయినవి. (ఇదీ
వరకు ప్రదర్శితం కానివి.) మళ్ళీ యిటువంటి తీవ్రత, స్వేచ్ఛాదృష్టి ఋగ్వేద
కీర్తనలలో మాత్రం కనిపిస్తుంది.

ఈరెండవ సత్యం గౌతమబుద్ధుని జీవితానికి సంబంధించిన సంప్రదాయ
కథనాలలో కొంతవరకు వివరించబడినట్లు అగుపిస్తుంది. ఈ కథనం
ప్రకారం-

ఉపనిషత్తులను బ్రాహ్మణాలకు జోడించడం అనేది పునర్నిర్మాణ
కార్యక్రమంలో భాగంగా జరిగింది. బ్రాహ్మణులలో యిప్పటి కులప్రాతిపదిక
విభజన దీని పరిణామంగా జరిగాయి. భారతదేశంపైకి 'ద్విజులు' (Twice-
Born) వెల్లువగా వచ్చిన కొన్ని శతాబ్దాల తరువాత యీ మార్పులు సంభ
వించాయి. ఆ రోజులలో అవి సంపూర్ణంగా పరిణామం చెంది, పరజ్ఞానం
కోసం సుశిక్షితులయి నేర్చుకోదలచిన 'విద్యార్థులకు' - దీక్షితులుగా తయారు
కాదలుచుకున్నవారికి- పాఠ్యగ్రంథాలుగా రూపొందాయి.

ఈ స్థితి- వేదాలు, బ్రాహ్మణాలు కేవలం దేవాలయాల పురోహితుల
రక్షణలో వుండి వారికే వాటిపై సంపూర్ణ అధికారం, ఆధిపత్యం వున్నంత
కాలం కొనసాగింది. పవిత్రకులాలకు సంబంధించినవారు తప్ప యితరులెవరూ



వాటిని అధ్యయనం చేయకూడదు, కనీసం చదవకూడదు— అన్నది ఆ స్థితి.
అప్పుడు గౌతమబుద్ధుడు రంగప్రవేశం చేశాడు. బ్రాహ్మణీక విజ్ఞానాన్ని అంత
టినీ 'రహస్యాల' రూపంలో, ఉపనిషత్తుల రూపంలో నేర్చుకున్న తరువాత-
ఆ బోధనలు హిమాలయాలకు ఆవలవున్న జీవ-ప్రాణ బోధకుల (Teachers
of Life) పలుకులనుంచి వేరయినవి కావని గ్రహించాడు. [ఈ బోధకులకు
Sons of Wisdom, Fire-Mist, Brothers of the Son – అనే పేర్లు
వున్నాయి చైనాదేశ గ్రంథాలలో. ఆ వ్రాతప్రతులలో Si-Dzang (టిబెట్)
దేశప్రస్తావన వుంది; అక్కడ Fo-Kien అనే జిల్లాలో ఒక రహస్య గ్రంథా
లయం వున్నదనీ, బుద్ధుని కాలానికి ఎంతో పూర్వంనుంచి కూడా యిది గోప్య
విద్యలకు, రహస్య సిద్ధాంత జ్ఞానప్రసరణకు కేంద్రం అనీ అందులో స్పష్టంగా
కనిపిస్తుంది.]

బ్రాహ్మణ గురువుల శిష్యుడయిన గౌతముడు, యీ'పరజ్ఞానం'సామాన్య
బ్రాహ్మణులు అందరికీ అందకుండా ఎవరో దాచివేసి వుండడాన్ని సహించలేక
పోయాడు. అంతేకాదు, దీనిని ప్రచారం చేయాలనీ బహుజన సామాన్యులకు
చేరువ చేయాలనీ తద్వారా లోకాన్ని రక్షించాలని (Save the Whole
World) నిశ్చయించుకున్నాడు; తనలో తాను నిర్ణయం తీసుకున్నాడు.
అప్పుడు బ్రాహ్మణులు తమ పవిత్ర 'పరజ్ఞానం' (Wisdom Occult and
Sacred Knowledge) బహిర్గతం అయిపోతోందనీ, అనార్యుల(మ్లేచ్ఛుల)కూ
అందుబాటులోనికి దిగజారుతోందనీ గమనించి- యీ స్థితిని నివారించేందుకు
గాను ఉపనిషత్తుల పాఠాలను కుదించడం(Abridgement) ప్రారంభించారు.
నిజానికి ఉపనిషత్తుల పూర్తిపాఠం వేదాలు, బ్రాహ్మణకాలు కలిసిన పూర్తి
గ్రంథానికి మూడురెట్లు ప్రమాణంలో వుంటుంది. అయితే వాళ్ళు ఆగ్రంథంలో
ఒక్కమాటను కూడా మార్చలేదు, సవరించలేదు. ఆ వ్రాతప్రతులలోనుంచి
అతిముఖ్యం అయిన భాగాలను మాత్రం తొలగించారు. సృష్టిరహస్యాల,
అసిత్వ వైచిత్రుల (Mystery of Being) తుదిపలుకులను (Last Words)
మాత్రం లుప్తం చేశారు. అందువల్ల యేం జరిగిందంటే- బ్రాహ్మణీక రహస్య
సిద్ధాంతాల తాళంచెవి మటుకు దీక్షితుల (Initiates) వద్దనే వుండిపోయింది.
బుదుడు చెప్పిన మాటలు పూర్తిగా సరయినవి కావని ఉపనిషత్తులలోనుంచే
ఉటంకింపులు యిస్తూ బ్రాహ్మణులు వాదించగలిగారు. ముఖ్యమైన ప్రశ్నలకు

సమాధానాలు దొరకకుండా పోయే స్థితిని 'పరిరక్షించారు'. హిమాలయాలకు అవలిప్రాంతంలో గుప్తజ్ఞాన సంప్రదాయ కథనం యిది.

శ్రీ శంకరాచార్యులు చరిత్రప్రసిద్ధుడయిన మహోన్నత దీక్షాపురుషుడు (Greatest Initiate). ఉపనిషత్తులమీద ఎన్నో వ్యాఖ్యానాలు- భాష్యాలు వ్రాశాడు. అయితే ఈ వ్యాఖ్యాన గ్రంథాలన్నీ సంస్కృతి సంప్రదాయాలకు విరుద్ధులయినవారి (Philistines) చేతులలో పడలేదు. దీనిని నమ్మటానికి తగినంత కారణం వుంది. మరీ బలవంతమయిన కారణాలు వున్నాయి. బ్రాహ్మణీక అంతరిక గ్రంథాల (Esoteric Doctrine) వ్యాఖ్యానాలు- అవి అమూల్యమైనవి గనుక- స్మార్త బ్రాహ్మణులకు తప్ప తతిమ్మా హిందువుల పాలిటికి అంతరించిపోయినట్లే లెక్క. అవి ఎప్పటికీ వారికి యథాతథంగా అందవు. ఈ స్మార్తబ్రాహ్మణ సమాజం- శంకరాచార్యుల చేతనే సంస్థాపింపబడింది. ఇంకా దక్షిణ భారతదేశంలో ఈ సమాజికులు వున్నారు. వీరు సంప్రదాయాల విషయంలో బహుగట్టివారు, ఘనాపాఠులు. వీరిలో కొందరు ఈ వ్యాఖ్యానాల వివరాలను చదువుకుందుకు, అధ్యయనం చేసేందుకు తగిన విద్యార్థులను తయారుచేస్తున్నారు. దీనికి కారణం నాకు తెలిసినంతవరకు యిదీ : ఈ సామాజికుల పెద్ద- మఠాధిపతి మటుకే తరచుగా 'దీక్షితుడు' (Initiate) అయిన కోవకు చెందివుంటాడు. ఈ పీఠం మైసూరు పడమటి కనుమల ప్రాంతంలో శృంగ-గిరి (శృంగేరి)లో వున్నది. అంతేకాకుండా, బ్రాహ్మణులలో వున్న అనేక తెగలలో యీ స్మార్తబ్రాహ్మణులు ఒక్కళ్ళే కాస్త గుంభనంగా అందరితో కలిసిపోకుండా వుంటారు. గుప్తవిద్యలు, అంతరిక సిద్ధాంతాలను గురించి తమకు తెలిసిన సంగతులను యితరులకు చెప్పటానికీ, విశదీకరించటానికి విముఖత చూపుతారు. (Occult Sciences and Esoteric Doctrines).

అందుచేత- యీ పుస్తకం యొక్క రచయిత్రికూడా తాను వ్రాస్తున్న అనేక రహస్య సిద్ధాంత విషయాలను అబ్రాహ్మణ సమాజీకులు వ్యతిరేకిస్తారనే సంగతిని గమనించి అందుకు సంసిద్ధం అయేవుంది. అంతమాత్రంచేత- యీ పుస్తకంలో చెబుతున్న ప్రతి చిన్నవిషయనూ యేమాత్రమూ కల్తీలేనిదనీ, ప్రతిదీ తప్పనిసరిగా యదార్థమనీ, ఋజువులతోసహా నిరూపించ వీలవుతుందనీ అభిప్రాయం కాదు. నిజాలు ఎప్పటికీ నిజాలే. వాటిని ఎవరూ కాదనలేరు. అయితే యిందులో ప్రస్తావిస్తున్న విషయాల వివరాలు బహుసూక్ష్మము,



సున్నితము అయినవి గనుక, ఇంగ్లీషు భాషలో తెలియపరచడం బహు పరిమితులతో కూడిన వ్యవహారం గనుక.... యిక్కడ యిచ్చే వివరణలు ఉత్తమంగా సూటిగా వున్నాయని అనుకోవటానికి వీలులేదు. అయితే తగినంత జాగ్రత్తలు తీసుకుని దురర్థాలు రాకుండామటుకు చూస్తూన్నది రచయిత్రి. ఇంతకంటే చేయగలిగింది మరేమీలేదు.

ఇంతవరకు యీ పుస్తకంలో ప్రస్తావించిన విషయాలను ఒకమారు పునశ్చరణ (Recapitulation) చేసుకుందాము. విస్తృతమైన విషయాలు గనుక వీటికి న్యాయం చేయగలగడం కష్టతరం అవడంకాక ఒక్కొక్కమారు 'అసాధ్యం' కూడా అవుతుంది.

1. రహస్యగ్రంథం (The Secret Doctrine) అనేక యుగాలుగా- యుగయుగాలుగా- పరంపరాగతంగా పోగవుతూ వచ్చిన "జ్ఞానం". దాని విశ్వనిర్మాణ సిద్ధాంతాలు, పుట్టుపూర్వోత్తర చరిత్రలు బహు విస్తృతమైనవి క్లిష్టమైనవీని. 'పురాణ గ్రంథా' లలో వీటి సూచనలు బహిరంగంగానే కనిపిస్తాయి. రహస్య సాంకేతిక సూచనలు (Occult Symbolism) బహు విచిత్రమైన శక్తియుక్తులు కలవి. దీక్షితులు అయిన మహర్షులు వీటిని ఎన్నో సంవత్సరాల పరిశ్రమ అనంతరం కనుగొనగలిగారు. వాటి అవిరళవర్తనానికి అక్కజ పడుతూనే ఆసూత్రాలను నిబద్ధీకరించారు. ఈనిబద్ధీకరణం మాటలతో కాక చిహ్నాలతో, సంజ్ఞలతో, సంకేతాలతో రేఖామాత్రంగా రూపొందింది. మహర్షులు ద్రవ్యం (Matter) యొక్క లోతుపాతులకువెళ్ళి అక్కడి నిజాలను చిత్రీకరించగలిగారు. ఎంత చదువుకున్నవాడయినా వాటిని చూచినప్పుడు యేవో బొమ్మలు, గీతలు చూస్తున్నట్లే అనుకుంటాడు గాని వాటి అంతరార్థాలను, సూచనలను యథాతథంగా గమనించలేడు. రూపసందర్శనం అవుతూంది తప్ప గుణలావణ్యాల వ్యవహారం అంతగా తెలిసిరాదు. పదార్థ విజ్ఞానశాస్త్రానికి- ప్రస్తుత స్థితిలో- రూపమే ప్రధానంగాని దాని లోతుపాతుల వివరం అవసరం లేదు. అందుకని ఈ "గుప్తవిద్య"ను అది నిరాకరిస్తుంది, నిర్లక్ష్యం చేస్తుంది. పురాతన సృష్టి నిర్మాణసూత్రాలను అది సరకు గొనక పోవచ్చును. అయితే ఒక విషయం మటుకు నొక్కి వక్కాణించటానికి వీలున్నది. అదేమిటంటే- ఈ సృష్టి నిర్మాణసూత్రాలు యేదో ఒక మనిషి యొక్క "స్వకపోల కల్పితాలు" కాదు. ఎవరో కొందరు చేరి "యిలావుంటే-

బాగుంటుందని" రూపకల్పన చేసినవి కాదు. మహర్షుల పరంపర అన్ని తరాలలో పోగుచేయగలిగిన ప్రయోగాత్మక ఫలితం యిది అంతా.

ఈ ప్రయోగాలు- పరీక్షలు రకరకాల పర్యవేక్షణలకు గురిఅయినాయి. అందులో నిగ్గు తేలినాయి. ఒక జాతినుంచి మరొక జాతికి "నోటిమాట"గా అందించబడినాయి. ఎంతో ఉన్నతులు, మహోన్నతులు అయినవారు అందించిన విజ్ఞాన సంచయం యిది. వారు మానవాళి మనుగడను, శైశవ స్థితిలో తడబాటులను గమనించినవారు. అయిదవ మూలజాతిలోని జ్ఞానులు (Wise men of the fifth race) తమ జీవితకాలం అంతా నేర్చుకుంటూనే గడిపారు, నేర్పుతూ కాదు ! ఖండాలు రూపాంతరం పొందడంలో, భూమి నిర్మాణం అటుయిటు కదలాడడంలో వీరు జాగ్రత్తగా 'రక్షింపబడిన' వారు. ప్రళయాన్ని గడిచి గట్టెక్కినవారు. వారి పరిశ్రమను ఎన్నో మాటలతో తప్ప వర్ణించి వివరించలేము. పురాతన సంప్రదాయ పద్ధతులను గమనించి, పరీక్షించి, సరిచూచుకుని ప్రకృతిసూత్రాలను 'యివీ'అని నిర్ధారించుకున్నారు. ముందు. మహర్షులు ఎవరి దృష్టితో వారు చూచారు ముందుగా. తరువాత ఒకరితో ఒకరు తమ ప్రయోగ ఫలితాలను కలబోసుకున్నారు. తమ భౌతిక, మానసిక, సూక్ష్మ, అధ్యాత్మ శరీరాలను (నిలయాలను) వీలయినంతవరకు పరిశుద్ధపరుచుకుని తగిన క్షేత్రంగా తయారుచేసుకున్నారు. ఒక మహర్షి కనుగొన్న విషయాలను- అదే అంతిమ సూత్రం, అదే నికార్సయినదీ- అని అనుకోలేదు, యితరులు కూడ తమ దృష్టి సారించి చూచి అదే ఫలితాలను స్వయంగా గమనించి నిర్ధారించగలిగేంతవరకూ ! దీనికంతటికీ శతాబ్దాల అనుభవం, ప్రయోగశీలత అవసరం అయింది.

సిద్ధాంత రూపకల్పన, నిర్మాణక్రమము యింత నియమబద్ధంగా సాలోచనగా సమన్వయ ధోరణిని పుణికిపుచ్చుకు జరిగిందని మేడమ్ బ్లావట్స్కీ తమ గ్రంథాలలో పదేపదే తెలియచెప్పుతారు.

2. ఒక సజాతీయ దివ్య ద్రవ్య తత్త్వం (Homogeneous Divine Substance-Principle) ఉన్నది. ఇదే ప్రాతిపదిక (సంపూర్ణం) అయిన కారణం (Radical Cause). ఈ కేంద్రం (Central Point) నుంచి సృష్టి అంతా బయలు వెడలుతోంది; దానిచుట్టూ పరిభ్రమిస్తోంది; దానిపై పే మొగ్గ చూపుతూ నడుస్తోంది.



-14]

ఈ విశ్వనిర్మాణ సూత్రతత్త్వం అంతా ఈ 'కేంద్ర వస్తువు' ఆధారంగానే తన దర్శనాన్ని తయారు చేసుకుంటూంది.

ప్రకృతి రహస్యాలను తెలుసుకోవాలని ప్రయత్నం చేసిన విజ్ఞులు తమకు ద్యోతకం అయిన వెలుగులు అందిపుచ్చుకుని ఆ తేజస్సులోముందుకు మునుముందుకు నడుస్తూ పోయారు. ఒక కారణం నుంచి మరొక కారణానికి ఒక మూలం నుంచి మరొక మూలానికి, రహస్యాలను ఛేదించుకుంటూ ముందుకు అడుగులువేశారు. అన్నిటికీ మూలకారణం యేమిటో కనుగొన్నారు. ఇదే మొదటి తత్త్వం (First Principle) అని అనుకున్నారు.

దానికి (Substance - Principle) ద్రవ్య-తత్త్వం అని పేరు. అది ద్రవ్యమూ, తత్త్వమూకూడా. సృష్టి అంతా రూపొందే తలంలో అది ద్రవ్యం. మహత్తర ఆకాశంలో (Space) ఆది–అంతం ఆధారభూతం అయిన నేల. అరూపంగా వున్నప్పుడు అది తత్త్వం. అదే అన్నిటా లేకుండా అమూర్తంగా, వ్యక్తీకరణకు అందనిది (Impersonal). అన్నీ దర్శనం యిచ్చే Reality; దాని అవ్యక్తీకరణ అందులోనే యిమిడిపోయి అంతర్భాగంగా వుండిపోతాయి. మూలా (Impersonality) సూత్రమే యీ విశ్వనిర్మాణ ప్రాతిపదిక కంతటికీ ధారమైన పట్టు. అదే విశ్వం అంతా. ప్రతి అణువులోనూ యిమిడిపోయి వున్నది ఆ తత్త్వమే.

3. అగోచరము, అమూర్తిమంతము అయిన ఈ తత్త్వసారం అప్పుడప్పుడు (Periodically) వ్యక్తం అవుతూ వుంటుంది. అలా వ్యక్తం అయి నప్పటి రూపమే ఈ 'విశ్వం'. సారం (Essence) అనేది నిజంగా నిబిడీకృతంగా వున్న విషయానికి వివరణం. అలా ఉండిపోవడమే (to be) దాని సహజ లక్షణం. మానవ మేధస్సుతో దానిని గురించి అంచనాలు వేయడం గానీ, ఏదో ఒక గొప్ప 'మూర్తి'తో అనుసంధించి తెలుసుకోవడం కానీ సాధ్యం కాదు. అది శక్తి (Spirit) కాదు; ద్రవ్యము-పదార్థము (Matter) కాదు.... ఈ రెంటి మిశ్రమము. దానిని వర్ణించాలంటే యిదొక్కటే ఆధారం. అది Spirit-Matter [బ్రహ్మ పదార్థం అని వేదాంతులు అంటారు.]

నిజానికి పరబ్రహ్మము (Parabrahman) మూల ప్రకృతి (Mula-

Prakriti)– ఒక్కటే. సృష్టి వ్యక్తతదృష్టాశ (Universal conception of the Manifest) మటుకు రెండూ రెండు ! One Logos (ఏక ఈశ్వరుడు) అనే మొదటి వ్యక్త స్థితిలో కూడా యివి యింతే. భగవద్గీత పైన ఇచ్చి ఉపన్యాసాలలో శ్రీ తల్లాప్రగడ సుబ్బారావుగారు యీ విషయం వివరిం చెప్పారు. వస్తుగతంగా అది మూలప్రకృతి. పరబ్రహ్మం కాదు. పరబ్రహ్మ పైన 'ఆవరణ'గా వున్న తొడుగు. అదే మూలతత్త్వంకాదు. (One Reality) ఈ మూలతత్త్వం పరిమితులకు లోనుకానిది; అమూర్తమతం అయినదీ (Unconditioned and Absolute).

4. విశ్వం- దాని అంతర్భాగాలు అన్నిటితోకలిసి- 'మాయ' అనే పేరుతోనూ వ్యవహరింపబడుతుంది. ఎందుకంటే దానిలో వున్నదంతా తాత్కా లికం అయినదే. మిణుగురుపురుగునుంచి- సూర్యదేవుని వరకు విశ్వంలోవున్న అంతర్భాగాలన్నీ అంతరించిపోయేవే.

బ్రహ్మ పదార్థం (One) శాశ్వతము, స్థిరము అయినది. ఎటువంటి మార్పులకు చేర్పులకు ఆలవాలం అయినది కాదు. ఈ విశ్వం దాని అను రూపమే అయినప్పటికీ— ఎప్పటికప్పుడు కదిలిపోయే రూపాలతో నిండిపోయి వుంటుంది. మార్పులకు లోనయే రూపాలు, పదార్థాలు దీనినిండా చోటుచేసు కున్నాయి. అందుచేతనే ఈ విశ్వం తత్త్వవేత్త (Philosopher) దృష్టిలో భాస్వరంలా వెలుగుతూ మటుమాయమయిపోయేదే. (Will O' the wisp) అంతకంటె ఏమాత్రం నిలకడ అయినదీ నిదానంగా వుండేదీ కాదు. అయితే ఆ విశ్వంలో అంతర్భాగంగా వుండి నివసించే జీవరాశులకు మాత్రం అది ఎంతో యదార్థము. నిజమూ అయినదే. ఈ విశ్వం అశాశ్వతమైనది, అందు లోని జీవరాశులూ తప్పనిసరిగా అశాశ్వతమైనవే. అయినా అందులో వున్నంత సేపూ- విశ్వం వున్నంతవరకూ- అవన్నీ శాశ్వతమైనవే! నిజమయినవే!

5. విశ్వంలోవున్న వస్తువులన్నీ- అన్నివర్గాలకు చెందినవీ(Kingdoms of Nature) చేతనవంతమయినవే- (Conscious). అంటే తాము వున్న తలానికి ప్రత్యక్ష రూపానికి తగినంత చేతనాన్ని పుణికిపుచ్చుకుని వుంటాయి.



సచేతసులం అనుకునే మనుష్యులం మనం యీ విషయాన్ని చాలాజాగ్రత్తగా గమనంలో వుంచుకోవాలి. రాళ్ళలోను, రప్పలలోను మనం కదలికను చేతనాన్ని చూడలేకపోతున్నాం. అంతమాత్రంచేత వాటిలో చేతనం లేదని భ్రమపడకూడదు. వాటికి చేతనం లేదు- అని తీర్మానానికి వచ్చేహక్కు మనకు లేదు. మృతము–అంధము అయిన ద్రవ్యం అంటూ యేమీలేదు. అంధము అచేతనము అయిన ధర్మం యేదీలేదు అన్నట్లుగానే- ఇటువంటి ద్రవ్యంకూడా యేమీలేదు. ఆంతరిక తత్త్వదర్శనంలో ఇటువంటి యేర్పాటుకు అవకాశం లేదు. ఈ తత్త్వదర్శనం పైకి కనిపిస్తున్న రూపాలతో ఆగిపోదు. పైకి కనిపిస్తున్న రూపాలకంటె లోతైన ప్రగాఢమైన 'సారం' వుంటుంది. ఇదే మూలాధారమైన వస్తువు.

6. ఈ విశ్వం తనలోనుంచి తాను ఉన్మీలనం అవుతూ, ప్రబోధాలను తీసుకుంటూ పనిచేస్తుంది. పైకి ఎలాఉన్నదో లోపలకూడ అలానే వుంటుంది. మనిషి విశ్వంయొక్క అనురూపం. అసలుకు సరయిన నకలు. విశ్వధర్మానికి సజీవమైనసాక్షి (Living witness). దాని ప్రవర్తన తీరులకు అనురూపం. బయటకు కనిపించే గమనము, పని, సైగలు- ఉద్దేశపూర్వకం అయినా, వస్తు పరం అయినా మానసికమే అయినా, ఆంతరిక భావప్రకంపనాలకు రూప కల్పనలే. ముందు ఆంతరికంగా ఒక కదలిక. తరువాతనే పైకి ప్రతిచర్య, గమనము, కార్యకలాపము. విశ్వంలోనయినా మనిషిలోనయినా ఇదేసూత్రం లోపల యేదో ప్రజ్వలనం, చలనం లేకుండా బయటకు యేరకమైన కదలిక యేర్పడదు. అవ్యక్తతలంలో (లోకంలో) యేదో కదలిక-ఆతరువాతనే వ్యక్త ప్రపంచంలో దాని ప్రకంపనం.

సృష్టి అంతా (Kosmos) నిరవధికులయిన మహాపురుషుల ఆదేశాలకు అనువర్తనంగా నడుస్తుంది. (Endless series of sentient beings). వారే దీనిని నిగ్రహిస్తూ నియమిస్తూ వున్నది. వారికి మనం యేదో పేరు తగిలిస్తూ వుంటాం. ధ్యాన చోహానులనీ, దేవతలనీ, ప్రవక్తలనీ (Messengers) మనం యే పేరుతో వ్యవహరించినా, వారుమటుకు విశ్వనిర్మాణ సూత్రాలకు, కర్మ నియమాలకు ప్రతినిధులు; పరీవాహకులు (Agents Karmic and Cosmic

Laws.) వారి చేతన స్థాయి, వివేక అంతస్తులు వేరువేరుగా వుంటాయి. వార
పవిత్రమైన ఆత్మలు (Pure Spirits); వారిలో పార్థివమైన వస్తువు యేదీనా
కలిసి వుండదు అనడం కేవలం అలంకారికంగా చెప్పడమే అవుతుంది.
ఎందుకంటే యీ ప్రతినిధులందరూ (Sentient Beings) పూర్వంలో మనుషులే,
అలా అయివుండకపోతే వారి భవిష్యత్తులో మనుష్య వర్గానికి రావలసిన
వాళ్ళే. ఈ మన్వంతరంలో కాకపోతే- పూర్వపు మన్వంతరంలోనో రాబోయే
మన్వంతరంలోనో మనుష్య వర్గుకు చెందినవారే అందరూ. వారందరూ
పరిపూర్ణులు (Perfected). ప్రారంభ స్థితిలో వున్నప్పుడు తప్ప మనుషులే.
కాస్తంత ఉత్తీర్ణులు అయినప్పుడుమటుకు వస్తుతత్త్వం తక్కువగా వున్నతల
లలో వ్యవహరించేటప్పుడు మామూలు మనుషులకంటె 'నైతికంగా' విభిన్న
ధోరణులలో ప్రవర్తిస్తారు. వాళ్ళకు 'ప్రత్యేకమైన వ్యక్తిత్వ భావన' (Feeling
of Personality) వుండదు. మనుషుల మాదిరిగా రాగభావముల ప్రదర్శన
చేయరు. ఈ రెండు లక్షణాలలోను వాళ్ళు మనుషులకంటె వేరు (1. ప్రత్యేక
వ్యక్తిత్వ భావన, 2. రాగభావముల ప్రదర్శన లేకపోవడం) ఈ రెండు
లక్షణాలు పూర్తిగా పార్థివలోకానికి (Earthly World) సంబంధించిన
లక్షణాలు. వీరందరూ- పరిపూర్ణులు అని మనం పైన చెప్పుకుంటున్నవాళ్ళు.
ఈ రెండు లక్షణాలను సాధించగలగడానికి యివీ కారణాలు :

1. వాళ్ళకు మాంసంతో తయారయిన శరీరాలు లేవు; Soul (ఉన్నత
స్థాయి- మానసిక స్థితి) వాటిని ఎప్పుడూ కుంగతీస్తూ కుంటుపరుస్తూవుండదు.

2. ఉన్నత మానసిక స్థాయికి (Spiritual) చెందిన వారి శరీరం
నిరాటంకంగా యెటయినా పోగలుగుతుంది; మరింత స్వేచ్ఛగా మనగలుగు
తుంది. 'మనిషి'ని లోగానే 'మాయ'యొక్క జాలంనుంచి వారు నియుక్తులు.
మనిషి జీవన్ముక్త స్థితి (Adept)కి వచ్చినప్పుడు తన శరీరాలను రెండింటినీ
వేరువేరుగా వుంచుకోగలుగుతాడు. 1. ఆధ్యాత్మిక శరీరం 2. భౌతిక(పార్థివ)
శరీరం.... యీ రెంటినీ దూరదూరంగా నిలుపుకు వ్యవహరించగలుగుతాడు.

ప్రారంభ దశలో వున్నజీవులు (Monads), ఇంతవరకు మానవశరీరం
ధరించి వుండలేదు గనుక- వారికి వ్యక్తిత్వ భావన యేమిటో అహంకారం
అంటే యేమిటో తెలిసికోగల అవకాశం లేదు. అ-మానవ జీవులకు యీ
లక్షణాల స్పృహ వుండటానికే వీలులేదు. (వ్యక్తి తన భావనను 'దేహాత్మ



భావన' అని వ్యవహరించడం వేదాంత పరిభాషలో కద్దు. 'నేనునేనే- మరేం
కాదు....'అన్న అహం- భావధోరణులు యీఅమానవ ఆత్మలకు (Incipient
Monads) వుండవని మనం స్పష్టంగా గుర్తించగలగాలి. భూలోకవాసులకు
(మామూలు మనుష్యులకు- వాళ్ళకు వున్న అతిసాధారణ వ్యత్యాసం ఇదే !)
ఆ అమానవ ఆత్మలకు సామూహికంగా ప్రత్యేక మనోభావన (Individua-
lity) వుంటుందిగాని, ఒక్కొక్కరికీ వ్యక్తిత్వ భావన అనేది వుండదు. ఈ
జీవులు యేప్రకృతి ప్రాంగణంలో వ్యవహరిస్తున్నారో ఆవాతావరణానికి తగిన-
ఉచితమైన- ధోరణులను, లక్షణాలను పొందివుంటారు. సజాతీయత, దివ్యత్వ
ములకు దగ్గరగావున్న ప్రాంగణంలో వున్నజీవులు యీలక్షణాలను ఎక్కువగా
రూపొందించుకు వుంటారు. అన్నివ్యవహారాలకు వేరువేరుజీవులుగానే వ్యవహ
రిస్తారు. వారి ఉన్నత స్థాయిమటుకు 'విశ్వవ్యాప్త దైవీజ్వాల' (Universal
Divine Flame)ను ప్రకాశింపజేస్తూవుంటుంది. మాయా (ఆవరణ)క్షేత్రాలలో
మటుకు వారు వేరువేరుగా కనిపిస్తూ వుంటారు. కాని నిజసీమలలో మటుకు
వారు 'ఏకం'- ఒక్కటే. ఆ 'వర్గు'కు సంబంధించిన వీరందరూ ఒకసమూహం.
ఒకటే వ్యక్తిత్వం- ఒకటే రూపు- ఒకటే భావన. (వేరువేరు రూపాలకు,
నామాలకు అలవాటు పడిపోయిన మనుషులకు యీ భావం మనసుకు పట్టటం
కాస్త ఆలస్యం అయ్యేమాట నిజమేకాని- అసాధ్యం మటుకు కాదు.)

వారు సజీవరూపాలు (Living Ones) Absolute (అవిరళము, అవి
చ్ఛిన్నము అయిన) Life (జీవప్రసారం) నుంచి మాయ ఆవరణలోనికి జారు
తున్న ప్రవాహాలు. వారిలోనుంచి జీవప్రసారం (ప్రాణం) ఎన్నటికీ అంత
రించదు. ఈజీవులను చూచిన వారిలోని అజ్ఞానపు అగ్నిజ్వాలలు పరిపూర్ణంగా
సమసిపోయేంత వరకు, వారి ప్రాణం అలా ప్రసరిస్తూనే వుంటుంది.

(వారిలో వున్న జ్ఞానాగ్ని, మామూలు మనుషులలోని అజ్ఞాన తిమిర
రేఖలను కాల్చివేసేంతవరకు- వారి ప్రాణాగ్ని వెలుగుతూనే వుంటుంది.)

ఒక నది వున్నది. అది చేస్తున్న పని జీవప్రసారం. జీవప్రసార
ప్రవాహం ఒకటి ఉన్నది. (River of Life) కేంద్ర సూర్యుడు (Central
Sun) అంటే మనం భూగోళానికి సంబంధించిన సూర్యుడు గాదు; అలాంటి
సూర్యులను అనేకులను ప్రజ్వలనం చేసే కేంద్ర సూర్యుడు ఆ నదీతీరాలను
ప్రకాశింపచేస్తున్నాడు.

ఈ తేజో ప్రసారంవల్ల, త్వరితపడి, రూపొందినవాళ్ళు ఆ అ-మా జీవులు. వారి ఆంతరిక ప్రకృతి ఈ ప్రసార ప్రవాహానికి చెందిన అ లక్షణాన్ని పుణికిపుచ్చుకుంటుంది. దానిపైన యేర్పడే శరీరాలు దుస్తులవలె రాలిపోతూ, మారిపోతూ వుంటాయి. Young అనే ఆంగ్లకవి ఒకచోట అ అన్నాడు- దేవతలు మహోన్నతులయిన మనుషులు (Angels are Men of A Superior kind) అంతకంటె మరేమీకాదు. వాళ్ళు నియమించడం లేదు, రక్షించడం లేదు. వారి కోపతాపాల కోసం, అనుగ్రహ ఆశీర్వచనాలకో మానవులు భయపడడం- ఎదురుచూడడం అనేది శుద్ధ అవివేకమయిన ప వారిని పూజించినందువల్ల యేవో భయాలు తొలగిపోతాయని, మంచి జరు తుందనీ అనుకోవడం సరికాదు. వారందరూ కూడా, మనుషుల మాదిరిగానే స్థిరమైన కర్మ- విశ్వనిర్మాణ సూత్రాలకు (Karmic and Kosmic Law) బద్ధులయినవారే. ఇందుకు కారణం చాల తేలికగా ఊహించవచ్చును మన తమ ఉనికి అస్తిత్వాలలో యేమాత్రం 'వ్యక్తిత్వజీవన, వాసన' లేకుండ వున్నారు గనుక, వారికి వ్యక్తిత్వలక్షణాలు అంటూ యేమీ వుండే అవకాశం లేదు. మనుషులు ఆపాదించే గుణగణాలు వాళ్ళకు వుండే ఆస్కారం లేదు. దేవుడికి కోపం ఎక్కువనీ, తను చెప్పిన మాటలు వినని వాళ్ళను శపిస్తాడనీ, తనకు అనుగుణంగా వున్నవాళ్ళను కృప చూస్తాడనీ అనుకోవడం 'భ్రమ'లో భాగమే. యజ్ఞయాగాది క్రతువుల ద్వారా ఆయనను- అలాంటి దేవతలను సంతృప్తి పరచవచ్చు ననుకోవడం అవివేకం. భగవంతునికి మానవరూపం ఇచ్చి, మానవ లక్షణాలను ఆపాదించడం యిదంతా (Anthropomorphizing the God.) కాలానుగుణంగా జరిగిన పని.

మనిషి- ముందుముందు ఇంకా వివరంగా తెలియజేసే పద్ధతిలో- ఇటువంటి అమానవ ప్రకృతుల, జీవుల అంశంలో ప్రభవించినవాడు. ఆ అంశను క్రమంగా పెంచుకుంటూ పోయి మరింత మహోన్నతుడుగా తయా రవగల అవకాశం అతనికి వున్నది. ఇంతకుముందున్న అన్ని 'వర్గు'లను జాతులను దాటిపోయి అతీత స్థితికి చేరుకోగలడు. వాటన్నిటినీ తనలో ఇముడ్చుకున్న స్థితిని పొందగలడు.

తన అధోవ్యక్తిత్వ హావభావాలను అణగదొక్కుకుని, (Paralyzing his lower personality) తన ఊర్ధ్వప్రకృతి (Higher / Self), One



Absolute Self (ఏకైకాకృతి) నుంచి ఎప్పుడూ విడివడి వుండగలది కాదన్న విషయం క్షుణ్ణంగా గ్రహించుకోగలిగితే, ప్రస్తుతం వున్న శరీరధారి స్థితిలోనే 'పరమ ఏకాంతుల'లో ఒకడు (One of Us) కాగలడు.

అంటే- అజ్ఞానాన్ని నశింపచేసుకోవాలి. ముందుగా జ్ఞానఫలాన్ని స్వీక రించాలి అందుకు దోహదం జరిగేందుకుగాను. అప్పుడు మానవుడు కూడా 'ధ్యాని' అవుతాడు. (ధ్యాని—జ్ఞాని యిక్కడ సమానార్థంలో వున్నాయి.) ఒక మారు ఆ స్థాయికి చేరుకున్నాక, ప్రతి అనువంశిక వర్గను (Hierarchy) ముంచెత్తే సంఘటితశక్తి (Spirit of Solidarity), పరిపూర్ణ సామరస్యము (Perfect Harmony) అతడినీ ఆవరించుతాయి- పరిపాలిస్తాయి; అతడిని పరిరక్షిస్తాయి. సర్వదా రక్షక కవచంలా నిలుస్తాయి.

మనిషికి- మానవునకు- అనుభూతం అయి అనుభవంలోనికి రావలసిన స్థితి ఇదీ; ఇందులో యెలాంటి తడబాటు- సంశయం- భ్రమ వుండటానికి అవసరం లేదని మేడం బ్లావట్స్కీ భరోసా ఇస్తారు.

# విజ్ఞాన ఖని - తరగని గని

మేడమ్ బ్లావట్‌స్కీ (1831 – '91) దివ్యజ్ఞాన సమాజము (The Theosophical Society) ప్రధాన సంస్థాపకురాలు. 'శ్వేతద్వీపం' పరిసర అయిన మహాపీఠానికి చెందిన 'పరమ గురువులు' ఆమెను తమ 'దూత (Messenger)'గా ఈ ప్రపంచానికి వినియోగించారు. ప్రపంచంలో అధ్యా ధోరణులు, వైఖరులు విస్తరించటానికి, పరివ్యాప్తం అవటానికి ఆమె సేవలను వినియోగించారు. ఈ పవిత్ర కార్యానికి తగిన రీతిని ఆమె మలచటమే కాకుండా, ఎప్పటికప్పుడు ఆమెకు అవసరం అయినసదుపాయాల పౌకర్యాలు యేర్పరచడంలో కూడా 'పరమ గురువులు' శ్రద్ధ వహించా ఇదంతా ఆమె తన 'పని'ని సమర్థవంతంగా చేయటానికి తగిన వాతావరణా కల్పించడం వరకే పరిమితం అయింది తప్ప, వ్యక్తిగతంగా ఆమె జీవితా పూలబాట చేయడం కోసం యేమీ దోహదం జరగలేదు. ఆమె జీవిత మొదటినుంచి చివరివరకూ ముళ్ళబాట మీదనే నడిచింది. అయినా దీని ప్రాధాన్యం ఇవ్వకుండా, 'లక్ష్యం' పట్ల యేకైక దృష్టితో ఆమె కర్తవ్య పాల చేసి మహాపీఠానికి తగిన 'దూత'గా, 'సేవకురాలు'గా గణన పొందా శాస్త్రపరిజ్ఞానంతో తలమున్కలు అవుతున్న వాతావరణం ఒకప్రక్క, మత మౌఢ్యంతో వెర్రితలలు వేస్తున్న పరిస్థితులు మరొకప్రక్క- ప్రపంచంలో ఆలోచనాపరులను గంగవెర్రులు యెత్తిస్తూ వుండగా, వాళ్ళకు దోహద అయ్యే కొన్ని 'ప్రకృతి సూత్రాల'ను 'అధ్యాత్మ నియమాల'ను వెలికి చెప్పడ కోసం, సమగ్రము - సమున్నతము అయిన మానవాభ్యుదయం వైపు వా దృష్టిమళ్ళేట్లు చేయడానికి మేడం బ్లావట్‌స్కీ కృషి చేశారు.

ప్రపంచాన్ని, దాని రీతి నీతులను అర్థం చేసుకునే మరో కొత్తమార్గాన్ని సూచించారు. Metaphysical Realism అనే సంవిధానాన్ని ప్రవేశపెట్టారు. దీని ప్రధాన సూత్రాలు రెండు :

1. మనకు కనిపించని ప్రపంచం బహు విస్తృతంగా మనచుట్టూ- అనేక స్థాయిలలో వ్యాపించి వుంది.
2. దానిని తెలుసుకోవటం, అర్థంచేసుకొని జీవితాన్ని సార్థకపరుచుకోవడం కోసరమే మానవుడు కృషి చేయవలసి వుంది. జీవితప్రయోజనం ఇదే.



కనిపిస్తూ వున్నదే నిజం, కనిపించనిదంతా కేవలం ఊహ- అబద్ధం అనే Scientific Dogmatism ను (కరుడు గట్టిన శాస్త్రధోరణి), క్షుల్లక విషయాలతోనే జీవితాన్ని గడిపేస్తూ మతాన్ని మూఢంగా అవలంబించే పద్ధతిని (Religious Orthodoxy) ఆమె కరిగించి నిస్సారపరచటానికి ప్రయత్నించారు.

ఈ Metaphysical Realism అనేది సర్వదేశ దశాకాలాలకు సంబంధించిన దివ్యజ్ఞానం (Theosophy). దీనిని సంపాదించుకోవటానికి సులభోపాయాలు వున్నాయి. సరళమైన జీవనం, అరమరికలు లేని మనస్సు, పవిత్ర హృదయం (A Clean Life; An open mind; A pure heart)- ఆమె దృఢంగా ఎలుక పరచిన విషయాలలో అతి సూక్ష్మమైన వాటిలో ముఖ్యమైనది. దాని ప్రాతిపదిక అంశం ఇలా ఉంటుంది :

1. ఒక గుప్తశాస్త్రం (Secret Science) వుంది.
2. అది మానవులకు ఒక ఆదర్శాన్ని ఎత్తిచూపుతోంది.
3. మానవ పురోభివృద్ధి, పరిపూర్ణతలను లక్ష్యంగా సూచించే జీవ పరిణామమే ఈ ఆదర్శం.
4. మానవుడు ఈ ఆదర్శం పట్ల నిరంతర దృష్టి సారించి ఉండాలి.

ఈ సాధన క్రమంలో ఆమె ఎన్నో తార్కిక సూత్రాలు, అవలంబన మార్గాలు సూచించారు. ప్రచారంలో వున్న అనేక మార్గాలను 'ఏకీకరణం' చేసి మానవుడికి 'తరుణోపాయం' తెలియ చెప్పారు. ప్రాక్ సంప్రదాయ విజ్ఞానాన్ని పశ్చిమ దేశవాసులకు అందించారు. నిద్రితులయిన ప్రాక్వాసులనూ మేలు కొలిపారు. 'అధ్యాత్మ జ్ఞానం' అన్న దానికి ఎల్లలు, హద్దులు లేవని సహేతుకంగా నిర్ధారించి చెప్పారు.

అధ్యాత్మ సాధనలో భాగంగా ఉన్న 'ఆచార్య-శిష్య సంబంధాన్ని' పునర్వ్యవస్థీకరించారు. శిష్యుడు ఆచార్యునికోసం వెదుక్కుంటూ పోనవసరం లేదనీ; ఎవరికి వారు చక్కగా-శుచిగా-సంసిద్ధం (Proper Preparedness) అయితే, ఆచార్యుడే శిష్యుడిని గుర్తించి దగ్గరకు తీసుకుంటాడనీ; ప్రతి మానవునిలోనూ హృదయ గ్రంధిని ఆశ్రయించుకుని ఉన్న 'అంతర్యామి' (Inner Ruler Immortal) ప్రథమ గురువు అనీ స్పష్టపరిచారు.

Scanned with CamScanner

ఆ కాలం నాటికి నెలకొని వున్న కేవల పదార్థ విజ్ఞానము, అప్పుడే పొడకట్టుకుంటున్న మానసిక విజ్ఞానములకు తోడుగా అధ్యాత్మశాస్త్రాన్ని కూడా జోడిస్తే తప్ప మానవ పురోభివృద్ధి, పరిపూర్ణత సహజమయిన క్రమంలో రూపుకట్టుకోవని ధృవీకరించి చెప్పారు. ఆ మూడింటినీ సమన్వయ పరచి మానవ జీవితానికి ఒక కొత్త అర్థాన్ని, ప్రయోజనాన్ని, ప్రాభవాన్ని తీసుకు వచ్చారు.

ఈ విధంగా ఆమె సమకాలిక భావ ప్రపంచాన్ని ఒక అంతస్తు పైకి తీసుకుపోయి ముందు తరాలలో మరింత చురుకుగా వేగంగా వికసించగల సదుపాయానికి బాటవేశారు.

ఆమె అనేక వ్యాసాలు, గ్రంథాలు వ్రాశారు. వ్యాసాలు Collected writings పేరుతో 14సంపుటాలుగా వచ్చాయి. ఒక్కొక్కసంపుటమూ ఏడెనిమిది వందల పేజీలు. గ్రంథాలు ప్రధానంగా యివి :

ISIS UNVEILED ప్రకృతి అనావరణము (1877)

THE SECRET DOCTRINE రహస్య గ్రంథం (1888)

THE KEY TO THEOSOPHY దివ్యజ్ఞాన రహస్యం (1889)

THE VOICE OF THE SILENCE అంతర్వాణి (1889)

వీటిలో ఆమె ప్రవేశపెట్టిన ప్రతిపాదనలు, సిద్ధాంతాలు ఇంకా అనేకం సామాన్య అవగాహన పరిధికి రావలసి వున్నాయి. విశ్వసృష్టి క్రమాన్ని ఒక 'జానపద గాథ' లాగ కనిపింప చేస్తూనే 'యోగశాస్త్ర' వివరణలో యేక సూత్రతతో రూపొందించిన ఘనత ఆమెకు దక్కించారు పరమ గురువులు.

బ్లావట్‌స్కీ విజ్ఞానం 'లోతులు అందుకోలేని పాతర', ఒక తరగని గని. శ్రద్ధాళువులయిన శిష్యులు (Disciples) ఇందులో నుంచి త్రవ్వి పైకి తీసుకోవలసింది, తెలుసుకోవలసింది ఎంతైనా ఉంది. అందుకు తగిన ఇచ్ఛాశక్తిని సంతరించుకుంటే, దానికి తమలోని క్రియాశక్తిని జోడించుకుంటే, జ్ఞానశక్తి ఆ ప్రయత్నాన్ని సఫలపరచి వారిని కృతార్థులను చేస్తుంది.

మేడం హెచ్.పి. బ్లావట్‌స్కీ (1831–91) ప్రపంచానికి ఒక కొత్త ఆలోచన యిచ్చారు; అది : జ్ఞానమూర్తులు అయిన మహాత్ములు (The Masters of the Wisdom) ఉన్నారనీ, వారి ఉనికి యథార్థమైన సంగతి



అనేది. వారి ఉనికిని పునరుద్ధరించే ప్రయత్నం ఆమె చేశారు. అయితే వారిని 'పరమ ప్రమాణం'గా చేసి, వారిచుట్టూ మహత్తరమైన కోట నిర్మించే పని చేయలేదు. వారికి దూతగా సేవకురాలుగా తనను తాను భావించుకున్నారు, బ్లావట్‌స్కీ. దివ్యజ్ఞాన పరమయిన తత్త్వదర్శనానికీ, దివ్యజ్ఞాన సమాజస్థాపన తోనూ వారికి సత్సంబంధాలు వున్నాయని ఆమె బాహాటంగా సవివరంగా చెప్పగలిగారు. ఏ రకమైన విభాగాలు, అంతరాయాలు లేకుండా 'విశ్వమానవ సోదర భావం' అంకురించడానికి దివ్యజ్ఞాన సమాజం ప్రాతిపదిక అని నొక్కి చెప్పారు.

జ్ఞానమూర్తులయిన ఈ మహాత్ములు ప్రపంచానికి అందచేయ ప్రయత్నించిన జ్ఞానశకలాన్ని అక్షరరూపంలో ప్రదర్శించడమే మేడం బ్లావట్‌స్కీ పదహారు సంవత్సరాలపాటు (1875-91) చేసిన పని. ఆ మహాత్ముల ఆశ్రమంలో తాను నేర్చుకున్న పరమ సత్యాలు, వారి ఆశ్రమంలో తాను సంపాదించుకున్న తత్త్వ దర్శన సూత్రాలు.... ఆమె రచనలకు భూమిక. మహాత్ములు, వారి ఉనికి, ప్రపంచోద్ధరణకు వారు చేస్తున్న ప్రయత్నము.... యివన్నీ ఆమె ఊహాజనితమైన విషయాలు కాదు: ప్రపంచంలో వివిధ తావులలో విలసిల్లిన మత సంప్రదాయాలు, తాత్త్వికాంశాలు ఉదాహరిస్తూ వీటిని ధృవపరిచే ప్రయత్నం చేశారు. సర్వదేశ దశాకాలాలలోనూ వారి జ్ఞానప్రసారం అవిరళంగా సాగిందని చెప్పడమే ఆమె ధ్యేయం. వీటిని ఉపయోగించుకుని మానవాళి మరింత ముందుకు ప్రయాణం చేయాలని ఆమె ఆకాంక్ష. అంతకు పూర్వం బహుళ ప్రచారంలోలేని సంగతులు చెప్పబూనుకున్నది. గనుక ఆమెకు అతి సహజంగా ప్రపంచవ్యాప్తంగా విరోధులు, విమర్శకులూ తయారయ్యారు. గుడ్డిగా యేవిషయాన్నీ నమ్మనవసరంలేదు. మనసుకు తార్కికతను జోడించి సాలోచనగా ముందుకు అడుగులు వేయమని చెప్పినందువల్ల అంత వరకు 'అధికారికంగా'ప్రతిదానినీ సిద్ధాంతీకరించి ప్రజల మన్నన పొందుతున్న వారికి ఎంతో కష్టం కలిగింది. అందువల్లనే ఆమెపైన నిష్ఠూరాలు, నిందలు వేయడానికి కూడా జంకలేదు వారు.

మహాత్ముల తత్త్వ దర్శనాన్ని బాహాటం చేయడానికే ఆమె సంకల్పించింది గాని, వారికి గుడులు (కోటలు) గోపురాలు కట్టి పూజాపునస్కారాలలో వారిని ముంచెత్తటానికి పూనుకోలేదు. భగవంతునకు 'రూపకల్పన'చేయడం,

ఆ రూపాన్ని పూజించడం, ఆ రూపానికి 'ప్రతినిధులు'గా మహాత్ములను నిలబెట్టడం.... ఆమెకు సమ్మతం కాదు. మానవ పురోభివృద్ధి పథంలో 'మహాత్మ' స్థితికూడా ఒక అంతస్తేనని, ప్రతి మానవుడు క్రమేణ అటువంటి స్థితిని చేరుకోవడం సుసాధ్యం అనీ ఆమె విశ్వసించింది. ఆ విశ్వాసాన్ని బహిర్గతం చేసింది. ప్రజ్ఞచేతనము, ప్రాణము క్రమంగా వికసించి తరించడమే మానవ వికాసపథం.... అని ఆమె నిర్ధారించింది. ప్రజ్ఞ యిలా క్రమానుగతంగా వికసించడంలో ప్రాథమిక దశలు, శిష్యత్వస్థాయి, పరిపూర్ణ సహజ మార్గాలని సూచించింది. ఈవిధంగా సామాన్య మానవునకూ పరిపూర్ణ మానవుడు అయే 'మార్గం' వున్నదని చెప్పడం వల్ల ఆమెకూ 'ఆచార్యస్థానం'. యీ విషయాన్ని యిలా ఆమె స్పష్టీకరించవపోయినప్పటికీ-సంప్రాప్తంఅయింది. ఇతరుల-తన సంపర్కంలోనికి వచ్చిన మానవుల-ప్రజ్ఞా స్థాయిని క్రమబద్ధంగా విస్తరింపచేయడం ఆచార్యుని కార్యకలాపం. తనకో ఆచార్యస్థానం నిర్మించుకోకుండా, గోపురం ఎక్కి కూర్చోకుండా, జ్ఞానమూర్తులకు తాను సేవకురాలననీ, దూతననీ- శిష్యురాలననీ (ఉపాసిక) మాత్రం చెప్పుకుంది. అధ్యాత్మ తత్త్వదర్శన విషయాల వివరాలను తెలుసుకోవడం కోసం ఆమెచుట్టూ కొందరు శిష్యులు, ప్రశిష్యులు ప్రవేశించారు.

ఆమె తెలియచెప్పిన అనేక గుప్త ఆధ్యాత్మిక విషయాలను యింకా లోతుగా తరచి చూసుకుని లబ్ధి పొందవలసిన అవసరం ఉన్నది. మహాత్ములను గురించి. వారితో తనకున్న సన్నిహిత సంబంధం గురించి ఆమె అనేక చోట్ల చర్చించింది. ఇండియాలోని యన్.డి. ఖండలవాలా అనే ఆయనకు 1888లో ఆమె వ్రాసిన ఒక లేఖలోని విషయాలను పరిశీలించండి :

'నా జీవితం ఎంతో ఛిన్నాభిన్నమయినది; అందులోనే ఎన్నో వన్నె చిన్నెలు వున్నాయి. మహాత్ముల సంపర్కం వల్లనే ఇదంతా నాకుయేర్పడిందని నేను అనుకోవడంలేదు. నేను పరిచయం చేసిన 'జ్ఞానమూర్తులు' మహోన్నత వ్యక్తులు. ఇండియాలో సుపరిచితులైన యోగులవంటి వారు కాదు. వారు యుగాల తరబడి అడవులలో తపశ్చర్యలు చేయలేదు. తమ శరీరాలమీద చెట్లు, పుట్టలు పెంచుకోలేదు; ఊపిరిని నిలిపి ఉన్నచోటనే కూరుకుపోలేదు. ఆధ్యాత్మశాస్త్రంలో, గుప్త విద్యలలో నిష్ణాతులు వారు. టిబెట్‌లో ఒకరహస్య ఆరామం వారి నివాసం. వారి శిష్యులు, అనుయాయులు ప్రపంచమంతటా బోలెడుచోట్ల వున్నారు. వారు వైభవోపేతులు, ఉన్నత ఆత్మలు,ప్రపంచంలో



వున్న విజ్ఞానఖనులందరికంటెమిన్న అయినవారు. వారిని నేను సమాశ్రయించుకుని వున్నాను. వారి కర్తవ్యాన్ని నెరవేర్చటానికే పూనుకున్నాను. వారినే సాలోచనగా అనుసరిస్తున్నాను. చివరి వరకూ ఇలాగే చేయబూనుకున్నాను. నేను వారికి ప్రతినిధినని ఎప్పుడూ ప్రవర్తించుకోలేదు. నేను వారికి సేవకురాలిని, విశ్వాసపాత్రురాలిగా అనుసరించే మానవమాత్రురాలిని....'

ఆ మహోన్నత జ్ఞానసంచయాన్ని లోకానికి యథాతథంగా పరిచయం చేయడం, ఈ వెలుగుబాటలో మానవాళి సజావుగా ముందుకు నడవటానికి దోహదం చేయడం.... ఇదే ఆమె నిశ్చయం. ఈ నిశ్చయానికి ఉపకరించే గ్రంథ రచనలు చేశారు. గుప్తశాస్త్రం నిర్దేశించిన అంశాలు ఎలా మానవ జీవితాలను పునీతం చేస్తాయో విశదపరచారు.

జ్ఞానమూర్తులయిన మహాత్ములు,వారిశిష్యులు, అనునయులు వారిస్వరూప స్వభావాలను తెలుసుకోవాలన్న ఆసక్తి ఉన్నవారు....ఇలా అనేక స్థాయిలలో ఆధ్యాత్మపథం విలసిల్లుతోంది. దీనినిగురించి బ్లావట్‌స్కీ మాటలలోనే వివరణ ఇవ్వాలని యీ వ్యాసాల ఉద్దేశ్యం. విషయాలను వివరంగా తెలుసుకోవడం అవసరం; తెలుసుకున్నదానిని మననం చేసుకుని తార్కికతకుజోడించుకోవడం అత్యవసరం. ఆమె హృదయ భావపరంపరలను అవగతం చేసుకోవడం అధ్యాత్మపథగాములకు తక్షణ కర్తవ్యం.

'పరమపురుషుల ఉనికిని గురించి ప్రప్రథమంగా అమెరికాలో మాట్లాడింది నేను: వీరిని గురించి యూరపు, అమెరికా దేశాలలో "ఉత్తీర్ణులయిన బహు కొద్దిమందికి" మటుకే అంతకుముందు తెలుసును. జనబాహుళ్యానికి వీరిని గురించి యేమాత్రమూ తెలియదు. తూర్పుదేశాలలో ప్రజలు, తత్త్వజ్ఞులు వీరిపట్ల యెంతో వినయవిధేయతలతో వుంటారు. ఆ పవిత్ర నామాలను భక్తిప్రపత్తులతో తలుచుకుంటూ వుంటారు అక్కడి మామూలు మనుషులు కూడా. భారతదేశంలో అయితే పరమ పురుషులను గురించి యెన్నో వాడుక మాటలు, అతి పరిచయ ప్రస్తావనలుకూడా అగుపిస్తాయి. కొందరయితే దీనిని వివాదగ్రస్తం అయిన విషయంగా కూడా తయారుచేశారు. ఏమైనా, ప్రపంచ వ్యాప్తంగా యీ సంగతిని నొక్కివక్కాణించింది నేను గనుక....దీనిని గురించి కొన్ని నిష్కర్ష అయిన విషయాలు బయలుపరచడం నాకు"విధాయకం అయిన బాధ్యత" అనుకుంటున్నాను....ఇవి బొత్తిగా తెలియని, ఇంతవరకూ ఎఱుకకు

రాని వ్యక్తులకు సైతం, యీ అంశాన్ని గురించి అభిరుచి యేర్పడడం కోసం, కొన్నికొన్ని విషయాలు సవివరంగా చెప్పవలెననుకుంటున్నాను....' అంటారు మేడం బ్లావట్‌స్కీ; ఒక వ్యాసంలో.

'వీరిని గురించి ఇంత సాధికారంగా మాట్లాడుతున్నావుగదా; నీకు వీరు బాగా పరిచయమా? ప్రతిరోజూ నీవు వారి సందేశాలను సలహాలనుపొందుతూ వుంటావా? నీవు అంతటి పవిత్రురాలవా ? నీలో యెలాంటి దోషాలు, కాలుష్యాలూ లేవా?....' అని కొందరు ప్రశ్నించవచ్చును.

ఇలాంటి ప్రశ్నలకు నా దగ్గర ఒకటే సమాధానం ఉంది : 'నేనుఅంతటి పవిత్రురాలను కాను, నా వ్యక్తిత్వంలోనూ యెన్నో లోపాలు, అసమగ్రతలు ఉన్నాయి. అయినా. నాకు తెలిసిన విషయాలను బహిర్గతం చేయటానికి నేను జంకను. ఈ పనిలో ఎందరో బద్ధ విరోధులను తయారు చేసుకున్నాసరే, నాకు ఎన్ని అపవాదులు, నిష్ఠూరాలు వచ్చినాసరే. వాటికన్నిటికీ ధైర్యంగా స్థైర్యంగా నిలుచుంటాను. సాహసంగా కొత్త విషయాలను వెలికితీసి చెప్పటానికి ఉద్యుక్తురాలను అవుతాను-' అంటారు ఆమె.

'నాలో ఎన్నోలోపాలు వుండవచ్చును. అయినా పరమగురువులకటాక్ష వీక్షణాలు, సంరక్షక కవచాలు నాపైని ప్రసరిస్తూ వుంటాయని నా నమ్మకం. 1851లో మొట్టమొదటి మారుగా నాఅధ్యాత్మ గురువును- పరమపురుషుడిని- నేను చూచిన లగాయితూ ఒక్కక్షణం అయినా వారిని అలక్ష్యం చేయడం గానీ, వారిపట్ల ఉదాసీనంగానో అనుమానంగానో వుండడం అనే అపరాధం నేను చేయలేదు. మానసికంగాకూడా- కలలో అయినా- నాకు అటువంటి భావన రాలేదు.

పరమగురువులు పరిపూర్ణజ్ఞానానికి, సత్యస్వరూపానికిప్రతీకలు. వారిలో అచంచల విశ్వాసం వుంచిన ఎవరూ పెడదారులు పట్టరు; దారి తప్పిపోరు. అంతిమ విజయాన్ని సాధిస్తారు. వారిని అనుమానిస్తూ సందేహిస్తూ డోలాయమయమైన మానసిక స్థితిలో వున్నవారు- సోలిపోతారు, వీగిపోతారు. అభేద్యమైన కర్మ సంచయం నుంచీ ఎవరూ తప్పించుకోలేరు. అందుచేతనే తన విరోధులను, తనను హేళనచేసే వారినీ 'అసలయిన విషయాల ప్రచారానికి' సాధనంగానే ఉపయోగించుకోగలిగారు ఆమె. 'నేను వీగిపోవడం వారికి సరిపడదు; అందుచేత నేను ఓపిక కోల్పోతున్నప్పుడల్లా ఆఖరుక్షణంలోనే



వారు నాకు కనిపించి నన్ను, నా పూనికను దృఢతరం చేశారు. మూడుసార్లు నన్ను చావునుంచి తప్పించారు. నాకు అవసరం అయిన జ్ఞానాన్ని అందించారు. నన్ను వినియోగించి ప్రపంచంలో జ్ఞానప్రసారంకోసం ఆయత్తం చేశారు. వారి పనిని నేను దీక్షతో భుజాలకు ఎత్తుకుంటాను. నాకు కావలసిన బలం, సాహసం, తేజస్సు వారినుంచే నాకు సంప్రాప్తం అవుతాయి-' అని చెప్పటానికి ఆమె జంకరు. అధ్యాత్మ పథగాములకు ఇంతకంటె స్ఫూర్తిని యివ్వగల వాక్యం మరేం ఉంటుంది ?

'నాలోవున్న సుగుణం ఒక్కటే; వారిలో అచంచల విశ్వాసం, భక్తి, ప్రపత్తి. పరమగురువుల సముదాయం పట్ల విధేయత. అధ్యాత్మ తత్త్వాన్ని ప్రపంచానికి అందించటానికి ఇదే నాకు రక్షాకవచం. నా పనిలో యే మాత్రమైనా కృతార్థురాలను అయితే, అందుకు మూలకారణం వారి ఆశీర్వచన ప్రభావమే'.

దివ్యజ్ఞాన పథానికి, దివ్యజ్ఞాన మేరువును చేరటానికి ఒకే ఒక రాచబాట వుంది. దీనిపైని దృష్టి సారించి వుండాలి. ఏ మాత్రం ఏమరుపాటువున్నా, నిర్లక్ష్యం తలకు ఎక్కినా సాధకుడు దారితప్పి గుంటలలో చిక్కుకుపోతాడు. పైకిలేచి రాలేనంత ఊబిలో ఇరుక్కుపోతాడు.

తూర్పుదేశాల జ్ఞానులు, గుప్తవిద్యాలంకారులు బహుస్వేచ్ఛగా అలవోకగా యీ బాటమీద సంచరిస్తారు. భూమిమీద మనిషి ఎంత తేలికగా తిరుగాడ గలుగుతాడో అంత సరళంగానే వారు అధ్యాత్మ సీమలలో నడయాడగలరు. వారికి క్షుల్లకమైన మానవ దురభిమానాలు, మతాంతరప్రసక్తులు వుండవు.

ఛాల్డియన్ ముని, పరిషియన్ దర్శకుడు, గ్రీకుతత్త్వవేత్త, ఈజిప్సియన్ హెర్మటిస్ట్, బుద్ధ అర్హతుడు. భారతయోగి.... వీరందరూ ఆ కోవకు చెందినవారే. సర్వదేశ దశాకాలాలలో వింగడితం అయి విస్మృతి చెందిన సత్యశకలాలను ఒకచోటచేర్చి తన కరకమలాలలో ఏకైక సత్యాన్ని ప్రదర్శిస్తాడు జ్ఞాని. అతడు ప్రదర్శించే 'జ్ఞానం' ఇతరులకు మార్గదర్శన దీపిక అవుతుంది. ఈ 'దీపిక'ను యే గాలులూ ఆర్పలేవు; అల్లలాడించలేవు; అంతమొందించలేవు. ఈ వెలుగులోనే సమస్త ప్రపంచాన్నీ చూడటానికి అలవాటు చేసుకోవాలి సామాన్య ప్రజ. 'పరమ గురువు'ను నేత్రదర్శనం చేసుకోగోరే సాధకుడు తన

మానసిక ప్రజ్ఞను ముందుగా ప్రకాశమానం చేసుకోవాలి. ఆప్రజ్ఞలో ఎటువంటి మరకలు, తుడుపులు, పొగమంచులు వుండగూడదు. అకల్మష మానసోన్నత సీమలలో పరమగురువును సాక్షాత్కరింపచేసుకునే సాధ్యత ఉంది మహాత్ములు పరమగురువులు విశ్వమంతటా విస్తరించి వున్నారు. సర్వవ్యాపకులు వారు, సర్వశక్తివంతులు- సర్వజ్ఞులు మటుకే కాదు వారు. ఒక కొండ ఎక్కి చూస్తున్నామనుకోండి మనం; అప్పుడు మనకు సువిశాలమైన క్షేత్రం అగుపిస్తుంది. ఏదో ఒక చెట్టు, పుట్ట, ప్రత్యేక దృశ్యం- కాకుండా క్షేత్రం అంతా సమరసంగా, సమతలంగా కనిపిస్తుంది. ఆ స్థాయినుంచి వారు సకల మానవాళి సృష్టిని పరికిస్తూ పరిశీలిస్తూ వుంటారు. దేనిని గురించీ ప్రత్యేక గమనం వుండదు ఆ స్థాయిలో. అయితే ఒక మానవుడు తన ఉన్నత ఆదర్శాల, సుగుణసంపదల నిలయం అయి కొట్టవచ్చినట్లు కనిపించినప్పుడు వారి దృష్టిని ఆకర్షిస్తాడు, ఆకట్టుకుంటాడు. మానవాళియొక్క సకల శ్రేయస్సు వారి దృక్పథం. దీనికి అనుగుణంగా వర్తించగలిగిన వ్యక్తి వారి దృష్టిని యిట్టే ఆకట్టుకోగలుగుతాడు. ఈ స్థాయిని చేరుకోవటానికి మానవునకు ఎన్నో సంవత్సరాల, జన్మల నిరంతర సాధన అవసరం; వీగిపోని పూనిక స్థిరచిత్తత అత్యవసరం.

పరమగురువులు, మహాత్ముల ఉనికిని గురించి పాశ్చాత్య ప్రపంచానికి మునుముందుగా ఎఱుకపరచినవారు మేడం బ్లావట్‌స్కీ. వీరిని గురించి అతి పరిచయంగా, చనువుగా ఎరిగినవారు ప్రాచ్యదేశాలలో అనేక యోగులు, మునులు వున్నారు. ముఖ్యంగా భారతదేశంలో అనేకులు యెరుగుదురు. ప్రత్యక్ష పరిచయం లేకపోయినా, భారతీయులకు పెక్కుమందికి వీరి 'నామాలు', లక్షణాలు, ఉన్నతి హృదయ వేద్యం. వారు గౌరవ పురస్సరంగా వారిని తరచు తలుచుకుంటూ వుంటారు. తమ కార్యకలాపాలన్నీ వీరికి సమర్పణ భావంగా అర్పణ చేసుకుంటూ వుంటారు. వారిని గురించి లఘువుగా, చౌకగా భావించరు. ఎంతో వినయం, వినమ్రం, ఆత్మీయగౌరవ భావాలతో వారిని స్మరించుకుంటారు. హృదయం నిండా నింపుకుని వర్తిస్తూ వుంటారు. జనసామాన్యం అతి మామూలు సందర్భాలలో కూడా వీరిపేరును తీసుకువస్తూ, వీరి ఉనికిని సవాలు చేస్తూ మాట్లాడడం భారతీయ, యితర ప్రాచ్యదేశాలలో మచ్చుకైనా కనిపించదు. 'మిడిమిడి జ్ఞానం' వలన





అరకొర అభిప్రాయాలతోను సతమతం అయ్యేవారు మాత్రం తమకు తెలియకుండానే వీరి ఉనికిని కించపరచే విధంగా తరుచు. పడవడం వీరి స్వరూప స్వభావాలు ఊహామాత్రంగా నయినా తెలియకపోవడం, అటువంటి 'మహాత్ములు' ఉండడం ప్రకృతి సిద్ధమే అన్న విషయం మనసుకు అర్థంకాకపోవడం వల్ల యిటువంటి ప్రమాదాలు జరుగుతాయి. ఈ ప్రమాదాలలో చిక్కుకుపోయి ఎన్నో కొత్త రకం ఉపద్రవాలు తెచ్చుకున్న వారిని గూడా మనం పురాణ ఇతిహాస పుస్తకాలలో చూస్తూ వుంటాం.

మహాత్ములు, జ్ఞానసంపన్నులు ఎలా తయారు అవుతారు ? వీరి నిర్మాణం ఎంత స్వతస్సిద్ధం అయిన విషయం?.... యిటువంటి అంశాలను గురించి తరచుగా మననం చేసుకోవడంవల్ల కొంతలో కొంత యీ ప్రమాదం తొలగిపోయే అవకాశం వున్నది. కేవలం అభిరుచి, ఆసక్తి వల్ల వారిని తెలుసుకోవాలని, వారి కార్యకలాపాలు అర్థం చేసుకోవాలని అనుకోవడం పొరపాటు. వారిని గురించి తలపోసుకుందుకు కూడా ఎంతో పవిత్రమయిన, నిష్కల్మషమైన మానసిక వాతావరణం వుండాలి ముందుగా- మనుషులలో. కాని విషయాలు తెలుసుకోవడం వల్ల మంచి జరుగుతుందనుకోవచ్చును. 'తెలివిడి' పూర్తిగా, యీ తెలుసుకోవడంలో అనేక అంతస్తులు వున్నాయి. నిర్మలంగా, నిష్కపటంగా, స్వార్థచింతన అనేది అణుమాత్రమైనా లేకుండా వుండడం అత్యవసరం.

వారిని గురించి యింత ఆత్మీయంగా మాట్లాడటానికి నీకున్న అర్హతలు యేమిటి, నీవు యేమీ లోటుపాట్లు లేనంత ఉన్నత ఉదాత్త హృదయురాలవా అని బ్లావట్‌స్కీని కొందరు నిందించి ప్రశ్నించటానికి ప్రయత్నిస్తారు. ఈ ప్రశ్నలకు బ్లావట్‌స్కీ అనేకమార్లు, అనేక రకాలుగా స్పందిస్తారు. మానవ మాత్రులయిన వారు మహాత్ములతో సరాసరి సూటిగా ముఖాముఖిగా కూర్చుని ఉపదేశాలు పొందగల స్థితిని మననం చేసుకోవాలి. ఈ స్థితి 'సాధనం' అవటానికి ముందుగా మానవ మాత్రులు అవలంబించవలసిన 'ప్రవర్తన తీరులు' యేమిటి ?.... అనే విషయాలమీద బ్లావట్‌స్కీ పలు తావులలో వివిధ వర్ణనలు యిస్తారు. ప్రాచీన-దృశ్యాదృశ్య-గ్రంథాల నుంచి ఉటంకింపులు యిస్తూ 'యోగమార్గం', 'అధ్యాత్మ పథం'-అనుసరించదలుచుకున్నవారు ఉండవలసిన తీరుతెన్నులను తెలియచెప్తారు.

తన సందర్భాన్నిగురించే ప్రస్తావిస్తూ ఒకమారు ఆమె యిలా అంటూర్ 'అవును. నేను మానవ మాత్రురాలినే, నా లోటుపాట్లు, లోపాలు, బ్ల తనాలు నాకూ వున్నాయి. ఇతరులందరికంటే నా కర్మభారం' అధిక కూడ. దీనివల్లనే నేను ఎన్నో నిందలకు, సూటిపోటు మాటలకు గురి అ నాను. స్నేహితుల కంటె శత్రువులనే యెక్కువ మందిని తయారు చేసు కున్నాను. జీవితంలో సంక్లిష్టం అయిన సందర్భాలను యెన్నిటినో యెదు ర్కొంటున్నాను. కాని నాలో ఒక గుణం వున్నదని నేను బాగా ఎరుగుదును. ఆ గుణం నాకు రక్షణకవచంలా నిలిచి నన్ను ఎప్పటికప్పుడు కాపాడుతూ వస్తున్నది. అదేమిటంటే.... జ్ఞానమూర్తులు, మహాసహితాన్వితులు అయిన మహాత్ముల కార్యకలాపాలకు నన్ను నేను నిరాటంకంగా, మనసులో యెటు వంటి అభ్యంతర భావనూ లేకుండా, "సమర్పణ" చేసుకోగలగడం. వారిని ఈ జన్మలో 1851లో చూచిన ఉత్తర క్షణం నుంచి, నాకు మరో ధ్యాస లేదు.... వారికి సేవకురాలుగా ప్రవర్తించి, వారి ఆదేశాలను చక్కగా అర్థం చేసుకుని వాటికి కార్యరూపం కల్పించేందుకు పనిచేయాలి అని తప్ప. ఈ రకమైన 'ఏకాత్మ భావం' వల్ల నేను వారికి చేరువ అయినాను. అనుమానాలు, కుశంకలు, దురభిప్రాయాలు పనిని కుంటుపరచడమే కాకుండా ప్రగతిశీలతకు ఆటంకాలు కూరుస్తాయి. అందుచేత యిటువంటివి లేశమాత్రమైనా, ఛాయా మాత్రంగా నయినా మనస్సులో ప్రవేశించగూడదు. జీవితంలో ఎన్నోపరీక్షలు, అవరోధాలు వస్తున్నట్లుగా అగుపిస్తాయి. మనకు పరిపూర్ణ విశ్వాసం, అచంచల మైన సమర్పణ భావం వున్నట్లయితే యివన్నీ మంచులా విడిపోయి మన జీవన మార్గాన్ని సుకరం, సుగమం చేస్తాయి. జీవితానికి మహత్తరమైన సార్థకత చేకూరుస్తాయి'.

బ్లావట్‌స్కీ యిటువంటి 'విశ్వాసాన్ని' మనుషుల హృదయాలలో సుస్థి రంగా ప్రతిష్ఠింపచేయడానికి కృషి చేశారు. ఆమె చూపిన ఆదర్శాల పట్ల నిరంతర దృష్టి నిలిపి వుంచడమే మన కర్తవ్యం.

జీవితం చాల సంకీర్ణం అయినది, సంక్లిష్టం అయినది కూడా. దీనిని సజావుగా అర్థం చేసుకోవడం వల్లనే ఆధ్యాత్మ పథగామి నిస్సంశయంగా ముందుకు వెళ్ళగలుగుతాడు. మనకందరకు ఎంతో కర్మభారం- ప్రారబ్ధం- వున్నది. ఇది చిక్కు పరిస్థితులలో పడవేస్తుంది మనను. ఈ 'చిక్కులు' మనం తెలిసో తెలియకో యేర్పరచుకున్నవే గాని ఎవరో మనమీద అయిష్టం



కొద్దినో, ఆగ్రహం వల్లనో యేర్పరుస్తున్నారు అనుకోగూడదు. 'అనాచ్ఛాదిత మైన' ఆధ్యాత్మ పరిశీలన వుండాలి. అచ్ఛాదనలు తీసుకు వచ్చేది పూర్వ కర్మల ఫలితం. వీటిని నేరుగా స్పష్టంగా చూడగలగడం అవసరం. మన 'దృష్టికోణం' సునిశితంగా స్ఫురద్రూపంగా తయారవాలి. కర్మ మనను మరిన్ని చిక్కులలో పడవేస్తోందనే కుందుబాటు లేకుండా, దానినుంచి విడివడి 'అతిగమించి' ముందుకు దూకగల ప్రయత్నం చేయాలి. కర్మ 'క్షాళనం' కాకపోవచ్చును, కాని అది మనకు 'ఎదుర్కొనగల ధైర్యసాహసా'లను కూడా సమకూరుస్తుంది. శత్రువులు తమ బలాన్ని కోల్పోయి, మనపట్ల ఉదాసీనులుగా తయారయి తరువాత తరువాత మిత్రులుగా కూడా రూపొందే అవకాశం 'కర్మ' ప్రక్రియలోనే వుంది. ఇతరులు మనపై సంధించే 'బాణాలు' మార్గమధ్యంలోనే పరిణామంపొంది 'పూలమాలలు'గా తయారయి మన మెడలను అలంకరించగల అవకాశం వుంది. ఈ అవకాశం కోసం ఉర్రూత లూగుతూ ఎదురుచూస్తూ కూర్చోవడం కాకుండా మనపనిని మనం 'తీరుగా', సందర్భ శుద్ధిగా చేసుకుంటూ పోవడమే కర్తవ్యం. మనలో 'వినాశా'నికి ఆలవాలం కాకుండా, పరిస్థితులను అనుకూలంగా మలుచుకోగల చాకచక్యం కూడా వుంది. దీన్ని గమనించి పెంచుకుంటూపోయే ప్రయత్నం చేయాలి. 'కర్మపరిపాకం' అనే మాట మనం తరుచుగా వింటూ వుంటాం. దీనికోసం మనం చేయవలసిన కృషే బోలెడంత వుంటుంది. దుష్ఫలితాలను తుడిచి వేసుకుపోగల సంఘటిత శక్తిని మనకు మనమే సరఫరా చేసుకోగలగాలి. మన జీవితం నిస్స్వార్థమూ, పరోపకారయుతము అయినప్పుడే యిది సాధ్యం అవుతుంది. మనలో వున్న అంగాంగాలు యేమిటి, వాటి నర్తనాన్ని మనం చేయదలచుకున్న సత్కార్యానికి యెలాఉపయుక్తకంగా మలుచుకుంటున్నాం- అనే దానిమీద మన భవిష్యత్తు ప్రణాళిక అంతా ఆధారపడివుంది. ఒకప్పుడు నిరాశ, నిస్పృహ మనను ముంచివేస్తాయి. ఇక లేవలేం; మన పని అయి పోయింది- అనే చింత మనసును కుంగతీస్తుంది. ఈ 'గుంట'లో నుంచి మళ్ళీ వెలికి రాగల సౌకర్యం కూడా మనస్సే సంధానంచేసి సమకూరుస్తుంది. ఆలోచన విధానం సక్రమ పరచుకోవడం చెడ్డచేయడం అనేది చేతకాకుండా పోవడం.... యిందుకు పడికట్టు రాళ్ళు. 'చంపదగిన యట్టి శత్రువు- చేత చిక్కెనేని చంపరాదు; పొసగమేలు చేసి పొమ్మనుటయె చావు....' అనే శతక సూక్తి మనం మననం చేసుకోవచ్చు. 'శత్రువు' అనుకున్న వానికి అదే

'చావు'. అతడు మిత్రుడు అవుతాడు; మధ్యలో మనపట్ల ఉదాసీనుడై ఆలోచన పరుడవుతాడు. 'శత్రువు' అనేది మనం కల్పించుకున్న భావన అనే విషయంగూడా గమనించగలగాలి. మన 'మంచితనమే' మనకు అనుకూల మైన పరిస్థితులను తీసుకువస్తుంది.

మరణంతోనే అంతా అయిపోయిందని మనం అనుకోలేము; మరణం మరో భావపరంపరకు నాంది పలుకుతుంది. కొత్త ఉడుపులతో మనముందు మరికొన్ని రూపాలను అవాహన చేస్తుంది.

మనకు జీవిత గమనంలో, పురోగతిలో అచంచల విశ్వాసం వుండాలి. కష్టమయినా, సుఖమయినా తాత్కాలికంగా కుందుబాటు, పొంగుబాటు తీసుకు వస్తాయి గాని అవన్నీ గడిచిపోయేవే. ఏదీ తప్పనిసరిగా ఎప్పటికీ నిలవదు. 'మార్పు' సహజం. అదే శాశ్వతం. ఈ మార్పును మనకు అనుకూలం అను కున్న తీరుగా మలుచుకోవడం, మరల్చుకోవడం సాధ్యం. ఈ 'సాధ్యత సీమ'లో ప్రవేశం పొందటానికి మనకు సుగుణశీలత రక్షాకవచం. అసూయలు ఆగ్రహాలు, దురభిమానాలు చేతకాకుండా పోవడమే 'సాధ్యతసీమ'లో మనసు పడవేస్తుంది. దృష్టికోణంలో ఎటువంటి మార్పాటు, మరలింపు లేకుండా మనం ముందుకు పోగలగాలి. ఆధ్యాత్మదృష్టికి మాత్రమే ఆలవాలం అయిన సుగుణ సంపదను పెంపొందించుకోవాలి.

మనకు ఆదర్శమూర్తి అయిన మహితాత్ముడిపట్ల నిరంతర ఆరాధన, మననము; ఆ మహితాత్ముని విజ్ఞతపట్ల మానవ పురోగమన, పరిణతల దిక్కుగా ఆయన నడిపించే తీరుపట్ల అచంచల విశ్వాసము.... అత్యవసరం.

ఆధ్యాత్మ ధోరణులు విస్తరించాలని మనం అనుకుంటూ వున్నా, తద్వ్యతిరేకమైన పంథాలు విచ్చలవిడిగా ప్రపంచంలో ప్రవర్తిస్తున్నట్లు అని పిస్తుంది మనకు. ఈ వ్యతిరేకలనే అవకాశంగా మలుచుకుని కార్యశీలత, ముందుచూపు పెంచుకోగలగాలి. నిజానికి ఆధ్యాత్మికతకు వ్యతిరేకత అనేది లేదు. 'అనాధ్యాత్మికత' భాషాపరంగా ఒకమాట కావచ్చునుగాని, వస్తు రూపంగా దానికి 'స్థితి' లేదు. మంచులాగ విడిపోయే రూపమే అది. మన లక్షణాలలో దానికి పోషకపదార్థాలు లేనప్పుడు అది మన పరిసరాలలో మనజాలదు. అనాధ్యాత్మికతకు ఉన్న 'రంగు' బహు పేలవం అయినది. దీన్ని తేలికగా 'అరూపం' చేయవచ్చును. నికార్సయిన రంగును ప్రోది చేయ



వచ్చును. మన సుగుణశీలతయే దీనికి అవసరం అయిన 'విరుగుడు'ను తయారుచేస్తుంది. కాలానుగుణంగా మార్పులుజరగడం మనం చూస్తూవున్నాం. 'కాలం' అనేది 'ఆధ్యాత్మమానం' కాదు; దానిమీద ఒక 'పొర' మటుకే. ఈ పొరను తొలగించవచ్చు. ఈ సదుపాయాన్ని గుర్తించకుండా, ఇటువంటి 'అబద్ధపు' పొరలను యింకా దృఢతరం, బలవంతం చేసే దుష్కార్యాలు-దుశ్చింతలలో కూరుకుపోయినందువల్లనే మన జీవితాలు మరింత సంక్లిష్టం, సంకీర్ణం అవుతున్నాయనే సత్యాన్ని గమనించాలి. ఇవన్నీ తెచ్చిపెట్టుకున్న 'అవలయలు'. వీటికి దూరమై, యిది దాపుకయినా రాజాలక క్రమంగా మరుగయిపోయే స్థితిని మన సుగుణ సంపద ద్వారా పొందటానికి అవకాశం వుంది. ప్రపంచ పరిశీలనంలో- ఆలోకనంలో- మన 'దృష్టికోణం' మారుతూ వుండడమే యిందుకు మనం ఉపయోగించగల మందు. మనిషి మనస్సుకు జబ్బు చేసింది. మందు ఉపయోగించి యీ జబ్బును వదలగొట్టాలి. అప్పుడు ఆరోగ్యకరమైన స్థితిగతులు, జీవన విధానాలు పల్లవిస్తాయి.

మరణంతోనే అంతా అయిపోతుందని అనుకోవడం సరికాదు. మానవు డిలో ఆంతరికంగా ఏడు తత్త్వాలు వున్నాయి. బయటకు కనిపించే భౌతిక శరీరం; దీనిలోనికి పూర్తిగా దిగబడిపోకుండా పైననేవుండి పర్యవేక్షిస్తూ వుండే ఆత్మ.... ఈ రెండూకాక అయిదు తత్త్వాలు మార్గమధ్యంలో వున్నాయి. భౌతిక మరణంతో స్థూలశరీరం, ప్రాణం, లింగశరీరం మటుమాయం అవు తున్నాయి. మరి నాలుగు తత్త్వాలు వుండిపోయి అవి సూక్ష్మలోక ప్రాంగణా లలో తమతమ కర్తవ్యాలను నెరవేరుస్తాయి. ఒక్కొక్క తత్త్వాన్ని గురించి విడివిడిగా పరిశీలనగా తెలుసుకున్నప్పుడు గాని యీ విషయాలన్నీ కూలం కషంగా అర్థం కావు.

నాలుగవ తత్త్వం, అయిదో తత్త్వంలో కొంతభాగం యీ రెంటికీ 'కామలోకం' అనేది వాసస్థానం. మనిషిలో యింకా సశేషంగావున్న జంతు లక్షణాలు, కోరికలు యీప్రాంగణంలో విచ్చలవిడిగా వ్యవహరిస్తూఉంటాయి.

అయిదో తత్త్వంలో పై భాగం, ఆరు- ఏడు తత్త్వాల సమరస సహ కారాలవల్ల 'దేవకాన్' అనే ప్రాంగణానికి చేరుకుని తాను యింతకు పూర్వం చేసిన పుణ్యకార్యాల తాలూకు ఫలితాలను అనుభవంలోనికి తెచ్చుకుంటూ, నెమరువేసుకుంటూ జీవితాన్ని గురించిన తదుపరి బోధనలు పొందటానికి

తయారవుతూ ఉంటుంది. పరిణామంలో ఎప్పటికప్పుడు కొత్త పాఠాలను నేర్చుకుంటూ ముందుకుపోతూ వుండడమే మనిషి లక్షణం. తెలిసియో, తెలియకుండానో ప్రతి మనిషీ చేస్తున్న పనియిదే. అందుకని యీవిషయాలను గురించి కొంతలోకొంత పరిజ్ఞానం పెంచుకుంటూ నిత్యజీవన వ్యవహారంలో ముందుకువెడుతూ వున్నట్లయితే తన పరిణామాన్ని త్వరిత పరచుకొన్నవాడు అవుతాడు; తద్వారా యితరులకూ సహాయం చేస్తున్నవాడవుతాడు. జీవితము, వేదాంతము- ఆధ్యాత్మికము వేరువేరు కాదనీ, ఒకదానిలో ఒకటి సమ్మిశ్రం అయిపోయి విడదీయటానికి వీలుకానంత ఘనంగా కలిసిపోయి వున్నాయని చెప్పటానికి కారణంయిదే. తనస్వప్రజ్ఞను యథాతథంగా వికసింపచేసుకుంటూ వెళ్ళి పరమేశ్వరుని దివ్యప్రణాళికను అమలుపరచడంలో చేతనయినంతవరకు సహాయంచేస్తూ "పరిణామ ప్రక్రియ"ను ముందుకు నడిపించడంలో మెలుకువగా వుండడం అంటే యిదే. గుడ్డిగా పనులు చేసుకుంటూ పోవడం కంటె, మంచి-చెడు అరసి తెలుసుకుని, మంచిని పెంచుకుంటూ పోవడంవల్ల లోకకల్యాణం (పరిణామ ప్రక్రియ)కు దోహదం చేసినట్లు అవుతుంది. ఇదే మానవుని కర్తవ్యం. తాను అధ్యాత్మ రహస్యాలను తెలుసుకోవడం, తెలుసుకున్న వాటిని నిరాడంబరంగా, నిక్కచ్చిగా అమలు జరుపుకుంటూ వెళ్ళి లోకసంగ్రహానికి (Gathering of the goodwill of the world) సరంజామా కూర్చడం ! మనిషి 'స్వస్వరూప జ్ఞానాన్ని' పొందవలెను అని చెప్పడంలో కూడా యిదే సూచన కనిపిస్తుంది.

అయిదవ తత్త్వం కార్యకలాపాలను తెలుసుకోవటానికి, దానిపేరును గుర్తు తెచ్చుకుంటే మనసుకు దాని స్వరూప స్వభావాలు పొడగట్టుతాయి. దానిపేరు "Thinking Principle" (MANAS). మనకు అంతా తెలిసినట్లుగానే వుండి యే మాత్రమూ అర్థం కాకుండా ఎప్పటికప్పుడు చిక్కుప్రశ్నగా మిగిలిపోయే 'మీమాంస' యిదే.

విషయములు తెలుసుకుంటున్న కొద్దీ ఈ మనసు పదును తేలుతుంది. సూక్ష్మంగా సున్నితంగా సునిశితంగా తయారవుతుంది. బుద్ధి (ఆరవ తత్త్వం) ప్రబోధనకు, జ్ఞానదీప్తికి నిలయంగా తయారై తేజోవంతం అవుతుంది. ఈ స్థితిలో ఇన్ని యుగాలపాటు మనసుతో సహచరించిన జంతులక్షణాలు(పశు), చిల్లరకామనలు, అల్పమైన ఆకాంక్షలు అంతరించిపోయినాయి. పశువు, 'పశుపతి' అయినాడు.



క్షుల్లకమైన విషయాలకు చోటు యివ్వకుండా, ఉన్నతము ఉదాత్తము అయిన సంగతులనే స్మరిస్తూ, వ్యాపింపచేస్తూ పోగుచేసిన జ్ఞానసంచయం మనస్సును యెప్పుడూ ప్రదీప్తం చేయగల స్థాయికి చేరుకొనడాన్నే 'మహాత్ముడు' అవడం- అని చెబుతారు జ్ఞానగ్రంథాలలో. మహాత్ముడు ఆకాశం నుంచి ఊడిపడడు; అకస్మాత్తుగా అవతరించడు. 'మహి'లోంచే తయారవుతాడు. 'మహి' తత్త్వాన్ని (మహిమ) పూర్తిగా తెలుసుకుని దానికి నిలయం అయి ఆత్మవికాసంతో దానిని జోడించి 'లోకకల్యాణం' కోసం పనిచేస్తాడు "మహాత్ముడు". జ్ఞాన సముపార్జన, సమీకరణలవల్ల, అనుష్ఠాన ప్రయుక్తం చేత, మహాత్మ స్థితిని పొందడం మానవులకు సాధ్యమైన విషయమే; మానవ పురోభివృద్ధిలో యిదొకస్థాయి అన్న విషయంకూడా మనం మరచిపోగూడదు.

'మహాత్మ' అనేమాట బ్లావట్‌స్కీ ప్రవేశపెట్టిన "Master of the wisdom" అనే పదజాలానికి ప్రత్యామ్నాయంగా, భారతీకరణంగా వాడుతూ వచ్చారు. ఈ మాటను దివ్యజ్ఞాన వాఙ్మయంలో మొదటగా ప్రవేశపెట్టినవాడు దామోదర్ మవులంకర్ అనే యువక సభ్యుడు. బ్లావట్‌స్కీ యీ వాడుకను మొదటలో ఆమోదించినట్లు కనిపించినా, తరువాత తరువాత కొద్దిపాటి భిన్న అభిప్రాయాలను కనుపరుపచేసింది. అయితే పుస్తకాలలో, వాడుకలో అపదం 'రూఢి' అయిపోయినందువల్ల వాడడం మటుకు తప్పనిసరి అయి వచ్చింది.

'మహాత్ముడు' అంటే ఎవరు?.... ఈ ఆలోచనకు కొన్ని వర్ణనలు యిచ్చారు బ్లావట్‌స్కీ.

ప్రత్యేక శిక్షణద్వారా, జ్ఞానసముపార్జనద్వారా మానవునికి అందుబాటులోనికి వచ్చే ఉత్తమ వికాసాలను సంపాదించిన వ్యక్తి 'మహాత్ముడు'. మామూలుమనుషులు కొన్నియుగాలపాటు పరిశ్రమించి పనిచేస్తేతప్ప తెలియని అమూల్య ఆధ్యాత్మ విషయాలను కొద్దికాలంలోనే తన అవిరళ కృషి, శ్రద్ధలవల్ల సంపాదిస్తాడు ఇతడు. మనం గమనించవలసిన విషయం యేమిటంటే, ఈ వికాసం ప్రతి మానవునకూ సాధ్యమే. ఈ సాధ్యత సమకూడేంతవరకు సృష్టి పరిణామ ప్రక్రియ సజావుగా నడుస్తూనే వుంటుంది. కాకపోతే మనిషి యీ నడకలో- కొన్ని చారిత్రక, భౌగోళిక-ప్రాకృతిక-కారణాలవల్ల ముందుకు పోకుండా ఒకచోట గడ్డకట్టుకుపోయినట్లు వుండిపోవడమో లేక వెనక్కు జారి పడడమో జరిగే ప్రమాదం ఉంది. ఈ భ్రమ ప్రమాదాల నుంచి జాగ్రత్తగా

తప్పించుకున్న మనిషి 'సాధనమున' తనపసులు- కార్యకలాపాలు- 'సమ కూడేటట్లు'చూచుకుంటాడు. ప్రకృతి-దివ్యాజ్ఞ-లకు అనుకూలంగా పనిచేయడం ప్రతికూలంగా పనిచేయడం....అని రెండువర్గాల నడకలువున్నాయి. అందుకనే ప్రకృతి నియమాలు యేమిటో తెలుసుకుని, అస్వప్రజ్ఞ ద్వారా మనిషిముందుకు వెళ్ళే ప్రయత్నం చేయాలని దివ్యజ్ఞాన సూక్తులు చెబుతున్నాయి. ప్రకృతికి సహకరించి, దాని బలం సంపత్తు సంపాదించుకుని, వాటిని ప్రగతిమార్గంలో ప్రయాణం చేయటానికి ఉపయోగించుకొనడం- యిక్కడి సులభసూత్రం ఇటువంటి సూత్రాలు చక్కగా యెరిగి అనునయంగా అవలంబనలోనికి తీసుకు వచ్చే వ్యక్తి 'మహాత్ముడు'.

పరిణామ ప్రక్రియలో అతడు చాల 'ముందు', ఉన్నత స్థానంలో వున్నాడు. ఆత్మవిద్యను కరతలామలకం చేసుకున్న వ్యక్తి 'మహాత్ముడు' తన శరీరాలను (స్థూలంనుంచి మహాకారణ శరీరం వరకు) చక్కగా అదుపు లోనికి తెచ్చుకుని, వాటిని విశ్వనిర్మాణ సూత్రాల పరిధిలోనే ఉపయోగించు కునే సంకల్పం చేసుకుంటాడు అతడు. విశ్వస్థాయి సూత్రాలకు వ్యతిరేకంగా పనిచేయడం అనేది అతని ఊహకుఅందదు; ఆచరణలోపొందదు. మామూలు మనిషి స్థాయిలో కూడా యీ సమన్వయ సూత్రాన్ని యిలా సూక్ష్మీకరించి చెప్పుకోవచ్చును.

"చెడ్డ చేయడం చేతకాకుండా పోవడం".

"మంచి తప్ప మరొక లక్షణాన్ని ఆశ్రయించలేక పోవడం....".

ఆ స్థాయిలో వ్యక్తిగతమైన కామనలు, ఆకాంక్షలు వుండవు. అవన్నీ విశ్వస్థాయికి ఒదిగిపోయాయి. వేరుగా తమ తలలను పైకి ఎత్తి ఆడించవు. నాగుపాముస్వరానికి కట్టుబడిపోయి తలవూపుతూ నాట్యంచేస్తూ కాటువేయడం మరచిపోయినట్లుగా, విశ్వనిర్మాణ స్థాయి సూత్రాల అవలంబనలో స్థిరంగా కూరుకుపోయిన మనిషి దానికి వ్యతిరేకమైన పద్ధతిలో నడవటానికి అవకాశ ద్వారం మూసుకుపోతుంది; కావాలనుకున్నా మళ్ళీ వెనకటి వాసనలలో వ్యవ హరించలేడు. ఆ వాసనలు, స్కంధాలు సమూలంగా పరిపూర్ణంగా కరిగి నీరయి, ఆవిరి అయిపోయి రూపాంతరం పొందాయి. వాటికి పోషణ లేకపోయి నందువల్ల ఎండి వరుగై మరుగయిపోయినాయి. ఇదంతా 'సాధన క్రమం'లో మనకు స్పష్టంగా తెలియకుండానే జరిగేపని. 'స్వార్థము', స్వార్థపరత్వము,



'స్వకీయ కేంద్రము' అనేవి మహాత్మునిలో వుండటానికి అవకాశం లేదు. వీటికి అస్కారం యిచ్చిన ఉత్తర క్షణంలోనే అతడు మహాత్ముడు కాకుండా మామూలు మనిషి అయిపోతాడు. మనిషి పరిణామ వికాసంలో, పరిణతిచెందు తున్న అభివృద్ధి 'పథం'లో మహాత్మస్థాయి ఒక మెట్టు- అన్న విషయం మనం గుర్తుంచుకోవాలి. అదే ఆఖరిమెట్టు కాదు మనం ఉన్న స్థాయితో, ఊహించు కోగలస్థాయితో పరిపోల్చి చూచుకున్నప్పుడు అది చాలఉన్నతము-ఉదాత్తము అయినది. విశ్వంలోని ప్రాణసంచయం పరిణమిస్తున్న తీరులు, స్థాయిలతో పరిపోల్చి చూచుకున్నప్పుడు అది ఒక ప్రాథమిక స్థితిగానే గోచరిస్తుంది. అలా అంటున్నామని ఆస్థితిని కించపరుస్తున్నట్లు భావించగూడదు. విషయాన్ని ఉన్నది ఉన్నట్లుగా చూడగలగడం, తెలుసుకోగలగడం అవసరం. మన ఊహలవల్ల అపోహలవల్ల ఆయా విషయాలలో ఎక్కువ తక్కువలు ఏర్పడవు అనే సంగతిగూడా మనం గమనించాలి. మహాత్ములు స్వార్థపరులు- వారు సృష్టిరహస్యాలన్నీ సామాన్య ప్రజలముందు ఉంచకుండా తమ"స్వంతధనం" లాగ దాచుకుని కూర్చున్నారు- అని కొందరు ఆక్షేపిస్తారు. జ్ఞానం ఒకరు మరొకరికి యివ్వగలది కాదు; ఎవరికివారు తమ స్వయంకృషివల్ల స్వయం మేధవల్ల సాధించి సంపాదించుకునేది. ఈ సంపాదన కూడా స్వంత ఉప యోగం కోసం కాదు; విశ్వకల్యాణం కోసరమే- ప్రపంచ ప్రగతికి పనిముట్టు గానే !

విశ్వ పరిణామం తన నియమిత సూత్రాలు, ధర్మాల ననుసరించి అనవరతము నడుస్తూ వున్నది. ఈ సూత్రాలకు అంతిమ గమ్యం రూపలోకాల నన్నిటినీ అరూపలోకాలతో సమన్వయం చేసి సృష్టి అంతటినీ "దైవీసంపద" తో నింపివేయడం. మహాత్ములు- పరమగురువులు అని మనం వ్యవహరించే పెద్దలు ఈ సూత్రాలను ధర్మాలను ప్రవర్తింపచేయడంలో నిమగ్నులై నిరతులై వున్నారు. "ధర్మచక్ర ప్రవర్తనం" అనే మాటల సముదాయం చాలమంది వినివుంటారు. చక్రవ్యూహం వడివడిగా తిరుగాడుతూ వుంటుంది. దైవీసంకల్పం, ఈశ్వర నియామకం వీటికి మూలాధార విషయాలు. జన సామాన్యానికి యెప్పుడు యే విషయాలు తెలివిడి చేయాలి, నొక్కి చెప్పాలి అన్న విషయం ఆ మహాత్ములకు బాగా తెలుసును. పరిణామశీలత, దాని స్థాయిలను బట్టి ఆయా విషయాలను వెలికి తీస్తూ వుంటారు. ఈ విషయాలలో వారికి సలహాలు సూచనలు యివ్వవలసిన అవసరం లేదు. అంతా క్షుణ్ణంగా

వారికే తెలుసును. జనసామాన్యం ఒక్కమారు తమ "అవివేకం"లో వారిని "అజ్ఞానులు" అనుకోవడం కద్దు. ఏది సరయిన మార్గం, సక్రమంగా ముందుకు వెళ్ళటానికి అవసరం అయిన వివేకం యెలాంటిది.... అన్న విషయం వారికి తెలిసినంతగా మరెవ్వరికీ తెలియదు. తెలుసును గదా అని వారు విషయాలను అధికారికంగా, అందరూ ఆమోదించి తీరవలసిందేనని శాసిస్తూ మాట్లాడరు. "అన్నీ యెరుగుదుం"- అన్న అతిశయం ప్రదర్శించరు. ఇతరులను చిన్న చూపు చూడరు.

తన అధ్యాత్మ విద్యను గురించి ప్రదర్శనలు యిస్తూ, యేదో అవతార మునో భగవంతుడినో మహామహుడినో తలుచుకుని ఆ సిద్ధులను చూపే ప్రయత్నం చేయబూనుకునేవారు తన్మయులు (MYSTIC) అవుతారేమోగాని వారిని "మహాత్ములు" అని పరిగణించి పేరుపెట్టటానికి వీలులేదు. ఏదో ఒక మతానికి, తత్త్వానికి, ప్రాంతానికి చెందిన లక్షణాలనుంచి బయటపడలేని వారిని మహాత్ములు అండానికి కుదరదు.

ప్రాచ్య దేశాలలో "గుప్తవిద్య" అనే పేరుతో వ్యవహరించే అధ్యాత్మ విద్యను పాశ్చాత్య దేశాలలో "MAGIC" అని వ్యవహరించేవారు పూర్వం. అన్ని శాస్త్రాలు అన్ని విజ్ఞానాలు ఈ గుప్తవిద్యలో అంతర్భాగాలే. దీనిలో మిళితం అయిపోయినవే. గుప్తవిద్య విశ్వవ్యాప్తమయినది. ఏదో ఒక ప్రాంతానికి, గుంపుకు, పాక్షికతకు తలవొగ్గి పరిమితమై వుండేదికాదు. విశ్వ వ్యాప్తమయిన విధానం అది. చారిత్రక, భౌగోళిక పరిధులకు లొంగిపోయేది కాదు.

సత్యం ఒక్కటే అయినప్పుడు దానిని సాధించటానికి, దానిలో పరిపూర్ణత సంతరించుకోవటానికి మార్గంకూడా ఒక్కటే అయివుండాలి. ఆ మార్గాన్ని ముక్కలు ముక్కలు చేయడంగానీ ఖండాలుగా విభజించడంగాని సాధ్యం కాకపోవచ్చును. సూర్యబింబంనుంచి కిరణాలు వేరువేరుగా ప్రసరించి నట్లుగానే, యీ మార్గాలు బహిర్గతం కావచ్చును. ఇవి విడిపోతాయి తప్ప తిరిగి యేకం కావు. వాటినన్నిటినీ కలిపి ఒక కట్టగా తయారుచేసినా భార మయిన మూటగా తయారవుతుందిగాని సూర్యబింబంగా యేర్పడదు.

మహాత్ముల అసలయిన పేర్లు, గుప్తశాలల పేర్లు (అధ్యాత్మ విద్యను నేర్పే పాఠశాలల పేర్లు) విచ్చలవిడిగా అందరికీ- అయినవారికీ కానివారికీ-



జన సామాన్యానికి తెలివిడి చేయడానికి కుదరదు. దివ్యజ్ఞాన సమాజ వ్యవస్థా పకులలో ప్రధానులయిన యిద్దరికి తప్ప (ఆల్కాట్, బ్లావట్స్కీలు) తతిమ్మా వారికెవరికీ అసలయిన పేర్ల వివరం తెలియదుగాక తెలియదు.

దివ్యజ్ఞాన దేవాలయాన్ని అవరించి కొన్ని తెరలు వున్నాయి. వీటిని తొలగించుకుని త్వరత్వరగా అంతరంగ విద్యలను అవగతం చేసుకోవాలనే ఉత్సాహం ఆరంభికులకు మిక్కుటంగా వుంటుంది. అయితే ఇలా కేవలం ఆరాటం, ఉత్సాహం మటుకే కాకుండా క్రమంగా విద్యను దానికి అవసరం అయిన సుశిక్షణ ద్వారా కరతలామలకం చేసుకోవడం అనే పద్ధతి అందరికీ సుగ్రాహ్యం కావాలి.

మామూలు మనుషులు అధ్యాత్మ విషయాలలో కొద్దిపాటి ఆసక్తి చూపుతారు. ప్రపంచంలో వున్న అనేక మత సంప్రదాయాలను గురించి తెలుసుకోవాలనే ప్రయత్నం చేస్తారు. నిజానికి దివ్యజ్ఞాన సమాజం యొక్క రెండవ ముఖ్యోద్దేశ్యం యిదే గదా ! ఈ మాత్రం ఆసక్తి చూపడంవల్ల నిజమైన శిష్యులుగా నమోదు అవడం కుదరదు. అలా నమోదు అవటానికి అవసరం అయిన సరంజామా పోగుచేసుకుంటున్నాడన్నమాట. మహాత్ములకు తనకు మధ్యవున్న అంతరువులను క్రమంగా తొలగించుకుంటూ పోయి క్రమంగా వారి సాన్నిధ్యంలో కూర్చోగల శక్తి సంపాదించుకుందుకు ఇది ప్రథమకర్తవ్యం. తన సుగుణశీలతలవల్ల, ప్రవర్తనతీరులవల్ల మహాత్ములదృష్టిని ఆకర్షించటానికి అవకాశంవుంది. దివ్యజ్ఞానసమాజంలో సభ్యుడుగాచేరడంవల్ల, దాని పరమప్రయోజనాలకు అనుగుణంగా ప్రవర్తించే ప్రయత్నం చేయడంవల్ల వారికి మరింత దగ్గరివాడు, అప్పుడు అవటానికి అవకాశం వుంది. 'వారుప్రారం భించిన సమాజం ఇది. దానికోసం అనవరతం పనిచేయడం నా కర్తవ్యం'- అనే పూనిక కొత్త వ్యక్తికి సహజంగా యేర్పడాలి. ఈ సమాజంవారి పర్య వేక్షణలో పరిరక్షణలో వున్నదనే విషయంకూడ అతడు గమనించగలగాలి. ఈ పరిరక్షణకూ కొన్ని పరిమితులు, పద్ధతులు వున్నాయి. సమాజసభ్యత్వమే పరిచయానికి ప్రారంభం అవుతుంది. తరువాత సభ్యుడు తన ప్రవర్తన రీతు లను ఎలా సవరించుకుంటాడో దానిమీద అతని ప్రగతిఆధారపడి వుంటుంది. మహాత్ములు తమ ప్రత్యేక అభిమానాలను, ఆశీర్వాదాలను ప్రసరిస్తారని అనుకోగూడదు. వాటిని ఆశించడం కూడా పనికిరాదు. ఎవరికివారు తమ

వ్యక్తిగత పరిశ్రమలవల్ల సత్ఫలితాలు పొందవలసిందేగాని మహాత్ములు వారి కర్మగతులను మార్చివేస్తారని అనుకోగూడదు. స్వప్రయత్నం, స్వయంకృషి తప్ప యింకేదీ ఎవరినీ రక్షించలేదు.

బాహ్య శిష్యరికం (Lay Chelaship), సాధారణ సభ్యత్వం వల్ల ప్రత్యేక ప్రయోజనాలు, సిద్ధులు యేమీ యేర్పడవు; మహాత్ముల పరిశీలనలో స్వప్రయత్నం వల్ల తగిన యోగ్యతను సంపాదించడం తప్ప. మహాత్ములు కంటికి కనిపిస్తారా, కనిపించరా అనే విషయంమీద యే మాత్రం ఆధారపడి లేదు యీ యోగ్యతానుసంధానం. అతడు చేసే మంచి పనులు, చక్కని ఆలోచనలు, మృదువైన మాటల మీదనే అతని ప్రగతి అంతా ఆధారపడి వుంది. ఇవి సక్రమమార్గంలో లేకపోతే అందుకు తగిన దుష్ఫలితాలువస్తాయి. ఈ మాదిరి శిష్యరికాన్ని గురించి గొప్పగా ప్రకటించుకోవడం, అచార్యునితో ప్రత్యక్ష సంబంధం యేర్పడిందని చెప్పుకోవడం- ఆయా వ్యక్తుల అహంకారానికి అతిశయానికీ ప్రతీక తప్ప మరేం కాదు. అటువంటివారు ప్రగతి ముందు బాటలకు అర్హులుకారు. ముఖ్యమైన విషయం యేమిటంటే- మహాత్ముల సాన్నిధ్యము, మహదాశీర్వచనము పొందటానికి అవసరం అయిన పనులు చేయడం, అలా చేస్తూ వుండే కృషిని కొనసాగించడం....యెంతో ముఖ్యమైన సాధనం. ముందు అర్హత, యోగ్యత సంపాదించాలి. తరువాత మహాత్ములతో సంవిధానం, సాక్షాత్కారం తగిన సమయంలో అవే ఒనగూడుతాయి. ఆత్మీయత యేర్పడుతుంది. అర్హత సంపాదించకుండానే దానికోసం అంగలార్చడం తప్పు.

దివ్యజ్ఞాన వాఙ్మయంలో 'చేల' అనేమాట (CHELA) చాల ప్రచారం లోనికి వచ్చింది. ఈ మాటకు అర్థం 'శిష్యుడు' అని- అంటే నేర్చుకునేందుకు సంసిద్ధంగా వున్నవాడు, అని. మాటలకు అర్థాలు, నిజమైనవి ఒకటయితే అతి ప్రచారంవల్ల, వాడుకవల్ల వాటిచుట్టూ చేరే దురర్థాలు చాలావుంటాయనే విషయం మనం గమనించాలి. 'మహాత్ములు', 'భగవంతుడు'- యీ మాటలు కూడా ఈ కోవకు యేమీ మినహాయింపు కాదు.

మహాత్ములు. మహాత్ములుగా ప్రచారం పొందేవారు; ఈ రెండు తెగల వారినీ మనం ప్రపంచంలో గమనిస్తూనే వున్నాం. అలాగే శిష్యులు, శిష్యుల



లాగ నటించి కనిపించేవారు (తెలుగులో 'అషాఢభూతి' అనే ఒక పడికట్టు మనిషి యిందుకు చక్కని నమూనా) తప్పనిసరిగా వుంటారు. మహాత్ములు కూడా ఒక దశలో శిష్యులే; తమకంటే ఉన్నతులయిన వారికి శిష్యతుల్యులే. అలాగని ఇప్పుడిప్పుడే ఆధ్యాత్మిక ప్రాంగణంలో ప్రవేశిస్తున్న కొత్త శిష్యుడివి ఉన్నత ప్రమాణాలు అందుకున్న మహాత్మునితో జత కలిపి ఇద్దరూ ఒకటే అనుకోవడం కుదరదు. శిష్యులకు కూడా కొంత సాధన సంపత్తి సమకూడుతుంది. కొన్ని శక్తియుక్తులు కరతలామలకం అవుతాయి. అయితే వీటిని అతడు విచ్చలవిడిగా, యధేచ్ఛగా వినియోగించడానికి, ప్రదర్శించిబాహాటంగా తిరగడానికీ అవకాశం వుండదు. బాహ్య ఆడంబరాల కోసం ప్రాకులాడడం శిష్యత్వ లక్షణాలకు పూర్తిగా వ్యతిరేకమైన ధోరణి. అసలు అటువంటి శక్తులు తనకు ఉన్నాయనే విషయాన్నికూడా అతడు పైకి చెప్పకూడదు; లోపల గర్వకారణంగా భావించి చరించకూడదు. కొత్తగా అధ్యాత్మ వాతావరణంలో అడుగులు పెడుతున్న వ్యక్తికి యెలాంటి 'సిద్ధులూ' వుండవనే విషయం మనం స్పష్టంగా గమనించగలగాలి. అభ్యాసం పెరుగుతున్నకొద్దీనే సిద్ధులు సమకూడటానికి అవకాశం వుంటుంది. సిద్ధులు సంపాదించడం కోసం శిష్యత్వంలో ప్రవేశించడం, ఆధ్యాత్మ వాతావరణంలో అడుగుపెట్టటం అనేవే అసందర్భమైన పని. మానసిక శక్తులను వికసింప చేసుకునేందుకు, వేరే మార్గాలు వున్నాయి. అవిచాలు, అధ్యాత్మికతవైపు చూడనక్కర్లేదు. మానసిక శక్తుల వికాసాన్ని గొప్పగా భావించకుండా యింకా ముందుకు వెళ్ళటానికి ప్రయత్నం చేయడమే ఆధ్యాత్మికత వైపు నడవడం. దేహసంబంధమైన లంపటాలనుంచి దూరం అవడం, కామ సంబంధమైన ఆలోచనలనుంచి వైదొలగడం- నిజమైన మానవతవైపు మొగ్గుచూపడం- తన స్వస్వరూపాన్ని తెలుసుకోవడం కోసం ప్రయత్నం చేయడం....ఇవీ గీటురాళ్ళు. ఆధ్యాత్మికత దగ్గరే ఆగిపోగూడదు మనిషి మళ్ళీ. ఇదికూడా అభివృద్ధిలో ఒక అంతస్థే సుమా- అన్న గమనం తప్పనిసరిగా వుండాలి.

ప్రకృతిలో అనేక 'వివరణలు యింకా తెలియని' సూత్రాలు వున్నాయి; మనిషిలో నిగూఢంగా యెన్నో శక్తియుక్తులు ఇంకా వెలికిరావలసి వున్నాయి. ఈ రెంటినీ కొంతలోకొంత తెలుసుకుందుకు, సాధించేందుకు ప్రయత్నించే వాడే 'శిష్యుడు'. అతను ఈవిషయాలు తెలుసుకోవడం కోసం ఒక 'గురువు'ను ఆశ్రయించడం భారతదేశంలో పరిపాటి. గురువులు అనేక అంతస్తుల్లో

వుంటారు. నిజమైన గురువు తప్పనిసరిగ అధ్యాత్మ విద్యలో, గుప్తవిద్యల్లో నిష్ణాతుడు అయి వుంటాడు. బాహ్యతత్త్వదర్శనాలు, ఆంతరిక వ్యవహార సరళులు తెలుసుకున్నవాడయి వుంటాడు. ముఖ్యంగా ఆంతరిక-గుప్త-కార్య కలాపాలను గురించి ఎక్కువగా పరిశీలన వుంచి జ్ఞానసముపార్జన చేసినవాడు, అనుష్ఠానపరుడు అయివుంటాడు. ప్రకృతి శక్తులను అవగాహన చేసుకోవడమే కాకుండా వాటిని కొంతలోకొంత తన అధికారంలోనికి తెచ్చుకున్నవాడు అతను. అతడిలోనూ ఇదివరకు ప్రక్షిప్తంగానే వున్న శక్తియుక్తులు ఇప్పుడు వికసించ నారంభించాయి గనుక, ప్రకృతి రహస్యాలను మరింత వివరంగా తెలుసుకోవడం అతనికీ ఇప్పుడు సాధ్యం అవుతుంది. నిజమైన గురువు ఇలాంటివాడు.

'శిష్యుడు'గా యేదో ఒక గురువుదగ్గర నమోదు అవడం చాల తేలిక అయిన పనే. తన సాధన క్రమంవల్ల పరిపూర్ణంగా ఎదిగి మహాత్ముడుగానో గురువుగానో తయారవడం మాటలతో అయే పనికాదు. దీనికి చాల పరిశ్రమ, పట్టుదల, ప్రావీణ్యతపట్ల అతి శ్రద్ధ అవసరం అవుతాయి. జన్మతః కొందరు కవులు కావచ్చును. గణితశాస్త్రపరులు కావచ్చును; కర్మాగార యంత్ర నిపుణులు కావచ్చును; రాజనీతిజ్ఞులు కావచ్చును. కాని జన్మతః 'మహాత్ముడు'గా అవతరించిన మనిషి దాదాపు అసాధ్యం అయిన విషయం !

శిష్యత్వ తరిఫీదు అనివార్యమయినది. మనిషిలో మొరటుదనం, అనాగరీకం అంతా శుభ్రంగా తుడిచిపెట్టివేసి, అతడిని 'అసలయిన బంగారం'గా తయారుచేస్తుంది. శిష్యుడు అవగోరుతున్న మనిషిలో యేమాత్రం స్వార్థచింతన, అర్థిక ప్రలోభం, రాజకీయప్రయోజనం, సందేహాల మతలబులు వున్నట్లయితే....యివన్నీ అతనిలో 'సాధన'తో పాటుగా విపరీతస్థాయికి ఎదిగిపోతాయి. బాహ్యాడంబరాలు, క్రౌర్యం, వాచాలత్వం, ఇంద్రియలోలత్వం ....యిలాంటి లక్షణాలు లవలేశమయినా లేకుండా 'లుప్తం' అయిపోవాలి నిజమయిన శిష్యునిలో. అలాంటివి బీజవతుగానయినా అతనిలో యింకా వున్నాయంటే అవే అతనికి తెలియకుండానే మహావృక్షాలుగా తయారయి, అతడు ఆశిస్తున్న ప్రయోజనాలకు 'అడ్డుగోడలు'గా రూపొందుతాయి. మనిషి అసలు రంగు బయటపడుతుంది. అందుచేత ఆదిలోనే మనిషి యీ రంగులన్నీ కడిగివేసుకుని, తుడిచివేసుకుని స్వచ్ఛమయిన స్ఫటికంలా తయారవ



టానికి ప్రయత్నం చేయాలి. మానవతకు సంబంధించిన ఉదాత్త, ఉన్నత విషయాలకు 'ప్రోది'గా తయారవాలి.

మామూలు మనిషి ప్రాపంచిక సుఖాలను కాదనుకుని శిష్యత్వంవయిపు అడుగులు వేయడం కాస్త 'విడ్డూరం'గానే అనిపిస్తుంది. అలా ముందుకు రావలసిన అవసరం అతనికి లేదనిపిస్తుంది- ముందుగా చూచినప్పుడు. అవసరం వున్నది అనుకుంటే- అవకాశ ద్వారాలు తెరుచుకుంటాయి. తనలో 'నికార్సయిన సరుకు' వున్నది సుమా అనే నమ్మకం అతనికి ప్రారంభంలోనే యేర్పడాలి. ఈ విశ్వాసమే అతన్ని ముందుకు తీసుకుపోతుంది.

శిష్యుడికి వుండవలసిన లక్షణాలను ఒక రహస్య గ్రంథంలో యిలా వివరించారు :

పరిశుద్ధమయిన భౌతిక ఆరోగ్యం.

మానసిక, భౌతిక పవిత్రత: ఏమాత్రమూ కర్తి లేకపోవడం.

స్వార్థపరత్వం లేకుండా వుండడం. విశ్వజనీనమయిన ఉదారత, సర్వభూతముల హితమునే కోరుకోవడం.

నిజాయితీ - 'కర్మ' సూత్రాలలో అచంచల విశ్వాసం. కర్మకాండల ద్వారా యితర ఉపాసనల ద్వారా "తప్పించుకు తిరుగుదామనే" ధోరణి లేకపోవడం.

ప్రాణాలకు సైతం తెగించి సాహసవంతగా నిలువగల నేర్పు, ప్రమాద సందర్భాలను గడిచి గట్టెక్కగల ఓర్పు.

దివ్యమైన 'ఆత్మ'కు తాను ప్రతిరూపాన్ని, వాహకాన్ని అనేవిషయంలో అచంచల విశ్వాసం. ఈ విశ్వాసం ప్రజ్ఞాయుతంగా యేర్పడటం.

ప్రాపంచిక ధోరణులకు, నిత్యమూ కలిగే కష్టనష్టాలకు ఉదాసీన వైఖరి. వీటిని ప్రశాంతమానసంతో నిర్లక్ష్యంగా చూడగలగడం.

"నిజమయిన శిష్యుడు" కాగోరే మనిషి యీ లక్షణాలను తనలో తప్పనిసరిగా రూపించుకోవాలి. భౌతిక ఆరోగ్యం సరీగా లేకపోవటానికి కొన్ని కొన్ని పూర్వకారణాలు వుండవచ్చును. వాటిని మనం తప్పించలేకపోవచ్చును. దీనికి మినహాయింపు వుండవచ్చునేమోగాని, తతిమ్మా లక్షణా

లను తప్పనిసరిగా శిష్యుని అర్హతలుగా పరిగణించవలసి వుంటుంది. వీటిలో ఎలాంటి 'రాజీ'కి తగ్గింపుధోరణికి ఆస్కారం లేదు. శిష్యుని ఆంతరిక ప్రకృతి పైవిధంగా తయారవాలి. ఆ రకమైన అంతరిక ప్రకృతే అతన్ని యింకా ముందుకు మునుముందుకు నడిపించుకు వెడుతుంది; సార్థకత చేకూరుస్తుంది.

ఏమనిషికీ తనకున్న శక్తియుక్తులు పరీక్షపెట్టుకు చూచుకునేంతవరకూ తెలిసిరావు. చాల కాలం మనుషులు సామాన్యమైన జీవితం గడుపుతూ జన్మ దాటవేసుకుంటూ పోతారు. ఇది నిజం. అయితే ముఖ్యంగా మనం గమనించ వలసిన విషయం యేమిటంటే 'శిష్యుడు' కాగోరే మనిషి జీవితంలో యెక్కువ సవాళ్ళను, హెచ్చరికలను అందుకుంటాడు. అతని పశుప్రవృత్తి (నీచప్రకృతి) లోని గుణగణాలన్నీ కొట్టవచ్చినట్లుగా పైకి వచ్చి అతని జీవితంలో స్పష్టమైన రూపం, కల్పన తీసుకురావాలని ప్రయత్నం చేస్తాయి. తద్వారా అతడిని సంక్షోభానికి గురిచేస్తాయి. (పరుగెత్తేవాడికే రోడ్డుమీది రాయి తగులుతుంది. అశ్రద్ధగా ఉంటే బొక్కబోర్లా పడిపోతాడు. పరుగులేకుండా ఒకచోట నిదా నంగా కూర్చున్నవాడికి ఏ ప్రమాదమూ లేదు. శ్రద్ధగా ఉన్నాడా, అశ్రద్ధగా వున్నాడా అనే ప్రశ్న యెదురవదు) శిష్యుడు కాగోరువాడు తన జీవిత ప్రసక్తు లకు తాను బాధ్యత తీసుకోగలిగి వుండాలి. ఈ నిర్ణయాలలో యెలాంటి తడబాటు, తొందరపాటు వుండకూడదు. ఉండడమా – ఊడడమా అనేది ప్రశ్న. చక్కగా నిర్ణయం చేసుకొన్నవాడు గురువు స్థానానికి, విముక్త స్థితికి చేరుకుంటాడు. ఊడిపోయినవాడు సమయాన్ని వృథా చేసుకున్నవాడు అవు తాడు. కామాతురత, గర్వము, దంభము, స్వార్థపరత్వము, పిరికితనము.... యిటువంటి నీచప్రకృతులు అతనిలో విలసిల్లకుండా, విస్తరించకుండా తగు జాగ్రత్త తీసుకోవాలి. శిష్యుడు కాగోరువాడు మరో బాధ్యతనుకూడా అంగీక రించవలసి వుంటుంది. ఇది కాస్త విడ్డూరంగా కనిపించేమాట నిజమే. అయితే అక్షరాల నిజం. అదేమిటంటే అతడు తన కార్యకలాపాలలో జరిగిన లోటు పాట్లకు, తప్పులకు బాధ్యత వహించడంతో సరిపోదు. తన జాతివారు, దేశం వారు చేసిన సామూహిక తప్పిదాలకు, నేరాలకు, అన్యాయాలకు తనవంతు బాధ్యత అతను తీసుకోవలసి వుంటుంది. ఆయా పనులతో అతనికి ప్రత్యక్ష సంబంధం, సంపర్కం లేకపోయినప్పటికీ, సామూహిక, జాతీయ కర్మలనుంచి తనసుతాను మినహాయించుకుందుకు కుదరదు. సాంఘిక జీవనంలో వున్న తక్కువతనాన్ని, ద్వంద్వ ప్రవృత్తిని,- యిత్యాది తప్పిదాలను అతను





వ్యతిరేకించి వాటిని రూపుమాపటానికి, బహుజన అభిప్రాయం యిలాంటి దుశ్చర్యలకు వ్యతిరేకంగా యేర్పడడానికే కృషి చేయవలసి వుంటుంది. అతనిలోనే యేదయినా దుశ్చింతలు, కల్మషాలు వుంటే అవి తప్పనిసరిగా పైకి వచ్చి కూర్చుంటాయి. అతనికి తెలియకుండానే అవి విపరీతస్థాయిలో యెదిగి మార్గంలో కంటకాలుగా తయారవుతాయి. గొప్ప నైతిక పోరాటం జరుగుతూ వుండవలెనన్నమాట అతని పరిసర వాతావరణంలో. నాగరికతలను, సాంఘిక కట్టుబాట్లను, మర్యాదలను చాల జాగ్రత్తగా పరీక్షపెట్టి చూచుకోవాలిఅతడు. పరీక్షలకు గురి అవుతున్నాడు గనుక, అతనొక 'మాయప్రపంచం'లో రోజులు గడుపుతున్నాడన్నమాట. తప్పిదాలు బహుసుందరరూపం ధరించి అతని ముందు ప్రదర్శితం అవుతాయి. అతన్ని ఆకట్టుకుందుకు ప్రయత్నిస్తాయి. అతని సామాన్యకామనలకు, సంకల్పాలకు సంఘర్షణ కొనసాగుతూవుంటుంది, అతడు అంతిమ విజయపతాకను ఎగురవేయగల స్థాయికి చేరుకునేంతవరకూ.

స్వార్థపరత్వం అనేది గొప్ప నటన చేయగలదు. మనిషి వ్యక్తిత్వాన్ని ఉన్నతపరుస్తున్నట్లే కనిపిస్తూ, అతనిలో మరింత క్రౌర్యాన్ని, స్వప్రాము ఖ్యాన్ని పెంపొందించుతుంది. స్వార్థపరత్వం వున్నంతవరకు, అసలయిన జ్ఞానం మనిషిలో వికసించదు, ఎదగదు.

మనిషి తన శరీరాన్ని- ఇంద్రియాలను- దోషాలను, లోటుపాట్లను- దుఃఖాన్ని, విచారాలను- గడిచి గట్టెక్కాలి. ఇవి తనను లోగొనకుండా, తన మీద పెత్తనం చెలాయించకుండా బహుజాగరూకంగా వుండడం అలవరచు కోవాలి. ఆ తరువాత- మనస్సు, బుద్ధి, ఆత్మలతో తాదాత్మ్యం పొందేస్థాయికి ఎదగాలి. 'ఆత్మబుద్ధి మనస్కుడు'- నిజమైన మనిషి. అంటే యిప్పటికి తన స్వస్వరూప జ్ఞానాన్ని సంపాదించుకుని, సాధించగలిగాడన్నమాట. ఆత్మ సంయమనం పొందడంతోపాటు కర్మఫల త్యాగం, మోక్షమార్గ ప్రవేశం జరుగుతాయి. 'అచ్చపు చీకటింబడి గృహవ్రతుడై .... చచ్చుచు పుట్టుచున్ మరల చచ్చుచు'........ అన్నట్లుగా చర్విత చర్వణమైన జీవన వ్యవసాయం కాకుండా జీవితోన్నతిని వికాసాన్ని పొందుతున్నాడన్నమాట.

శిష్యుడు కాగోరే వ్యక్తి తన గురువుకు విధేయంగా వుండడం, ఆయన అంతరంగాన్ని గ్రహించగలిగి తదనుగుణంగా వర్తించడం నేర్చుకోవాలి. గురువు ఉద్దేశ్యం, హృదయంలోని ప్రయోజన శీలత యేమిటో క్షుణ్ణంగా తెలుసుకోగల చాకచక్యం సంపాదించాలి.

ఎవరూ యెవరినీ 'నీవు శిష్యుడుగా తయారు అవు'- అని బలవంతం చేయరు. కనీసం సూచించరుకూడా. అయితే శిష్యుడు కాగోరేవాడు తన స్వప్రజ్ఞవల్ల, స్వయిచ్ఛవల్ల యిందుకు ఒడబడుతున్నాడు. అలాగే-శిష్యత్వపు నియమావళి అంతటినీ చక్కగా తెలుసుకొని తన గమ్యాన్ని సునాయాసంగా చేరుకోగల స్థితిని సాధించాలి. పట్టుదల, ఏకాగ్రచిత్తము, గమ్యంలో విశ్వాసం వుండడం తప్పనిసరిగా అవసరం. గుడ్డి ఎద్దులాగ చేలో ప్రవేశించడం కాదు, శిష్యుడు అధ్యాత్మపథంలో అడుగువేయటం అంటే.

శిష్యత్వంలో అనేక యిబ్బందులు, బాదరబందీలు వున్నాయి. మానవ ప్రకృతిలోని నీచత్వం, తక్కువతనం (Lower Nature)ను గడిచిగట్టెక్కేంత వరకు, తనజీవితాన్ని తానుపునర్నిర్మాణం చేసుకునేంతవరకు యోగమార్గంలో ప్రవేశం కుదరదు. కొత్తరకం జీవితాన్ని ఎవరికివారు ఎన్నుకుని, తయారు చేసుకుని- గడపడం అవసరం. అధ్యాత్మ లోకంలోకి పునర్జన్మ పొందడం (లేక జన్మఎత్తడం=అడుగువేయడం) అంటేయిదే. ఎవరికివారు పునరుజ్జీవులు (Regenerate) అయినప్పుడే వారికి భవిష్యత్తులో సుద్వారాలు తెరుచు కుంటాయి.

క్షుల్లకమయిన విషయాలలో పొంగి పొరలుతున్న మనసుకు ఆధ్యాత్మ సత్యాలు, ఆంతరిక సిద్ధాంతాలు స్ఫురించవు, స్పర్శించవు· అవి తార్కికతకు సంబంధించినవికాదు. వివేకానికి, విచక్షణ జ్ఞానంపెంపుదలకుసంబంధించినవి. 'సదసత్ వివేక చతురత' సమకూర్చే 'చదువు' నేర్వడం అందరికీ అవసరం.

# ప్రబోధక తారకం

మేడం బ్లావట్స్కీ వ్యక్తిత్వం మహోన్నతమైనది.

ఏ విధమైన అమరికలు లేని ఆలోచన ధోరణి ఆమెది.

స్పష్టంగా ఆలోచించడం, పూనికగా కార్యాచరణకు పూనుకోవడం ఆమెకు చిన్నతనం నుంచి అలవాటు అయినాయి.

చిన్నతనంలోని పెంపకం ఆమెకు స్వేచ్ఛను సచ్ఛీలతను నేర్పింది.

దేశదేశాల పర్యటనలలో అనేక సంగతులు నేర్చుకుని, అన్నిటినీ జీవితంలో పెనవేసుకోగలిగింది.

అద్భుతాలు-విచిత్రాలు (Wonders) ఎప్పుడూ ఆమె సరసనే వుండేవి.

ఈమె జీవితం చాల ఇబ్బందికరంగా, దుఃఖభాజనంగా తయారవుతుందని బాల్యంలో బంధువులందరూ తలపోశారు. ఈ తలంపు అబద్ధంకాలేదు. అయితే ఆమె 'పూనిక', 'కృతనిశ్చయం' విపత్కర పరిస్థితులనుగూడా వేడుక సందర్భాలుగా మార్చివేసినాయి. తనకు నియోగించిన పని, తాను చేయబూనుకున్న సత్కార్యాలు ఎన్ని ఆటంకాలు వచ్చినా ఆమెకు వెనుకంజ వేయకుండా నిలిపివుంచాయి.

ఈమెకు 'అద్భుత సృష్టి'తో సంబంధం వున్నదని ఇంటి పనివాళ్ళు బాల్యంలోనే పసిగట్టారు. అయితే పెద్దలు నమ్మలేదు. తొమ్మిదేళ్ళ పర్యటన తర్వాత ఆమె స్వగృహానికి తిరిగి వచ్చినప్పుడు వారికీ నమ్మక తప్పలేదు.

'నేను టర్కీ దేశంలో మొదటిమారుగా యుద్ధంలో పనిచేసినప్పుడు, నా దగ్గరవున్న గుర్రం పేరు ఏమిటి?' అని ప్రశ్న ఒక కాగితం మీద వ్రాసుకుని జేబులోనే పెట్టుకుని తండ్రిగారు పక్కగదిలో కూర్చుండిపోయారు. ఇది ఆమెను పరీక్షించే ఒక సందర్భం. తండ్రిగారి స్నేహితులు యిద్దరు కల్పించిన సన్నివేశం యిది. బ్లావట్స్కీ ఈ ప్రశ్నకు జవాబు సరీగా తన "భూతాల" చేత చెప్పించగలిగితే ఏంచేస్తారు అని స్నేహితులు అడిగినప్పుడు ఆయన 'అమ్మాయిని వెంటనే పిచ్చి ఆస్పత్రికి పంపిస్తాను' అన్నారు. బ్లావట్స్కీ పరీక్షలో నెగ్గింది. ఆమె కనిపించని భూతాలచేత చప్పుళ్ళు చేయించి (Zait-

chick)అనే సమాధానం వ్రాయించింది. అదే సరైన జవాబు కావటాన తండ్రి గారు గూడా ఆమె అతీంద్రియ శక్తులలో విశ్వాసం వుంచక తప్పలేదు.

ఆమెకు ఎన్నోశక్తులు వున్నాయి.

అధ్యాత్మ విద్యకు అనుబంధంగానే వీటిని ఉపయోగించిందిగాని ప్రతిబంధకంగా తయారుచేసుకోలేదు.

'నా గురువులు మృతులు కాదు, మృతుల ఆత్మలుకాదు: వారు సజీవులయిన మానవులే' అని ఆమె బాహాటంగా ప్రకటించింది.

తాను గురువునని ఆమె ఎన్నడూ ప్రపంచానికి చెప్పలేదు. తాను చెబుతున్న సంగతులు కూడా తన స్వంతమైనవేనని అనలేదు. దూరదృష్టి, ఆకాశరికార్డులను చదవగలగడంవల్ల—మహర్షుల ఆశీర్వచనంవల్ల—ఈ పనిఅంతా చేయగలుగుతున్నానని వినయాన్నే వెలిబుచ్చారు. 'నేను నేర్చుకున్న దానిని ఇతరులకు చెబుతున్నాను. అంతే !— ఇదీ ఆమె మాట. పరంపరాగతమైన జ్ఞానం, తరతరాలుగా పరీక్షలకు నిలిచిన జ్ఞానం తన కృతంగా ఇప్పుడు తెలివిడి అవుతోందని అన్నారు.

విశ్వమంతా తనలో నుంచి తానే ఆవిర్భావం అవుతోంది బయటిశక్తుల ప్రభావం వల్లకాదు-అన్నది ఆమె బయలుపరచిన సత్యం. అలాగే మనిషికూడ తన అంతరిక ప్రబోధంవల్లనే ఉత్తీర్ణుడు కావాలన్నారు. జ్ఞానం పుస్తకాలకు పరిమితం కాగూడదు. ఆచరణలో ముందుకురావాలి! ప్లేటో (Plato) మాదిరి ఆమె 'సత్యం యేమిటో తెలుసుకోవడమే మంచిని చేయడానికి మార్గం యేర్పరుస్తుంది' అన్నారు.

వేదాంత విషయాలు, తత్త్వదర్శనాలు మట్టుకేకాదు; ఆమె సంఘసంస్కర్తగాకూడా. పందొమ్మిదో శతాబ్దంలో రష్యాలో బానిసల పద్ధతివుంది. ఒకమారు ఆమె కోపంతో ఒక బానిసపిల్లను చెంపదెబ్బకొట్టారు. అమ్మమ్మగారు ఈ చర్యను ఖండించి, ఆ పిల్లకు క్షమాపణ చెప్పించారు బ్లావట్స్కీ చేత. ఈ సంఘటన ఆమెకు పాఠం నేర్పింది. అన్యాయంగా పరాభవం పొందుతున్నవాళ్ళను ఆమె జీవితాంతం మరచిపోలేదు.

పందొమ్మిదేళ్ళ వయసులో ఆమె 'నాకు ఇంకా నలభై యేళ్ళ జీవితం ముందు వుంది. చోప్స్ (Cheops)లోని పెద్ద పిరమిడ్ కంటె గొప్పదైన పని



చేస్తాను, అంతకంటె కలకాలం నిలిచే పనిచేస్తాను' అంది. వివరిస్తూ 'చోప్స్ ఎవరు? తోటివాళ్ళందరినీ అణగద్రొక్కి వాళ్ళపెట్టి వుంచినవాడు కదూ! నేను ప్రజలందరినీ మానసికబంధాలనుంచి-బానిసత్వం నుంచి వైదొలగేట్లు చేస్తాను' అంది.

ఆమె జీవిత ఆశయం ఇదే అస్పష్టంగా కనిపిస్తుంది: 'మానవజాతిని మానసిక బానిసత్వం నుంచి విముక్తులను చేయడం' గుప్తశాస్త్ర ప్రతిపాదనలన్నీ ఆమెకు అభిప్రాయాలుగాను, వేదాంత వాక్యాలుగాను అనుపించటం లేదు. అంతకంటె మిన్నగా మానవజాతిని విముక్తులుగాచేసే సూత్రాలుగా కనిపించాయి.

మానవ ప్రకృతిని నైజాన్ని మార్చటానికి ముందే రాజకీయ స్వాతంత్ర్యం కోసం పెనుగులాడడం అంటే—పాతసీసాలలో కొత్తపానీయంపోయడంవంటి పని! నిరంకుశత్వం నుంచి ప్రజాస్వామ్యానికి పాలనావిధానాన్ని మార్చవచ్చు. ఆర్థికమార్పులు తీసుకురావచ్చు. కమ్యూనిజం నుండి పెట్టుబడిదారీ వ్యవస్థకో-లేక అటు నుంచి ఇటో మార్పులు తీసుకురావచ్చు. మనుషులు వాళ్ళ నైజం, ప్రవృత్తిమార్చకపోతే ఈ మార్పులన్నీ వృథా! వృథా!! స్వార్థపరులైనవారే పరిపాలకులుగా వున్నంతసేపూ ఎన్ని రాజకీయ సంస్కరణలు తెచ్చి యేంప్రయోజనం? అన్నారు ఆమె.

న్యాయశాసనాలు చేసినందువల్ల, ఉత్పత్తి విధానాలు నియోగించినందువల్ల మనం ప్రజలందరూ సుఖశాంతులతో వర్థిల్లుతారని అనలేము. మానసిక దౌర్బల్యం, బానిసత్వం నుంచి వాళ్ళను విముక్తులను చేసినప్పుడే నిజమైన సుఖశాంతులు. సంఘిక సహకారం, సమాజాభివృద్ధి, దివ్యజ్ఞాన ప్రాతిపదిక మీదనే యేర్పడాలని ఆమె వాదించారు.

వసుధలోని జనావళినంతటిని సోదరత్వ ధోరణిలో కలిసికట్టుగా మనగలిగేట్లు చేసేవి ఈ నాలుగు సూత్రాలే అన్నారు:

1. విశ్వజనీనమైన ఏకత
2. మానవ సంఘటిత శక్తి
3. కర్మసూత్రాలు
4. పునర్జన్మ సిద్ధాంతం

విశ్వమంతటితోను యేకతను మనం విశ్వసించినట్లయితే తోటి జీవరాశులకు బాధ, దుఃఖం కలిగించం. వాతావరణాన్ని కాలుష్యంతో నింపం.

ప్రతి జీవీ- ఎంత క్షుల్లకంగా కనిపించినా- సృష్టిలో అతనికి సముచితమైన స్థానం ఉండనే వుంటుంది. మానవ సంఘటిత శక్తిలో నమ్మకం వుంటే యుద్ధాలు చేయాలి; బలహీనులను మరింత నీరసపరచం. అందరినీ సమాదరిస్తాం. మన భావనలు, ఆలోచనలు, పనులు సమశృతిలో వుండేట్లు చూచుకుంటాం.... ఇలాంటి ఆధారసూత్రాలమీద చింతనం చేసినందువల్ల మానవులలోని బానిస భావాలు, దరిద్రం తొలగిపోతాయి- అని ఆమె వక్కాణించారు.

భయం, అసూయల నుంచి జనాన్ని కాపాడాలి.

అన్నం, బట్ట, వసతి ఇవ్వగలిగితే చాలదు.

జీవిత విలువలు నేర్పగలగాలి.

అన్నం లేకపోవడం శరీరానికి బాధ, నిజమే. ఉన్నత విలువలు లేకపోవడం అధ్యాత్మ జీవనానికి- పరిపూర్ణ జీవనానికి- కొరత. బట్ట లేకపోవడం మానభంగమే. కాని సత్య అస్కారం లేకపోవడం అసమానత. శరీరానికి శృంఖలాలు అసహ్యంగా కనిపిస్తాయి. మనసుకు వేసుకున్న శృంఖలాలు అంతకన్నా ఘోరమయిన పరితాపం తీసుకువస్తాయి. ముందు మానసిక బంధనాలు తెంచుకుంటే తతిమ్మా బంధాలు వాటంతట అవే సడలిపోతాయి.

ఆమె ఆలోచనలు భవిష్కత్కాలానికి సంబంధించినవి. అనువైన కాలంకంటె చాల ముందుగా జన్మించారు ఆమె, అనిపిస్తుంది.

సాంఘిక సంక్షేమం ఆమెను ఎంతగానో అకర్షించిన విషయం.

ముందు తరాలను ఎంతగానో ప్రభావితం చేశారు ఆమె. అనుయాయులందరికీ స్ఫూర్తి, ప్రోత్సాహము ఇచ్చారు. ఆమెనుండి అధ్యాత్మశక్తి అనుక్షణము ప్రసరిస్తూ వుండేది; ప్రపంచానికి ప్రశాంతత తీసుకువచ్చేది. ఆమె నీలి కళ్ళు కాంతిపుంజాలు. ఎందరికో ఇప్పటికీ మార్గదర్శకంగా వున్నాయి.

హెచ్.పి.బి. ఎవరు అంటే ఏమని సమాధానం చెప్పగలం ? ఆమె జీవితం, ఆమె బోధనలు జవాబు చెప్పవలసిందే. వేరే మాటలవల్ల ప్రయోజనం లేదు.

# ర హ దా రి

ఒక 'రహదారి' ఉన్నది;

చాలా సూటి అయినది- ముళ్ళతో నిండినది.

ఆ దారివెంట ప్రయాణం చాల కష్టం.

అయినా అదే 'రహదారి'

మనిషిని విశ్వహృదయ గ్రంధికి తీసుకుపోతుంది.

ఆ దారిని కనుగొనే మార్గం నేను చెప్పగలను.

దాని తలుపులు 'లోపలకు' మూసుకుపోతాయి.

ఒక మనిషి ప్రవేశించగానే ఆ తలుపులు లోపలకు గడియపడిపోతాయి.

సాహసం జయించజాలని ప్రమాదం యేమీలేదు.

దృఢమయిన మేధ పరిష్కరించలేని సమస్య యేమీలేదు.

నిష్కళంకమయిన పవిత్రత గెలుపొందలేని పరీక్ష యేదీలేదు.

లోపలకు ప్రవేశించిన వారికి అంతకంటె సాధించవలసినది ఇంకేమీ లేదు.

మానవాళిని నడిపించటానికి, ఆశీర్వదించటానికి వారే యోగ్యులు.

ఈ ప్రయాణంలో విఫలులైనవారు కుందవలసిన పనిలేదు.

ముందు ముందు ఇంకెన్నో జన్మలు ఉన్నాయి.

పూనికతో విజయాన్ని సాధించవచ్చు.

-మేడం బ్లావట్‌స్కీ

Scanned with CamScanner

# దివ్యజ్ఞాన సమాజము

## (THE THEOSOPHICAL SOCIETY)

(1875 నవంబర్ 17వ తేదీన న్యూయార్క్‌లో ప్రారంభం.)




"సత్యాన్నాస్తి పరోధర్మః"

# దివ్యజ్ఞాన సమాజము

## THE THEOSOPHICAL SOCIETY

1875 నవంబర్ 17వ తేదీన న్యూయార్క్ నగరంలో ప్రారంభం.

1905 ఏప్రిల్ 3 తేదీన మదరాసులో ఇన్‌కార్పోరేట్ అయింది

దీని మూడు ముఖ్య ఉద్దేశ్యములు :

★ జాతి మత కుల లింగ వర్ణ వివక్షత లేని విశ్వమానవ సౌభ్రాతృత్వ అణుకేంద్ర నిర్మాణము.

★ సర్వమత సామరస్యము, తత్త్వము, విజ్ఞాన శాస్త్రముల పఠనమును ప్రోత్సహించుట.

★ అవ్యక్తములైన ప్రకృతి ధర్మములను, అంతర్గతమైన మానవ శక్తులను పరిశోధించుట.

భారతదేశ కేంద్ర స్థానం : వారణాసి (ఉత్తరప్రదేశ్)